



ముఖచిత్రం : రత్నాల రంగవల్లి
మా తెలుగు తల్లి!

చిత్రకారుడు : వడ్డాది పాపయ్య


యువ సాలుచందా రూ. 36-00

దీపావళి సంచికతో రూ. 42-00

యువ, హైదరాబాదు-500001

విజయ సాధనకు మార్గదర్శి 999 అనే తారక మంత్రమే!

ఓవర్‌లాక్ మిషన్లు

ఎరువుల మూటలు
కుట్టు మిషన్లు

ఇవేగాక
"గుహ"
ఓవర్‌లాక్ మిషన్లు
శివా కుట్టుమిషన్లు
మోటార్లు

వివరాలకు:
ఫోన్ { 22698
27876
సంప్రదించండి

పంపిణీదారులు

**జయగజలక్ష్మి మెషినరీస్**

2/156, (పై మేడమీద) బ్రాడ్వే, మద్రాసు-600001.
* అన్నిచోట్లా డీలర్లు కావలెను *



స్వర్గీయ "చక్రపాణి" గారి అమృత హస్తాలతో రూపం దిద్దుకొన్న "యువ" ఆనాటినుండీ ఈనాటి వరకూ అదే స్థాయిలో అపురూపంగా కొనసాగుతూ వస్తున్నందుకు ఎంతో సంతోషంగా వుంది.

**డిసింబర్ వలోనికథలలో** శ్రీ పి.వి. రమణగారి "విశ్వరూపం", అరవిందగారి "కళ్ళు" చెళ్ళూరిగారి "వడ్డించని విస్తరి" ఆలోచనాత్మకంగా వున్నాయి. "విశ్వరూపం" వెరైటీ రచన. ఎక్స్‌రే వంటి రచన యర్రంశెట్టి "ఓటమి" బాగుంది.

-డి.సుధాకర్, భారతి,కమల, గోపీనాథ్.
గుట్టల బజార్, ఖమ్మం.

మా అభిమాన పత్రిక 'యువ'కి మా 'న్యూ ఇయర్' శుభాకాంక్షలు.

ఈ నెల 'యువ' శీతల హేమంతిని ముఖచిత్రముతో సోయగాలు వెదజల్లుచు మా చేతికందింది. యర్రంశెట్టి శాయిగారి నవల చివరివరకు హుషారుగాను, కొత్త తరహాగా యుంది

కథలన్నీ చిన్నవైనా, అన్నీ బాగానే యున్నవని చెప్పాలి కృష్ణమూర్తిగారి

ప్రతి కథ (అందమైన చీర) ఒక వెరైటీ ముగింపు మార్వలెస్ మల్లాది గారి కథలు మళ్లీ (+) ఆది నుండి చదివిన మళ్లీ (మరల) చదవాలని పిస్తాయి,

'శ్రీ చక్రపాణిగారి అవార్డులు' బహుకరణతో రచయిత, రచయిత్రులకు మీరిస్తున్న ప్రోత్సాహము ప్రశంసించదగింది. తద్వారా మేము ఉత్తమ నవలలను, కథలను చదవగలమని సంతోషించుచున్నాము.

పి. పార్వతీశం, మెయిన్ రోడ్డు,
—బొబ్బిలి, శ్రీకాకుళం జిల్లా.

శ్రీ వడ్డాది పాపయ్యగారి కుంచెతో వెలువడిన మీ (మా) యువ చదివాము. చాలా బావుంది ముఖ్యంగా కథలలో వాణిశ్రీగారి "దొంగ" కథ బావుంది రచయిత్రికి థ్యాంక్స్ ఇకపోతే శ్రీ పోల్కంపల్లి శాంతాదేవిగారి సీరియల్ "ప్రేమపూజారి" యువకే ఒక హైలెట్! చదివినకొద్దీ చదవాలని అనిపిస్తుంది, ఈ సీరియల్ ఇంత మంచి సీరియల్‌ను ప్రచురించుచున్న మీకు మా కృతజ్ఞతలు

—పత్తి శివప్రసాద్, జవ్వాజి సత్య ప్రకాశ్ రావ్
శ్రీ యన్.టి.ఆర్. అభిమానసంఘం,
యన్. టి. ఆర్. వీధి, జగిత్యాల.





పసి బిడ్డకు
జీర్ణసంబంధమైన
బాధలు కలిగినప్పుడు...

సౌమ్యంగా పనిచేసే

# అమృతాంజన్ గ్రైప్ మిక్స్చర్

బాధను అతి త్వరగా తగ్గిస్తుంది




గృహౌషధములు
తయారుచేయుటలో
తరతరాలుగా
నమ్మికకు పాత్రమైన
అమృతాంజన్ వారి
తయారీ.

కడుపునొప్పి, అజీర్ణము, వాయువు, పళ్ళు వచ్చేటప్పుడు కలిగేబాధలు మొదలైన వాటిలో దేనితోనైనా సరే, మీ పసిబిడ్డ బాధ పడుతూంటే అమృతాంజన్ గ్రైప్ మిక్స్చర్‌తో అతి త్వరగా ఉపశమనం కల్గించండి త్వరగా సులభంగా తిరిగి మీ పసిబిడ్డ ఆనందంగా నవ్వుతుంది.

అమృతాంజన్ లిమిటెడ్

DBM 3410/2 TG

# అజంతా ఎల్లోరాల అందాల లోకంలో...



## హరివిల్లు విరిసింది, కావ్యం కళ్లు తెరచింది

అజంతా ఎల్లోరాల అద్భుత నేతగాళ్ల దగ్గరకు-పెదవి మీద చిన్న ప్రార్థనతో.
వారి భావికోసం ప్రణాళికలతో, గుండెడు ఆశతో వెళ్లాం—ఒకనాడు వారు సృష్టించిన వేలం
అందాలను తిరిగి సృష్టించడానికి, వాటి అందాలను అందరితో పంచుకొనడానికి, వాటిని
వేసుకొన్న వారి మనసులను, వాటిని చూసిన వారి హృదయాలను ఆనందంతో నింపడానికి.
దాంతో ఈనాడు మైమరపించే వస్త్రాలు సాధ్యపడ్డాయి.. మీడియం, ఫైన్, సూపర్ ఫైన్
కాటన్లు, మల్ మల్, చీరలు, షర్టింగులు, వాయిల్స్, దుప్పట్లు, సూటింగులు...టెక్స్‌కాం
ఉత్పత్తి చేసే ప్రతి వస్త్రంలో—మన పురాతన అందాల వైభవం తొంగిచూస్తుంది.

## వస్త్రాలలో కొత్త అందాలకు టెక్స్‌కాం

టెక్స్‌టైల్ కార్పొరేషన్ ఆఫ్ మరాఠ్వాడా లి., ఎస్ మార్ బిల్డింగ్, అదాలత్ రోడ్, ఔరంగాబాద్ (మహారాష్ట్ర)

లింటాస్-TT.4-172 TE

# మీ భవిష్యత్తు అదృష్టకరమైనదా?




ఈ ప్రశ్న జ్యోతిష్కుడ్ని అడక్కండి ఐఓబిని అడగండి. మీరు ప్రతిమాసం అయిదు రూపాయలుగాని లేక అయిదువందల రూపాయలు గాని పొదుపుచేయగలిగితే దాన్ని అనేక రెట్లుపెంచి మిమ్మల్ని గొప్ప అదృష్టవంతులుగా మార్చే ప్రణాళిక లెన్నో మా దగరున్నాయి.

ఏ సందర్భానికైనా సులువుగా కావలసిన పెద్ద మొత్తాల్ని అందజేయడానికి అనుగుణ్యంగా ఇండియన్ ఓవర్‌సీస్ బ్యాంకు ఎన్నో ప్రణాళికల్ని రూపొందించింది. వాటిలో ఇవి కొన్ని.

**రీ ఇన్వెస్ట్‌మెంట్ డిపాజిట్ ప్లాను**
ఇది మీ పెట్టుబడిని నిర్ణీత వ్యవధిలో అనేక రెట్లు పెంచుతుంది.

**ఆటోమేటిక్ క్యుములేటివ్ వెడ్డింగ్ డిపాజిట్టు**
మీ పిల్లల వివాహానికి కావలసిన డబ్బు పొదుపు చేసేందుకు యిది సులభ మార్గం.

**రికరింగ్ డిపాజిట్టు**
ఈ ప్రణాళిక మీరు ప్రతినెలా పొదుపుచేసే చిన్నచిన్న మొత్తాల్ని కొన్నాళ్ళకు ఒక పెద్ద మొత్తంగా పెంచేందుకు సహాయం చేస్తుంది.

**లాంగ్‌టర్మ్ బెనిఫిట్ డిపాజిట్టు**
ఈ ప్రణాళికలో మీరు కట్టే ప్రతి మొత్తమూ (అంతకుమించిన సొమ్ము కూడా) వడ్డీతో భద్రంగా మీకు తిరిగి ఇవ్వబడుతుంది.

వీటి వివరాలు మరింకెన్నో ఆకర్షణీయమైన ప్రణాళికల వివరాలు తెలుసుకోవాలంటే మీకు సమీపంలో ఉండే ఇండియన్ ఓవర్‌సీస్ బ్యాంకు శాఖను దర్శించండి. లేక మా అడ్రసుకు వ్రాసి కరపత్రాలు కరపత్రాలు తెప్పించుకోండి. "మీ సొమ్ము అభివృద్ధికి పదునాలుగు మార్గాలు" మి కందులో లభిస్తాయి.

**అవసరమైనంత డబ్బును మాత్రమే నేడు ఖర్చుపెట్టండి. మిగతా సొమ్మంతా మరోనాటికి పొదుపుచెయ్యండి.**






**ఇండియన్ ఓవర్సీస్ బ్యాంక్**
మీ ఔన్నత్యాన్ని కోరే ఉత్తమ మిత్రుడు

# యువ

సచిత్ర మాసపత్రిక

సంస్థాపకులు : చక్రపాణి

సంపుటి 35 జనవరి, 1977 సంచిక 1


ఇరవయ్యో శతాబ్దంలో ఎన్నడూ కని, విని యెరుగని ఆపత్తు ఆంధ్ర దేశానికి యీ సంవత్సరం వచ్చింది. అది, నవంబరు నెలలో వచ్చిన తుపాను. అంత పెద్దతుపాను, ఇదివరకెన్నడైనా వచ్చిందేమో అని అనుకోడానికి చరిత్రలో ఎక్కడా అలాటి ప్రసక్తిలేదు అంచేత, నవంబరులో వచ్చిన తుపానులాంటిది, ఆంధ్రదేశచరిత్రలోనే ఎన్నడూ రాలేదేమో అని అనుకోవచ్చును.

నవంబరు ఆఖరివారంలో వచ్చిన తుపాను ఆంధ్రదేశంలోని కోస్తా జిల్లాలలో ప్రళయతాండవం చెయ్యడమేకాక, మెట్టజిల్లాలను కూడా దెబ్బకొట్టింది. ఈ తుపాను రాకముందే, రెండుసార్లు, చిన్న, చిన్న తుపానులు వచ్చి పంటలకు బాగా నష్టం కలిగించాయి మూడోసారి వచ్చిన తుపాను, ఈ సంవత్సరపు పంటలను పూర్తిగా ధ్వంసంచేసింది. పూర్తిగా ధ్వంసం చేసింది అనేమాటలో కించిత్తు కూడా అతిశయోక్తిలేదు తుపాను వరదల వల్ల దాదాపు 150 మంది వ్యక్తులు చనిపోయారని వార్త చనిపోయిన వారు చనిపోగా, బ్రతికివున్న లక్షలాది ప్రజలజీవితం చావుకన్న కనికష్టంగా పరిణమించింది పంటలు పూర్తిగా ధ్వంసంకావడము, ఇళ్ళు కూలిపోవడము, సామానులు వరదలకు కొట్టుకొనిపోవడము మొదలైన నష్టాలవల్ల, ప్రాణాలతో నిలబడిన వ్యక్తుల జీవితం చావుకంటే దుర్భరమైంది

ప్రభుత్వోద్యోగుల అంచనా ప్రకారం, తుపాను దెబ్బవల్ల 30 లక్షల ఎకరాలలోని పంట నాశనమైందని తెలుస్తోంది. ఒక ప్రాంతంలో ఎకరానికి ఇరవై బస్తాల ధాన్యం పండితే, మరొక ప్రాంతంలో ఎకరానికి పది బస్తాలే పండుతుందనుకున్నా సగటులెక్కలో, 30 లక్షల ఎకరాలలోను పండవలసిన 450 లక్షల బస్తాలధాన్యం, యీ సంవత్సరం నాశనమైందన్నమాట. బస్తా ధర డెబ్బయిరూపాయల చొప్పున లెక్కకడితే, కనీసం మొత్తం 315 కోట్ల రూపాయల పంటనష్టమైందని అనుకోవచ్చును. పంటనష్టంకాక, కూలిపోయిన యిళ్ళు, కొట్టుకుపోయిన సామానుల విలువకూడా పరిగణిస్తే, తుపాను దెబ్బ వల్ల కనీసం నాలుగువందల కోట్లరూపాయల నష్టం కలిగిందని చెప్పవచ్చును. ఈ నష్టమంతా ఎవరిది ? సామాన్య ప్రజలది; రైతులది. పంటలు సరిగా పండక ఏదో కొంత నష్టం కాదు. పంట పూర్తిగా ధ్వంసమై, ఒక్క గింజ తమ యింటికి రాకపోగా, తాము పెట్టుబడిపెట్టిన మొత్తం డబ్బు నాశనమై పోవడం. పైగా, పంటలు నాశనమైన పొలాలలో రెండోపంట వెయ్యడానికి అవకాశంలేదు.

ఆ రైతుల పరిస్థితి ఏమిటి ? ఏడాదిపాటు తాము బ్రతకడానికి ఆధారం కావాలి; మళ్ళీ వ్యవసాయం చెయ్యడానికి ఎరువులు, విత్తనాలు కొనుక్కో డానికి పెట్టుబడి కావాలి. అంటే, దాదాపు వెయ్యికోట్ల రూపాయల పెట్టు బడితో ఆ రైతులకు సహాయం చెయ్యవలసిన పరిస్థితి ఏర్పడింది.

ఈ విషయాలన్నీ, రాష్ట్రప్రభుత్వమూ, కేంద్రప్రభుత్వమూ సమగ్రంగా పరిశీలించి, నష్టపడిన రైతులకు అన్నివిధాలా సహాయం అందజెయ్యడానికి శీఘ్రగతిలో చర్యతీసుకుంటారనే విషయంలో మాకు సందేహంలేదు సహాయం ఏ పరిమితిలో జరిగినా వెంటనే జరగాలి. ఆపత్సమయం దాటిన తరువాత వచ్చేసహాయం ఎంత పెద్ద సహాయమైనా నిష్ప్రయోజనమౌతుంది అంచేత, సహాయకార్యక్రమాలు వెంటనే అమలుజరిపించి, దిగ్భ్రాంతిలో నిర్జీవిగావున్న ప్రతి రైతుకూ తన కష్టాలను ఎదుర్కొనే ధైర్యాన్ని, శక్తినీ కలిగించడం అవసరం.

సుమారు 450 లక్షల బస్తాలపంట ధ్వంసం అయినందున, రాష్ట్రంలో ఆహారధాన్యాల కొరత ఏర్పడుతుందా అనే విషయాన్ని ప్రభుత్వం జాగ్ర త్తగా ఆలోచించి ఆ కొరతను సవరించడానికి కావలసిన ఆహారధాన్యాలను వెంటనే ఇతర రాష్ట్రాలనుంచి తెప్పించి రాష్ట్రంలో నిలవచెయ్యడమూ,

మన రాష్ట్రంనుంచి ఆహారధాన్యాల ఎగుమతులను ఆపుచెయ్యడమూ మొదలైన చర్యలుకూడా అవసరమేమో, ప్రభుత్వం వెంటనే నిర్ణయించాలి. అలాటి చర్యలు అవసరమైతే, వెంటనే తగిన విధంగా ఉత్తరువులు జారీచెయ్యాలి

ఆహారధాన్యాల కొరత ఏర్పడినట్లయితే, ధరలు విపరీతంగా పెరిగిపోగలవు. సర్వనాశనాన్ని పొందిన రైతులు ఆహారధాన్యాలను కొనుక్కోలేరు. పైగా, చాలామంది తిండిలేక కష్టపడవలసివస్తుంది.

ఈ విషయాలన్నిటినీ జాగ్రత్తగా పరిశీలించి ప్రభుత్వం తగుచర్యలు తీసుకుంటుందని మా విశ్వాసం.

ఫిబ్రవరి నెల యువ

# భావపరిచయ పోటి

బహుమానం రూ. 25-00



**ఈ కార్టూనుకు హాస్యయుత వ్యాఖ్య (Caption) కావాలి.**

**గమనిక :** వ్యాఖ్యలు పోస్టుకార్డుమీదనే వ్రాయాలి.

# జనవరి నెల యువ
# భావపరిచయ పోటీ
### బహుమతి పొందిన వ్యాఖ్యలు



*కురిసింది అతివ కన్నీరు వర్షమై*
*విరిసింది ఛత్రపతి మోము దరహాసమై*

**-వి. యస్. వి. ప్రసాద్, కాకినాడ.**

*కలకంఠి కంట కన్నీరొలకిన*
*గొడుగింట నుండవతెను గదరా సుమతి*

**-కె. రామారావు, హైదరాబాదు.**




శ్రావణమాసం వర్షాలు కురిసి, కురిసి తెరపిచ్చాయి.

ఆశ్వయుజ మాసపు అలికిడి మెల్లమెల్లగా మలయగిరి సానువుల్లోకి ప్రవేశిస్తోంది.

బ్రాహ్మణినదికి వరదపోటు ఎక్కువ కాసాగింది. ఉండీ – వుడిగీ వచ్చే వరదలతో నది ఉధృతంకావడం; చుట్టుప్రక్కల అడివి క్రమక్రమంగా మునిగిపోవడం జరుగుతోంది.

ఓనాటి అర్ధరాత్రి–

యుగయుగాల నాటినుంచీ సృష్టిపట్ల మానవునివల్ల కలిగే సంఘర్షణను ప్రతిబింబిస్తో బ్రాహ్మణినది ప్రవహిస్తోంది. ఎక్కడినుంచో గాలి ఈలలు అడివిని చీలుస్తో అలసాలసంగా వస్తున్నాయి.

ఆగి – ఆగి బ్రాహ్మణి హోరెత్తి అరుస్తోంది.

ఆనాటి అర్ధరాత్రి – భయభయంగా వాతావరణాన్ని స్ఫురింపజేసే ధ్వనులతో నిండిపోయింది. చీకటిని కుట్రచేస్తో – అడివి సంగీతం నలువైపులా అలుము కుంటోంది.

బ్రాహ్మణినదీ తీరాన – ఓ ఆరామంలో ఉన్న లలితవిస్తరునికి – ఆనాటి పరిస్థితి వింతగా – ఆలోచనాపరంగా తోచింది. 'ప్రళయకాలం' అంటే ఏమిటో అర్థంకాసాగింది.

బ్రాహ్మణి విజృంభణకు లలితవిస్తరుని హృదయం కంపించిపోయి, వణుకుతూ కూర్చొన్నాడు – ఓచోట.

లలితవిస్తరుడు ఆ ఆరామానికి ప్రధానాచార్యుడు. వయస్సు మీరినవాడు. అన్ని బౌద్ధశాస్త్రాలతో పరిచయాన్నీ, అనుభవాన్నీ పెంచుకుని, ఆ ఆరామానికి ఆధారంగా వుంటున్నాడు.

ఆయన ప్రియశిష్యుడు జలధరుడు.

గురువుగారి పరిస్థితికి. జలధరుడు ఆశ్చర్యపడుతూ – నెమ్మదిగా వెళ్ళి, ఎదురుగా కూర్చొన్నాడు. జలధరుణ్ణి చూడగానే లలితవిస్తరుడు–యించుక తల పైకెత్తి – ఆలోచనగా –

"బాధ వ్యక్తిని పరీక్షించినట్లు, పృథ్వీమాత పుట్టినొప్పుల నాటినుంచీ, యిదే సంఘర్షణ అవిరళంగా సాగుతూవుంది జలధరా ?''—అన్నాడు.

"మరెప్పుడూ అంతం ?"—జలధరు డడిగాడు.

''లేదు...ఇహ అంతం అనేదిలేదు. ఇది ఘోర చిరంతన సంఘర్షణ— గట్టిగా – ఖండితంగా చెప్పాడు లలితవిస్తరుడు.

''ఎవరెవరికీ మధ్య ?''—జలధరుడు ప్రశ్నించాడు.

''మానవ జీవితాలమధ్య ... అంతేగాదు–, ప్రకృతీ – పురుషులమధ్య – ఒక్కసారి వెనక్కి తిరిగిచూడు మరి – '' లలితవిస్తరుడు ఆగిపోయాడు – ఎందుకో ?

''ఊ...చూసుకుంటే ?"

''సాకల్యంగా అర్థమై తీరుతుంది."

''ఏమిటి ! సంఘర్షణకు మూలాధారమా ?"

"గట్టిగా అదేనని చెప్పలేను'' – లలితవిస్తరుడు సందేహంగా అన్నాడు.

''మరేమిటి ?'' – జలధరుడు వెంటనే అన్నాడు.

''ఓ కొత్తభావన. అది పాతమెరుగుల్తో ప్రకాశిస్తో, హృదయాన్ని ఉద్వేగ పరుస్తుంది.''

''ఎలా ? ఏ విధంగా ?'' – మళ్ళీ అడిగాడు జలధరుడు.

''ఆదిదంపతులైన పార్వతీ – పరమేశ్వరులూ; రూపలావణ్య యవ్వన శోభామయ శీలురైన ఊర్వశీ పురూరవులూ; మనోజ్ఞ మల్లికా నికుంజ వసాంత రాలలో మాదకత్వంతో, మన్మధక్రీడలలో – అలతి అలతి సోయగాల్నీ; సొంపుల్నీ విరజిమ్ముతూ విహరించిన మేనకా – విశ్వామిత్రులూ; ఇలా వేలకు వేలు స్త్రీ పురుషులూ – ఈ మహామహీ ధరాశ్మసంఘాత కర్కశమైన మానవ జీవిత ప్రవాహంలో తృణప్రాయులై; చిరుకెరటాల అలజడికి దొరలిపోయే గులకరాళ్ళయి; ఎటకో కొట్టుకునిపోవడం; మహాశూన్యంలో ఉద్భ్రాంతమై, పరమాణువులాగా పరిభ్రమించడం; నిత్యమూ వినూత్న రేఖావిలసితమై – భాస్వంతమై – ఎన్నో రీతుల్లో రకరకాలుగా పరిమాణాలనూ; పరిణామాలనూ ధరించడం; పన్నీళ్ళతో కష్టసుఖాల కావడికుండల్లో కూర్చొని కాలాన్ని వెక్కిరించడం – ఇదేగా – జీవితం...'' – లలితవిస్తరుడు గంభీరంగా జలధరునివంక చూశాడు.

ఆ చూపులకు, గురువుగారి మాటలకు, జలధరుని హృదయం, వీణె టంకారం చేసినట్లుగా ఝల్లుమంది. కొంచెం నిబ్బరించుకుంటూ–

''ఇహ జీవితానికి సిద్ధి కల్గే దెప్పుడూ ?'' – అని ప్రశ్నించాడు.

''మార్గం వుంది...'' లలితవిస్తరుడు మెల్లిగా అన్నాడు.

''ఏమిటది ? ఎక్కడ ?'' – జలధరుడు శీఘ్రంగా చెప్పమని కోరాడు. ఉత్సుకతతో హృదయాన్ని ముందుపెట్టాడు.

''పాప పుణ్యాలను లెక్కించి, మనస్సుని నిరంతరం వికలం – ధ్వంసం చేసుకోవడం విస్మరించి, జీవనమార్గంలో పురోగమించడమే సిద్ధి !'' – అన్నాడు లలితవిస్తరుడు.

జలధరుని గుండెలు కలుక్కుమన్నాయి. ఫిడేలు తీగెని తీవ్రంగా లాగినట్లు, అతని ఆరోచన వెనక్కిపోయింది – అపస్వరంతో – ! వెంటనే ఆచార్యులను ఎదుర్కొంటూ–

''కాదు...అదేకాదు... తప్పు ... మీ రనేది చాలా తప్పు ... అవునా ?'' – ఎదురు ప్రశ్నవేశాడు గట్టిగా–

లలితవిస్తరుడు చలించలేదు.

''అదేమీ తప్పుకాదు. ఒప్పే! నగ్నసత్యం అదే! జీవితాన్ని కాచి వడబోసి, లోకాని కందించిన పరమసత్యం అదే! ఈ వాదానికి ఎందరో పూజ్యపాదులు తలలూచారు" - లలితవిస్తరుడు గంభీర స్వరంతో అన్నాడు.

"శుద్ధ అవివేకం - ఒక్కొక్కసారి పెద్దవాళ్ళకే భయాన్ని కలిగించి, తల లూపేలాగు చేస్తుంది. మీకు తెలీకపోవచ్చుగదూ - ఈ రహస్యం..." - జలధరుడు ధైర్యాన్ని పెంచుకోసాగాడు.

''నీ సంభాషణ శ్రుతిమించి రాగానపడుతోంది జలధరా!" - మందలించాడు లలితవిస్తరుడు-ఓరగా చూస్తో.

"మంచిదేగా ఆచార్యా! నిజానిజాలూ; అసలు రూపాలూ - ఆంతర్యాలూ బయటపడతాయి, సాగనీయండి - ఈ సంభాషణా రాగాన్ని! తెగనీయకండి!''- జలధరుడు తనకి తాను వెనుకంజ వేయడానికి యిష్టపడలేదు.

"ఇలా సాగి సాగి సాగే ఎడతెగని సమస్య, సంఘర్షణగా మారుతుంది - ఒక్కోసారి! నీకు తెలుసా?"

"తెలుసు" - జలధరుడు గట్టిగా అన్నాడు.

"తెలిసికూడా తెలివితక్కువతనాన్నే నమ్మడం, దాన్ని బాహాటంగా ప్రదర్శించడం - కేవలం ఉన్మాదమేమో?" - లలితవిస్తరుడు చురకలేస్తో అన్నాడు.

"కాదు ఆచార్యా! కాదు".

"ఎలా కాదు? చెప్పు?- లలితవిస్తరుడు ప్రశ్నించాడు.

"సిద్ధికి మనస్సుని వికలం చేసుకోగూడదుగా" - జలధరుడు చెప్పాడు.

"లేకపోతే ఎట్లా?- లలితవిస్తరుడు ప్రశ్నించాడు.

"మనో విధ్వంసనం కంటే, శరీరాన్ని ముందు ధ్వసం చేయాలి" - జలధరుడు- మేఘగర్జనగా ఉన్నాడు.

ఆనాటి అర్ధరాత్రి - ఆ మాటకి; ఆ గర్జనికి - ఓ మృదంగం గర్జించినట్లు ఫెళ్ళున గర్జన చేసింది.

బ్రాహ్మణి నది, వరదపోటుకి హోరెత్తింది.

లలితవిస్తరుడు-జలధరుని గర్జనకు భయపడక - నిల్రదొక్కుకుంటూ - రవ్వంత హాసంతో-

"జలధరా? ఎంత వెర్రి భావుకత? శరీరం విధ్వంసమైతే, మనస్సుకి అస్తిత్వమెక్కడుంది? శరీరాన్నిబట్టి మనస్సు సంచరిస్తుంది. దాన్ని మంచిగా మార్చి, మార్గానికి మరలించడమే సిద్ధి!" - అన్నాడు.




"ఇహ నా ప్రశ్నకి యిదే సమాధానమా ఆచార్యా?" – జలధరుడు అన్నాడు నిరుత్సాహంతో.

"కాదనిపిస్తే – యిలారా నాతో!" – అని లలితవిస్తరుడు కూచున్న చోటునుంచి లేచి, ఆరామం వెలుపలికి వచ్చేశాడు. జలధరుడు కూడా ఆచార్యునితోపాటు బయటికి వచ్చేశాడు. అంతా చీకటిమయం.

ఇద్దరూ కలసి, – ఆ అర్ధరాత్రి చీకటిలో – ఆ అడవి చెట్లగుండా నడిచి, నడిచి, ఓ చోటుకు వచ్చేశారు.

అక్కడ – బ్రాహ్మణినదీ తీరాన కునుకుతూన్న ఓ సంఘారామం వంక చూడమని ఆచార్యుడు, జలధరునికి చెప్పాడు. జలధరుడు ఆ ఆరామంవంక నిశ్చలంగా చూస్తూ నిలబడ్డాడు.

తెరలు తెరలుగా గాలి ఈలలు వేస్తూంటే – అడివి వూగిపోతూ వుంది. బ్రాహ్మణి కెరటాలు నృత్యం చేస్తో సాగర గానం చేస్తున్నాయి – భయంకరంగా –

ఏదో భయంకర విషాద వాతావరణం అలుముకుని, అడివి అలజడి పడుతోంది. ఆ ఆందోళన ఎందుకో జలధరునికి అర్థంకాలేదు. మ్రాన్పడి చూస్తున్నాడు యింకా!

"ఎలా వుంది?" – లలితవిస్తరుడు ప్రశ్నించాడు.

"ఏమిటీ భయానక విషాద వికస్వర సమ్మేళనా పూరితమైన వాతావరణం? ఒక్కుమ్మడిగా ఎందుకిలా వ్యాపిస్తోంది?" – జలధరుడు కలవరపడుతూ ప్రశ్న వేశాడు

"ఇప్పుడు గ్రహించు జలధరా! ఈ బీభత్సస్థితి ఎందుకేర్పడిందో?"

"ఎందుకూ?" – జ ధరుడు మళ్ళీ అడిగాడు.

"రా చెబుతా! అలా చేరువకు వెడదాం..."

-ఇద్దరూ మెల్లిగా నడిచి, ఆ సంఘారామం ఆవరణలోకి వెళ్ళి నిలబడ్డారు. ఎదురుగా ఆరామంలోని పరిస్థితి యావత్తూ జలధరునికి కనబడసాగింది.

"చూడు జలధరా! ఈ విగ్రహంవంక తదేకంగా చూడు" - ఆచార్యుడు చూపించాడు.

"ఎవరు ఆచార్యా - వీరు?" - జలధరుడు ఆశ్చర్యంగా అన్నాడు.

"దివ్యరూప సంచిత మానసమూర్తి - బుద్ధుడు? మన పాలిట కరుణామయుడు..." లలితవిస్తరుడు భక్తిపూర్వకంగా చెప్పాడు.

"ఏమిటిలా వుంది?" - జలధరుడు విభ్రమంతో ప్రశ్నించాడు.

"అవును...లుప్తప్రాయ మవుతోంది..." -

"ఎందుకనో?"

పశ్చిమ దిశనుండి ప్రచండమైన తుఫాను చెలరేగబోతోంది త్వరలో" - లలితవిస్తరుడు సూచనప్రాయంగా చెప్పాడు.

"ప్రబల కారణం—?" - జలధరు డడిగాడు విస్మయంతో.

"ఆశ - మోహం - స్వార్థం - పగ - ఇవే ప్రబల కారణాలు" - లలితవిస్తరుడు ముక్తసరిగా చెప్పాడు.

"ఏం చేయడానికి?"

"ఆర్య సంస్కృతి పునాదుల్ని కదిలించి, పెకలించి, నేలమట్టంచేసి, తృప్తి చెందడానికి? తమ కసి తీరిందనుకుని సంతోషించడానికి" - లలితవిస్తరుడు వాస్తవాన్ని చెప్పాడు.

జలధరుని చెవులకు అప్పుడే - ఎక్కడో - గుర్రపు డెక్కల చప్పుళ్ల వినిపించాయి. అతను త్రుళ్ళిపడ్డాడు.

"ఏమిటీ గుర్రపుదళం వస్తున్నట్లు శబ్దాలు వినబడుతున్నాయి?".

"అవును—యవన మృగాలు విచ్చలవిడిగా వీరవిహారం చేయడానికి ఉవ్వేత్తుగా తరలి పడద్రోసుకొస్తున్నాయి జలధరా!" - లలితవిస్తరుడు వచ్చే ప్రమాదాన్ని వూహించి చెప్పసాగాడు.

"మరిప్పుడేమిటి గత్యంతరం! ఈ సంఘారామం గతేమిటి?" - జలధరుడు వెతపడ్డాడు - క్షణం. అంతలోనే ఆదుర్దా, భయం ఎక్కువయ్యాయి.

"సర్వం పతనమేనా?" - ఆచార్యుల మొహంవంక చూస్తో భీతిగా అడిగాడు.



లలితవిస్తరుడు చలించక -

"ఏమీ కాదని నా దృఢవిశ్వాసం. భయంలేదు, భవిష్యత్ నీలినీడల్లో కంపిస్తూ - అశోక, కనిష్క నిర్మిత భగ్నస్థూపాలలోని తథాగతుని దివ్య సందేశం, దిగంతాలవరకూ వ్యాపిస్తోంది. ఆ కారుణ్యమూర్తి శరణత్రయం ఏ అలజడినీ పొక్కనీయదు. అంతా చక్కబడి తీరుతుంది....

...ఆఁ...ఇప్పుడు చూడు జలధరా! ఆ శాక్యమహర్షి ప్రశాంత గంభీర వదనం! చరాచర జగత్తంతా ఆ మహాముని చల్లని కన్నులలో ఎంత హాయిగా సేదదీరి వుందో! అర్థమవుతోందా? అటు చూడు - ... సర్పాకృతిలో అగరుధూమం నలువైపులా వ్యాపించే ప్రదేశానికి, యించు కవతల పద్మ చైత్యం, వామ పార్శ్వాన, ఆ సొరుగుల్లో తామ్రశాసనాలూ, తాళపత్ర, భూర్జర గ్రంథాలూ ఎన్ని ఉన్నాయో! కనిపించేనా! - నిర్మలంగా వివరించి చెప్పాడు. ఇంతలో బుద్ధ విగ్రహంముందు కూర్చున్న కొందరు భిక్షువులు

త్రిపిటకోచ్చారణ చేయడం జలధరుడు వినసాగాడు. వారితోపాటు కొంత సేపటికి లలితవిస్తరుడు, జలధరుడుకూడా త్రిపిటకాన్ని పఠించారు.

* * *

ఓ నాటి ప్రాతఃకాలం —

బ్రాహ్మణి నదికి వరదలు తగ్గాయి. హోరు అణిగిపోయి, నీరు ప్రశాంతంగా పారుతోంది. ఒంద్రుమట్టితో తీరానవున్న చెట్లు, సగంవరకు మునిగిపోయి ఉన్నాయి. అక్కడక్కడా పల్లాలలో నీరు నిల్చి ఉంది. తీరభూముల్లో తేమ ఆరలేదు.

అడివి తీగెలు – ఒంద్రుమట్టిని చీల్చుకుని పైకి తలలెత్తి చుట్టుప్రక్కలకు ఎగపాకుతున్నాయి. విరిసిన అడివి పువ్వులు తడినేలమీద రాలి – రంగు రంగుల ముగ్గులు పెట్టినట్లుగా వుంది.

విపరీతమైన వర్షాలకు తడిసిన మలయగిరి శ్రేణి, మత్త మాతంగాలు నిల్చి నట్లుగా కనబడుతున్నాయి. అక్కడక్కడా – యింకా కొండవాగులు రాళ్ళ మధ్యనుంచి వస్తో చీల్చుకుని బ్రాహ్మణి నదిలోకి దూకుతూ వున్నాయి.

ఆనాటి ప్రాతఃకాలమంతా ఆహ్లాదంగా వుంది.

లలితవిస్తరుని హృదయంకూడా – ఆ నాడు ఎందుకో ఆహ్లాదంగా; ఆనం దంగా వుంది. ఆ ప్రాతఃకాల వాతావరణాన్ని చూస్తో, ఆయన ఎంతో ప్రశాం తంగా ఉన్నాడు. తనలో తను ఏదో ఆలోచన చేసుకోసాగాడు.

"నేడెంత సుదినం. ఏమిటో ఆనందం. ఈ కళ నా కంఠంలో మెదు ల్తోంది. తథాగతా! ఈ ప్రభాత సమయంలో, ఈ సంఘారామ గవాక్షాల గుండా ప్రసరించే బాలభానుని పసిడి కిరణాల్లాగా, నీ అమృతమయసూక్తులు అజ్ఞానాంధకారపు చెరల్ని చీలుస్తో, ఈ లోకానికి ప్రాకి పోతున్నాయి!...

ఎంత ఆనందమో! అనుభవిస్తున్నకొలదీ అధికమవుతోంది. ఈనాటికి బ్రాహ్మణినదీ తీరాన మొలకెత్తిన కీర్తి, తిరిగి దిగంతవ్యాప్తి చెందింది. మహా మేధావీ, కుశాగ్రబుద్ధీ అనిపించుకోగల్గిన జలధరుడు విజయాన్ని సాధించాడు. నాకే అనిపిస్తోంది – ఇది నిజమా? కలా?...అని...

లలితవిస్తరుడు దృఢచిత్తుడయ్యాడు.

...కల కాదు...కాదు...నిజమ్! నిజమ్! తథాగతా! ఇహ నీ ఆశీర్వచనం అవశ్యం లభ్యం కావాలి. ఆర్యసంఘం పేరు ప్రఖ్యాతులు ఆచంద్ర తారా ర్కంగా నిల్చిపోవాలి. అమరత్వం పొందాలి...

ఆగిపోయి, ఆయన ఉద్రేకపడ్డాడు.

మానవులంతా విషయవాంఛాపరులై, కర్తవ్యతా మూఢులై - అనాచార పరాయణులవుతున్నారు. హీనయానం క్షీణించింది...

ఇలా తలపోస్తూండగా - జలధరుడు వచ్చాడు

లలితవిస్తరుడు - తన ఉద్రేకాన్ని అణచుకుంటూ

"నువ్వా - జలధరా!" — అని పల్కరిస్తో - దగ్గరగా వెళ్ళి కౌగలించుకుని, ఆశీర్వదించాడు ఇద్దరూ ఓ చెట్టుక్రింద కూర్చున్నారు - కొంచెం దూరంగా!

''నువ్వు కేవలం యువకుడివే కాదు జలధరా! గొప్ప శక్తిమంతుడివి కూడానూ? రా! ఇలా దగ్గరగా రా! నీ విజయంవల్ల ఆర్యావర్తం తిరిగి బౌద్ధుల క్షేత్రం అయి తీరుతుంది." — గాఢ విశ్వాసంతో అన్నాడు లలిత విస్తరుడు

జలధరుడు మందహాసం చేస్తో —

"ఆర్యా! ఇదంతా మహా మహితాత్ముడైన ఆ బోధిసత్వుని చలవ! అంతే! నాదేం వుంది ఆచార్యా!" — మెల్లిగా అన్నాడు.

"వత్సా! నీకు సదా జయమగుగాక!" — లలితవిస్తరుడు మళ్ళీ దీవించాడు.

''మహా పండితులైన మీవంటి బౌద్ధ శ్రమణికులుండగా నాకేమిటి దిగులు! ఏం భయంలేదు ఆచార్యా!" — జలధరుడు ధైర్యంగా అన్నాడు.

"వత్సా! నా ఆశలన్నీ నీ పైనే ఉన్నాయి ఈ బ్రాహ్మణినదీ తీర సంఘారామం కీర్తి ప్రతిష్ఠలు నీమీద ఆధారపడి ఉన్నాయి." — లలితవిస్తరుడు, దీర్ఘంగా నిట్టూర్పువిడిచి చెప్పాడు

అలా అన్న ఆచార్యుని కంఠంలో భావం జలధరునికి అర్థమైంది.

"ఆర్యా! తమరేదో తుది విషయాన్ని ముచ్చటిస్తున్నారు?"

"లేదు వత్సా! ఆదినుంచే ప్రారంభించాను ఈ శరీరం ఆత్మకు బిగుతుగా వుండే ముసుగు కానీ మానవ నేత్రాలకూ, జడపదార్థాలకూ కలిగే సమ్మేళనంలో కొంత కాకపోతే కొంతైనా ప్రాముఖ్యం లేకపోలేదు. ఏమైనా ఈ పండుటాకు ఎండటానికి, ఎప్పుడు రాలి పడుతుందో ఎవరు చెప్పగలరు?" — లలితవిస్తరుడు నిర్వేదంతో అన్నాడు.

"అందుకని...?" —ఆగిపోయాడు జలధరుడు.

"వెంటనే ఈ కార్యభారాన్ని వహించాలి — ఆత్మసాక్షిగా!" — లలిత విస్తరుడు కోరాడు.

"నేనా! అప్పుడేనా! ఆర్యా! తమరెందుకో బాధ్యతల్ని వదులుకో చూస్తున్నారు?" – జలధరుడు ఆశ్చర్యపోతూ, ఆచార్యులను ప్రశ్నించాడు.

"ఎందుకూ లేదు జలధరా! నిర్వాణ సుఖమందిరాన్ని చేరడానికి! అంత స్సాధన మార్గం అవసరమని భావించక, గుణాలకు బదులు క్రియావ్యాపారాలకు లేనిపోని ప్రాధాన్యాన్ని కల్పించి వజ్రయానులు దేశమంతటా అశాంతిని రేగగొడుతున్నారు " – లలితవిస్తరుడు చెబుతున్నాడు.

"అవును...ఎవరో ఒకతను సిద్ధుల్ని మించిపోయినట్లుగా, ఏవో మతిచెడిన మాటల్ని ప్రచారం చేస్తున్నాడట!" – జలధరుడు ఆవేశంగా అన్నాడు ఆచార్యులు, అతని ఆవేశాన్ని గ్రహించి – మెల్లిగా –

"జలధరా! ఆవేశంతో గాదు; ఆలోచనతో పూనుకోవాలి కర్తవ్యానికి! అనుభవం వుంటే, ఆలోచన మంచి మార్గాన నడుస్తుంది. అనుభవంలోనూ చింతన చేసి ఆర్జించిన జ్ఞానంలోనూ ఈ పాషండ తత్త్వాన్ని పరిభవింపచేసే మూలశక్తి వుంది." – అని చెప్పారు.

జలధరుడు ఉద్రేకాన్నీ - తొందరపాటునీ అణచుకుంటూ –

"ఆచార్యా! మానవజీవితానికీ, మనుగడ గమ్యానికీ ఉన్న సిద్ధాంతాల మూలంలోనే, ఏదో తప్పు ఉన్నట్లు కనబడుతోంది గత వారంలో జరిగిన వాద - వివాద సంరంభంలో మీరు చెప్పిన విద్యనే కక్కి వచ్చాను కానీ, అది నా అంతరాత్మకు సంతృప్తికరంగానూ, సంతోషదాయకంగానూ లేదు. ఎందువల్లనో తెలీదు." – మనస్సులో ఉన్న సంశయాన్ని జలధరుడు తేటతెల్లం చేశాడు.

లలితవిస్తరుడు, అతని మాటలు విని – 'అలాగా' అని వూరుకున్నాడు. జలధరుడు మళ్ళీ ఏమీ ప్రశ్నించలేదు.

కొంతసేపటికి ఇద్దరూ లేచి, ఆరామంలోకి వెళ్ళిపోయారు.

లలితవిస్తరుడు ఆనాటినుంచీ అనేక విషయాలను గురించి దీర్ఘాలోచన చేయడం మొదలుపెట్టాడు.

జలధరుడు, ఆచార్యులను అర్థంచేసుకోవడంలో నిమగ్నుడైపోయాడు రోజులు గడుస్తున్నాయి.

* * *

ఒకనాటి ఉదయం –

ప్రకృతిలో వీణెతీగెలు ఒక్కసారిగా టంకారం చేసి, జలదరించాయి.




తుఫాను రేగినట్లు గాలి వీవసాగింది. ఎక్కడినుంచో – అడివిలో – ఆరామం చుట్టూతా – ఆందోళనను కలిగించే సంగీతం వినబడసాగింది.

అంతలో – ఎవరివో అడుగుల చప్పుడు దగ్గరైంది.

లలితవిస్తరుడు ఆ చప్పుడు వస్తున్న దిక్కువైపుగ చూశాడు. కార్తీకమాసపు పొగమంచు చెట్లసందుల్లో చిక్కుకుని పింజలు పింజలుగా కనిపిస్తోంది.

లలితవిస్తరుని మనస్సు కలవరపడింది.

ఎవరో అస్పష్టంగా కనిపిస్తో – వస్తున్నారు.

"ఎవరది? ఎవరూ?" – లలితవిస్తరుడు ప్రశ్నించాడు. మెల్లిగా దగ్గరగా వస్తున్న ఆ వ్యక్తి – ప్రాధేయపూర్వకంగా –

"ఓ దీనురాల్ని!" – అని సమాధాన మిచ్చింది.

లలితవిస్తరుడు రెండడుగులు ముందుకు వేసి –

"ఇక్కడి కెందుకొచ్చినట్లు?" - ప్రశ్నించాడు మళ్ళీ!

"దీక్షను పరిగ్రహించడానికి!" - ఆ స్త్రీ చెప్పింది.

"శుభే!"... లలితవిస్తరుడు ఏదో అనబోయాడు.

"క్షమించాలి స్వామీ! నేను భర్తృ విహీనురాల్ని!" ఆ స్త్రీమూర్తి గాద్గదికంగా చెప్పుకుంది.

లలితవిస్తరుడు ఆలోచనలో పడ్డాడు...

"గౌతముని సంఘంలో స్త్రీల సంఖ్య నానాటికీ పెరిగిపోతోంది! ఈమెని పరికిస్తే ఏమిటో - ఆవేదన ఉబుకుతోంది. సరేకానీ - '' అని తనలో తాను సమాధానపడుతూ -

"చూడమ్మాయీ! దీక్షను గ్రహించి, ఏంచేస్తావు?" అని ప్రశ్నించాడు.

ఈ వైధవ్య దుఃఖాంధకారపటలిని సంయమ మహాప్రభాతంలో దూరం చేసుకోవాలనుకుంటున్నాను.''—నిశ్చయ కంఠంతో ఆ స్త్రీ చెప్పింది.

"నువ్వు చాలా యవ్వనదశలో వున్నదానివి! మనస్సుని వశంలో ఉంచుకోవడం, అనుకున్నంత సులభంకాదు. మారుని ఆక్రమణ, మలయ మారుత వీచికలకంటే, సుకుమారమైంది. మహాప్రభంజనంకంటే, బల వత్తరమైంది. నవ ప్రసూత కుసుమోర్ధ పరాగ పరిమళోద్యానవనంలో విహరించే వయ్యారి మయూరి, ఈ అడవిలో—ఈ సంఘారామ నీడల్లో వుండటం సంభవిస్తే, పథభ్రష్టురాలవుతుంది. పురుషుడైతే...—" లలిత విస్తరుడు ఆగిపోయాడు—యిహ ఏం చెప్పలేక—...

"ప్రయత్నంలో స్త్రీ పురుష భేదమేమిటిస్వామీ?—" ఆ స్త్రీ ప్రశ్నించింది —వినయంగా.

లలితవిస్తరుడు యిహ ఏం చెప్పలేక, మెత్తపడిపోతూ—ఆమె పరిస్థితి అర్థంచేసుకొంటూ—

"నీ పేరేమిటి?—"అని అడిగాడు.

"మయూరాక్షి—" ఆ స్త్రీ తనపేరు చెప్పుకుంది.

ఆ ఆరామం వాకిట్లో జరుగుతూన్న ఈ సంభాషణనూ, ఆ స్త్రీ చెప్పుకున్న పేరునీ వినేసరికి, ఆరామంలో వున్న జలధరుడు ఉలిక్కిపడ్డాడు. అప్రయత్నంగా, అతని నోటివెంట—'మయూరాక్షి' అనే పేరు మెల్లగా బయిటికి వచ్చేసింది.

కానీ, జలధరుడుమాత్రం బయటికి రాలేదు.

లలితవిస్తరుడు మళ్లీ ప్రశ్నించాడు—ఆమెని—"నీ తల్లిదండ్రు లెవరు?"— అని.

మయూరాక్షికి దుఃఖం పెల్లుబికింది. ఆమెకి తనగాధ చెప్పుకోవడానికి కంఠం పెగల్లేదు. నెమ్మదిగా ప్రయత్నించి— "ఎప్పుడో నా తండ్రి స్వర్గస్థుడైనాడు. నా తల్లి అప్పట్నుంచీ గుండెల్లో గూడుకట్టి పెంచి, పెద్ద చేసింది. ఈనాడు ఆమె కూడా లేదు. అందుకే శాక్యముని పాదాంతికంలో, వినమ్ర వదనంతో శరణు వేడుకొంటున్నాను." —అని కళ్లు తుడుచుకుంది మయూరాక్షి.

"ఆర్యే! అయితే నీ భర్తవైపు బంధువర్గం, సంఘ దీక్షను చేపట్టడానికి అనుమతించారా?"—లలితవిస్తరుడు అడిగాడు.

"ఆర్యా! భర్త ముఖం చూసే సౌభాగ్యమే నాకు లభించలేదు."
—మయూరాక్షి సమాధాన మిచ్చింది.

"కారణం ? – "

"పదిసంవత్సరాల బాలునికిచ్చి, నా బాల్యంలోనే పెళ్ళి చేశారట! ఎవరో దొంగలు ఆ బాలకుణ్ణి ఎప్పుడో ఎక్కడో హత్యచేశారట ! వయస్సు వస్తున్న నాకు, ఓసారి మా అమ్మ, ఈ మాట చెబుతూ– "నువ్వు భర్తృ విహీనవు–" అంది. ఆమె మృత్యుశయ్యపై వుండగా– కులగౌరవానికి ఏవిధమైన కళంకం రానీయనని, నా నుంచి వాగ్దానం తీసుకుంది. అప్పట్నుంచీ యిలాగే వుండిపోయాను." – మయూరాక్షి తన దీనస్థితిని బేలగా చెప్పుకుంది.

లలితవిస్తరుడు, ఆమె దీనగాథ విన్నాక–"ఒక్కమాట మయూరీ!"– అన్నాడు.

మయూరాక్షి – "సెలవీయండి స్వామీ !" – అంది.

"స్త్రీలు యిలా ప్రవేశించి, సంఘారామాల ఆయుర్దాయాన్ని తగ్గించేస్తున్నారని గౌతముని హెచ్చరిక. ఆ మహాసత్త్వుడే ఆపలేనిదానిని, నే నెలా ఆపగలను? అయినా, నీ మొహాన్ని చూస్తే, ఎందుకో జాలి వేస్తోంది. సానుభూతి పెల్లుబుకుతోంది. సరే! ప్రవ్రజ్యను గ్రహించేందుకు అలా పద ! ఈనాటినుంచీ నువ్వు గౌతమోపాసికవు ! సంఘ ధర్మాను వర్తినివి !" – అని లలితవిస్తరుడు, మయూరాక్షి చేత త్రిపిటకోచ్చారణ చేయించాడు. ముమ్మారు ఆమె త్రిపిటకాన్ని పఠించింది – మనస్ఫూర్తిగా!

*　　*　　*

"మయూరాక్షి !<br>ఎంచక్కని పేరు –<br>పాపం ! భర్తృ విహీన !<br>రెక్కలు విరిగిన జీవితం !<br>రేకులు వీడిన హృదయం !" –<br>– జలధరుని మనస్సు చలించసాగింది.

"గట్లను తెంచుకోవడానికి ప్రయత్నిస్తున్న మహానది మాదిరిగా, ఆమె శరీరంలో యవ్వనం తొణికిసలాడుతోంది. ఆమె నీలదుకూలాలూ; శ్వేత కంచుకం ఆరామాన్ని కామోద్రేకంతో వశపర్చుకునేందుకు మనోహరత్వంతో మెరిసిపోతున్నాయి. ఎట్టి సౌందర్య స్వరూపిణికి ఎట్టి ఇక్కట్లు ?

ఉపగుప్తుని వరించిన వసంతసేన కాదు కదా ఈమె! ఏమో? అయితే — ఉపగుప్తు డెవరు ?" —

— జలధరుడు క్షణకాలం ఆలోచనలో పడ్డాడు.

మయూరాక్షి తన విధి నిర్వహణలో మునిగిపోతూ, ఆరామంలో వుంటోంది. కానీ ఆమెని అనునిత్యం చూస్తోన్న లవితవిస్తరుడు, జలధరుడు రకరకాలుగా వూహాగానాలు చేయసాగారు.

యవ్వనంలో జలదరించే పులకరింతల్లాగా శీతాకాలం వచ్చేసింది.

ఓ నాటి రాత్రి — చలికి తోడు చిమ్మచీకటి అలుముకుంది. దాన్ని చీలుస్తూ, తథాగతుని ముందు వెలిగే జ్వలద్దీపికా శిఖలు కాంతిని చిమ్ముతున్నాయి. ప్రకృతంతా మనోజ్ఞంగావుంది.

లవితవిస్తరుడు ఓచోట నిలబడి — ఆరామ గవాక్షంగుండా మూగవోయిన ప్రకృతిలోని రామణీయకతని తదేకంగా చూస్తున్నాడు. అలా చూస్తోంటే — ఆ వృద్ధుని మనస్సు పరిపరి విధాలుగా చలించసాగింది. ఒక్కసారి ఆత్మావలోకనం చేసుకుంటూ —

"అబ్బ ! ఈ మనస్సెంత చంచలమైంది. రాగరాగిణీ స్వరాలు వినిపిస్తున్నాయి." తట్టుకోలేక, తల తిప్పాడు. మయూరాక్షి కనిపించింది.

అతను, ఆమెమీద దృష్టి నిలిపాడు.

"ఆ మసక వెల్తురులో ఏమిటో చేస్తోంది ? పాపం ! బుద్ధ విగ్రహాన్ని ఆ పట్టువస్త్రంతో ఎంత శుభ్రంగా తుడుస్తోంది ! తనపని తను చేసుకోవడం కూడా ఒక్కోసారి మానవుడు విస్మరిస్తాడు" అనుకుంటూ, ఆమెకి కొంచెం దగ్గరగా వెళ్ళి నిలబడ్డాడు.

మయూరాక్షి తన పనిలో తాను వుండిపోయింది.

"దీక్ష తీసుకున్న కొద్దిరోజుల్లోనే మయూరాక్షికి ఎంత పవిత్రతాభావం కలిగింది ఆరామంపైన ! నిజంగా మయూరి తప్పి వచ్చిన వన మయూరి ! ఆమె ఏం చేసినా, చేస్తున్నా— కన్నుపొడుచుకుని చూడాలనే కుతూహలం కలుగుతోంది నాకు ! అన్నట్లు— నన్నెవరూ నీడలా వెన్నంటి చూడటం లేదుగదా ! ఆమెవంక నేను తదేకంగా చూస్తున్నట్టు ఎవ్వరూ పసిగట్టడం లేదుగదా ! ఏమో !" ఒక్కసారిగా లలితవిస్తరుడు భయపడి, 'బుద్ధం శరణం గచ్ఛామి' అన్నాడు.

ఇంతలో జలధరుడు— ఎక్కడినుంచో— చుక్కతెగినేలపడ్డట్టుగా, "ఆచార్యుల

వద్దకు వచ్చి నిలబడ్డాడు. అతని మొహం గంభీరంగా వుంది. చూపులు వాడిగా వున్నాయి. ఆలోచన వేడిగావుండి, కళ్లు ఎర్రబడ్డాయి.

జలధరుణ్ణి చూసేసరికి, లలితవిస్తరుడు కంపించిపోయాడు. హఠాత్తుగా ఎందుకొచ్చాడో అర్థంకాలేదు. అడిగాడు.

"ఒక్క సందేహం!" జలధరుడు అన్నాడు.

"చెప్పు" లలితవిస్తరుడు అనుజ్ఞయిచ్చాడు. అప్పటికి మయూరాక్షి విగ్రహం తుడిచి, మరో పనిమీదకి వెళ్ళింది.

"ఆచార్యా! విరాగి, రాగమూర్తిగా మారడానికి హేతువేమిటి?" జలధరుడు లౌక్యంగా ప్రశ్నవేశాడు.

లలితవిస్తరుడు ఆ ప్రశ్నకి ఉలిక్కిపడ్డాడు- పడి, "నన్ను ఆరామంలో చూడలేదుగదా! ఏమో! చూసే వుండొచ్చు! లేకపోతే ఈ ప్రశ్నని యితగాడు ఎందుకు వేసినట్లు? సరిగ్గా నాకు సంబంధించినట్లే- వేశాడు, గుండె చీరుతూ!" క్షణంపాటు ఆలోచనగా అనుకున్నాడు- ఆచార్యుడు.

ఇంతలో మయూరాక్షి ఆరామ ముఖద్వారం దగ్గరకు ఏదో పనిమీద వచ్చింది. గబుక్కున లలితవిస్తరుడు ఆమెని పల్కరిస్తో-

"మయూరీ! ఇక్కడి వాతావరణం ఎలావుంది? సరిపడుతోందా?" అని ప్రశ్నించాడు.

"ఆచార్యా! ఈ ఆరామ వాతావరణం నా హృదయాన్ని శాంతింప చేస్తోంది. చిత్తవ్యాకులతని కల్గించకుండా, నా మధురభావాలన్నీ నిద్రాణస్థితిలోనే వుండిపోతున్నాయి."—చిరునవ్వుతో సమాధానమిచ్చింది మయూరాక్షి.

జలధరుడు, ఆమె మాటల్ని ఒక పక్కకి తిరిగి నిలబడి విన్నాడు. అతని మనస్సు, ఆమెని గురించి పల్కింది.

"మయూరాక్షీ! ఎన్నాళ్ళిలా నీ యవ్వనాన్ని కాషాయవస్త్రాలలో దాచి వుంచుకోగలవు? నగ్నసత్యం దాగటమనేది అసంభవం. నీ ప్రతి కదలికలోనూ, నీ నున్నని భుజాలూ; ఉన్నత వక్షోజాలూ; నవయవ్వన వేళానందన సౌందర్యాన్ని వరదలు కట్టిస్తున్నాయి. నువ్వు వసంతసేనగా ప్రవర్తించి, ఉపగుప్తుణ్ణి గుర్తుచేస్తున్నావు మయూరీ!" జలధరుని మనస్సు; ఆలోచనలు లలితవిస్తరుడు గ్రహించాడు. గ్రహించి, అతనినేమీ అనకుండా, మయూరాక్షి వంక చూస్తో-

"చిత్తసంక్షోభం కల్గించడానికి ప్రయత్నించకు మయూరీ! అది నీలో

నువ్వుగా కూడా తల్చుకోకు ! అలా కలగకుండా వుండాలని తథాగతుని ప్రార్థిస్తున్నాను" అన్నాడు.

లలితవిస్తరుడు అన్నమాటలకి మయూరాక్షి వణికిపోయింది. ఉన్న నిలువ నీడకూడా లేకుండా పోతుందేమోనని భయపడింది. అంతకు ముందు తనవల్ల ఏం తప్పు జరిగిందో ఆమెకు తెలియలేదు. తనని ఆచార్యుడు ఎందుకు మంద లిస్తున్నాడో, తెలీలేదు. భీతహరిణేక్షణయై, లలితవిస్తరునివంక చూస్తో-

''తమరేదో గుండెలు చీరుకుపోయే మాటలన్నారు. స్వామీ ! వృథాగా అనుమానాల్ని సృష్టించి, నా హృదయాన్ని కలవరపర్చకండి ! తాళలేని బాధని రేపి, పాతాళానికి త్రోయకండి ! దీనురాల్ని ! మన్నించండి ఆర్యా !" కంపిత స్వరంతో వేడుకుంది మయూరాక్షి.

ఆనాడు, తనగుండె సముద్రమై ఘోషించినట్లూ, భవిష్యత్తు విషాదాన్నీ, భయాన్నీ నెమరువేస్తున్నట్లూ- ప్రకృతి తనని పరిహసిస్తున్నట్లూ- మయూరాక్షి కలవరపడింది.

ఇహ ఆ రాత్రంతా ఆమెకు నిద్రపట్టలేదు. వెలుగుకోసం ఆమె లేచి చూస్తో కూచొంది. తెల్లవారింది. వెలుగు క్రమేపీ వ్యాపిస్తోంది. మయూరాక్షి ఆరామ సేవలకు లేచింది.

ఇంతలో- జలధరుడు రావడం మయూరాక్షి చూసింది. ఆమె తన పనిమీద అవతలకు వెళ్లబోతూండగా, జలధరుడు మయూరాక్షిని ఆగమని చేత్తో సైగ చేశాడు.

ఆరామ వాకిటముందు, ఓ చెట్టుక్రింద మయూరాక్షి నిలబడిపోయింది. జలధరుడు నెమ్మదిగా ఆమె దగ్గరకు వచ్చి—నిశితంగా ఆమె కళ్లల్లోకి చూస్తో...

"సంఘం విధ్వంసం కావడానికి కాలమాసన్నమైంది." స్పష్టంగా వినబడే టట్లు చెప్పాడు.

''సంఘం... విధ్వంసమా !" మయూరాక్షి ఆశ్చర్యపడింది.

"అవును... విధ్వంసమే !" ఖండితంగా చెప్పాడు.

"ఆర్యా ! ఏమిటీ మీ మాటలు అర్థంలేకుండా !" మయూరాక్షి విభ్రాంతి వద నంతో అడిగింది.

"ఇందులో అసత్యమేమీలేదు. నాగార్జునుని విద్య మిధ్యకాదు" జలధరుడు నిర్లిప్తిగా అన్నాడు.

"అయితే భవిష్యత్తేమిటి ? నా జీవితం ముందు, ముందు ఎలా గడుస్తుంది ?



యింకెలా ? చెప్పగలరా ఆర్యా ?'' మయూరాక్షి వియుక్తాలోచనలతో ప్రశ్నించింది.

''ప్రయత్నిస్తాను మయూరాక్షీ! ఏదీ నీ వామహస్తం? ఒక్కసారి యిలా చూపించు!" జలధరుడడిగాడు.

మయూరాక్షి తన వామహస్తాన్ని, జలధరునికి చూపించింది. అతను తదేకంగా ఆమె హస్తరేఖల్ని చూడసాగాడు. చాలాసేపటివరకూ ఏమీ చెప్పలేదు. అలా చూస్తూ వుండిపోయాడు.

కానీ, ఆమె ఆతృతపడసాగింది.

"ఏమిటలా వింతగా చూస్తున్నారు ." అనడిగింది.

"ఆర్యే! నువ్వు వితంతువ్వికావు!" తలెత్తి మయూరాక్షివంక చూస్తో చెప్పాడు- జలధరుడు.

''పరిహాసం చేస్తున్నారా ?"

"మయూరీ! జలధరుడు ఎగతాళి ఎరుగని వ్యక్తి! నా భావ గాంభీర్యం ఎలాంటిదో తెలుసుకోవాలంటే, జంబూద్వీపంలో తెలుసుకోవచ్చు!'' ఎందుకో ఆగిపోయి- మళ్ళీ చెప్పడం ప్రారంభించాడు-

''బుద్ధునిపై ప్రమాణంచేసి చెబుతున్నాను. నువ్వు వితంతువ్వికావు!" జలధరుడు నిశ్చయంగా చెప్పదల్చుకున్నది చెప్పేశాడు. మయూరి తెల్లబోయింది.

"నిజమా! ఇది కలా? కథా?" ఆమె ప్రశ్నించింది.

"కలా– కథా రెండూ కావు మయూరీ! సత్యవాక్కు! సాముద్రిక శాస్త్ర ప్రకారం నా లెక్క సరిపోతుంది, సరిపోయింది కూడానూ! నిజంగా నువ్వు భర్తృ విహీనురాలివికావు! భర్త ఎక్కడో ఉన్నాడు- ఉంటాడు. తప్పకుండా మళ్ళీ పసుపు కుంకుమల్ని చేపట్టే భాగ్యం నీకు వుంది మయూరీ!" జలధరుడు నిజంచెప్పాడు.

కానీ, మయూరాక్షి అతని మాటల్ని విశ్వసించలేదు.

"మీ మాటలన్నీ ఉత్తవి..." అని తన చేతిని వెనక్కి లాగేసుకుంది

జలధరుడు, ఆమెచేతిని తిరిగి అందుకోవడానికి ప్రయత్నిస్తూ-

"ఏమిటలా చేయిలాగేసుకోవడం మయూరీ! నిన్నూ- నీ హస్తాన్నీ పరీక్షిస్తూంటే, ఈ క్షణంలో ఎంతో కారుణ్యభావం జనిస్తోంది. ముఖ్యంగా నీ కరకమలంలో..." –అని యింకా ఏదో చెప్పబోతూంతగా, లలితవిస్తరుని అడుగుల చప్పుడు వినబడింది- దూరంగా!

"సాముద్రిక శాస్త్ర దృష్ట్యా నీకు పరమసత్యం చెబుతున్నానని లలితవిస్తరులు తెలుసుకుని వుంటారు. అందుకనే కాబోలు పూజా గృహంలో నిలబడే గవాక్షంగుండా ఈ దృశ్యాన్ని చూస్తో, ముఖాన్ని కోపంతో ఎగరండెల చేసుకుంటున్నారు,'' అన్నాడు జలధరుడు.

లలితవిస్తరుని అడుగులచప్పుడు క్రమేపీ దగ్గరైంది. వస్తూనే– చూస్తో.

"జలధరా!" అని కోపాన్ని వెలిబుచ్చాడు. మయూరాక్షి, జలధరుని వంక చూస్తో-

"ఆర్యా! ప్రమాదం వచ్చింది!" అంది.

"మయూరీ! మనస్సుని క్షోభ పెట్టుకోకు! ఏం భయంలేదు! తన తప్పుని ఎదుటివారిపై రుద్దడానికి, ఒక్కోమనిషి ఎన్నో రకాలుగా ప్రయత్నించడం పరిపాటి!''– జలధరుడు నిర్భయంగా అన్నాడు, మయూరాక్షితో.

వస్తూ– ఓ చోట నిలబడిపోయిన లలితవిస్తరుడు–మళ్ళీ జలధరుణ్ణి చూసి

పిలిచాడు. జలధరుడు, ఆచార్యులను సమీపిస్తో, తన జాప్యానికి క్షమాపణ చెప్పుకుని, ఎదురుగా నిలబడ్డాడు. మయూరాక్షికూడా, జలధరుని వెనకే నడిచింది.

లలితవిస్తరునికి అల్లంతదూరంలో జలధరుడు, మయూరాక్షి నిలబడి ఉన్నారు. లలితవిస్తరుడు ఎందుకో మయూరాక్షిని నిశితంగా చూడటం మొదలు పెట్టాడు.

ఆమె, ఆ చూపుల్ని అర్థంచేసుకోకుండా—

"స్వామీ ! మనోవికారాన్ని పారదోలే సంయమం, పరిణామంలో శాంతి దాయకం గదా ? కానీ, దాన్ని అవలంబించడం యింత దుఃఖకరమేమిటి ? సెల వీయరూ ?" అనడిగింది.

లలితవిస్తరుడు ఆమె ప్రశ్నవిని-

"ఇలా దగ్గరకు రా మయూరీ! సరిగ్గా నే చెప్పేది విను! జాగ్రత్తగా విను!" అన్నాడు— హెచ్చరికగా !

మయూరాక్షి సావధాన చిత్తురాలై నిలబడింది.

"సంఘర్షణలోనే జీవిత బీజాలు దాగివున్నాయి. గాఢనిద్రపోయేవాడికి ఒక రకమైన తృప్తి వుంటుంది. సామాన్యంగా అటూ- యిటూ కదుల్తూ, మసుల్తూ నిద్రపోయేవాడు, ఒక్కసారి చటుక్కున ప్రక్కకి తిరిగి, బత్తిగిల్లి సుఖాన్ని పొందుతాడు. అలా ఒత్తిగిల్లినప్పుడు శరీరం నలుగుతుంది. తప్పదు. తన్నివృత్తియే నిజమైన మనశ్శాంతి !" లలితవిస్తరుడు చెప్పాడు.

ఆచార్యుల సమాధానం జలధరుడు విని, మయూరాక్షివంక చూస్తో—

"నీకర్థమైందా మయూరీ !" అనడిగాడు.

~~మయూరాక్షి నాకర్థం కాలేదని చెప్పింది.~~

జలధరుడు చిన్నగా నవ్వేసి, వూరుకున్నాడు.

"మానవ జీవితంలో చరమ సాత్విక వృత్తి ఏది ?" – మయూరాక్షి లలితవిస్తరునివంక చూస్తో అడిగింది – మళ్ళీ.

"పెద్ద ప్రశ్నే అడిగావు" – జలధరుడు అన్నాడు.

"అవును ... పెద్ద ప్రశ్నే ! చక్కగా వేసింది !" – లలితవిస్తరుడు సంతోషించాడు.

"ఇలా అడగడం గర్వాతిశయం కాదుగా – ఆచార్యా ?" అన్నది మయూరాక్షి !

"ఎన్నటికీ కాదు. సమ్యక్ జ్ఞాన, సమ్యక్ క్రియలను సమ్మిళితం చేసుకోవడమే జీవిత పథంలో పురోగమించడం !" - లలితవిస్తరుడు సమాధానమిచ్చాడు.

మయూరాక్షి, ఆచార్యుల సమాధానానికి వెనక్కి తిరిగి, వెళ్ళిపోసాగింది.

జలధరుడు చూశాడు - "మయూరీ !" అని పిలిచాడు.

ఆమె వెడుతూ, వెడుతూన్నదల్లా ఆగిపోయి, వెనక్కి తిరిగింది.

"మయూరీ ! ఏమిటలా ఒక్కమారుగా, నిరాశతో వెళ్ళిపోతున్నావు ? ఎక్కడికి ?" - అనడిగాడు జలధరుడు.

"ఆచార్యులు చెప్పింది అర్థంకాక, అసంతృప్తితో - విశ్రాంతికోసం వెడుతున్నాను", - అని చెప్పి ముందుకు నడిచింది — మెల్లిగా !

అలా వెళ్ళి - మయూరాక్షి బ్రాహ్మణినదీతీరంలో - ఓ దేవదారు వృక్షం క్రింద నీడల్లో కూచుంది.

బ్రాహ్మణి జాలిగా ప్రవహిస్తోంది.

* * *

ఆనాటి సాయంకాలం -

లలితవిస్తరుడు, జలధరుణ్ణి ఆరామంలో దీపారాధన చెయ్యమని ఆజ్ఞాపించాడు. అతను ఆ పనిచేశాడు. కానీ, అతని మనస్సంతా వ్యాకులంతో నిండిపోయింది.

"ఏమిటీ ఆందోళన అడుగడుక్కీ ?" - తన్ను తాను ప్రశ్నించుకున్నాడు జలధరుడు.

లలితవిస్తరునికి, జలధరుని ప్రశ్న వినబడింది.

"ఎక్కడ ?" - ఆచార్యు లడిగారు.

"ముఖ్యంగా మీలో..." - అగ్నాడు జలధరుడు దృఢంగా.

"నాలోనా ?" - ఆశ్చర్యపడ్డాడు లలితవిస్తరుడు.

"అవును. మీలోనే ! ఏవో భయంకరచ్ఛాయలు మీ ముఖంలో స్పష్టంగా పొడసూపుతున్నాయి. ఏమిటో వ్యాకులపాటు మీ శరీరాన్ని కుదుపుతోంది. నాకు తెలుసు - తమరు దేనినో దాస్తున్నారు ?" - జలధరుడు ధైర్యంగా ఎదుర్కొన్నాడు లలితవిస్తరుణ్ణి.

లలితవిస్తరుడు ఉద్విగ్నహృదయుడయ్యాడు.

"జలధరా ! నీ పన్నాగాన్ని కప్పిపుచ్చుకోవడం, నీకంత శ్రేయోదాయకం

గాదు. ఆలోచించుకో ! జీవితం జారుడు మెట్లపై జారితే, పతనంతప్ప ప్రాముఖ్యం వుండదు. నా కన్నుగప్పి నీ కుటిల కృత్యాన్ని కడతేర్చుకోడానికి పూనుకోవడం అవివేకం ! సహించలేను ! ఈ ఆరామ భవిష్యత్తు యావత్తూ నీ చేతుల్లో వుంది. గమనించు !" – లలితవిస్తరుడు తీవ్రంగా మాట్లాడాడు.

జలధరుడు విస్మయం చెందాడు.

"ఆచార్యా ! తమ రేదో చాలా విపరీతార్థాలు స్ఫురించేలాగా మాట్లాడుతున్నారు. ఇంత కొత్త వాతావరణాన్ని నాపట్ల ఎందుకు సృష్టిస్తున్నారో తెలియకుండా వుంది. కష్టాలొచ్చేముందు కాలగతి యిలా మారుతూ వుంటుంది కాబోలు !'' – జలధరుడు అన్నాడు. అతని మనస్సంతా పాడైపోయింది.

ఇంతలో – వారి సంభాషణ వింటూన్న మయూరాక్షి, మెల్లిగా వారిద్దరి మధ్యకూ వచ్చి –

''నావల్లనే కదా, మీ కీ మనస్తాపం !" అంది.

''ఎవరివల్లనో కష్టాలు వస్తున్నయ్యని చెప్పడం సమంజసంకాదు. ఎవరికి వాళ్ళు ఆత్మశుద్ధిగా ఆలోచన చేయగలిగితే, అసలు సత్యం బహిర్గతంకాక తప్పదు." – లలితవిస్తరుడు అన్నాడు.

"వ్యక్తులదృష్ట్యా, సంఘం అపవిత్రం కావడం – సహనం లోపించడంవల్లనే జరుగుతుంది. కామ ప్రలోభం కలుగడంకూడా ప్రబల కారణం కావొచ్చు !" జలధరుడు మెల్లిగా, సమాధానంగా చెప్పాడు.

"'కావచ్చూ !' కాదు, అవును. నీకు తెలీని కొన్ని సంఘటనలు జరుగుతున్నాయి. ఆర్యసంఘానికి అంతులేని కష్టాలు అధికమవుతున్నాయి. అనేక మంది భిక్షువులు బౌద్ధాన్ని వదిలి, శైవులుగా, స్మార్తులుగా మారుతున్నారు. నేడే – ఇలాగని తక్షశిలనుండి వర్తమానం వచ్చింది'', – అన్నాడు లలితవిస్తరుడు.

"ఏమిటీ ! నిజంగానా ?" – జలధరుడు వింతగా అడిగాడు.

"అవును, నిజంగానే ! ఇహ చేయవలసిం దేమిటి ? సంఘాన్ని ఎలా సంరక్షించడం ? కర్తవ్యం బోధపడటంలేదు. పైగా గౌతముని అనుయాయులు ఈనాడు ఎట్టి భయంకర పాపాలను చేయడానికీ సందేహించడంలేదు. అబ్బ ! ఇదంతా చూస్తూంటే – నా మనస్సెందుకో అమిత వ్యాకులపడుతోంది !" – లలితవిస్తరుడు కలవరపడుతూ అన్నాడు.

"ఇహ నా గతేమిటి ? నే నెలా రక్షింపబడతాను ?" - మయూరాక్షి దైన్య స్వరంతో అడిగింది.

"అవును. వినాశకాలం సమీపిస్తోంది. సంఘారామరక్షణ ఎలా ? మీకే పాలుపోని ఈ ఆలోచన, నా కెలా సాధ్యం ? మీ ముందు అంత పెద్దవాడినా ! నాకేం తోస్తుంది ? మనవి చేయండి ! పదిసంవత్సరాల వయస్సులో నేను, నా తల్లిదండ్రులకు కాలవశాత్తూ దూరమయ్యాను. ఇప్పుడు వారెక్కడున్నారో తెలీదు. అసలు జీవించి వున్నారో, లేదో కూడా తెలీదు. ఇప్పటికి పదిహేను వసంతాలు గడిచాయి - ఈ సంఘారామంలోకి అడుగుపెట్టి - ! మీ చలువ నీడలో సర్వశాస్త్రాలు అభ్యసించాను. మీ ఆ శీర్వాదబలంతో నలందా విశ్వ విద్యాలయ మహాసభలో నిరుటినుంచీ - నేటివరకూ ఎంతోమంది పండితుల్ని వాదోపవాదాల్లో ఓడిస్తూ వస్తున్నాను. ఇవన్నీ తమకు తెలీనివి కావు." - జలధరుడు రవ్వంత ఆగాడు.

"అవును, అవగితాలే జలధరా !" - అన్నాడు లలితవిస్తరుడు.

"అటువంటప్పుడు ఈ సంఘ సంచాలకులైన మీరే శత్రు భయప్రకంపితు లైతే, ఆర్యావర్తమంతా అగ్నిజ్వాలలు రేగి, బౌద్ధవిహారాలన్నీ భస్మీపటలం అయిపోతాయి. క్షమించండి ! బ్రాహ్మణినదీతీర ప్రభుధ సంఘారామ సంచాలకులు, మహాయశస్వి, ప్రచండ విద్వాంసుడు, సత్యవాది, సౌమ్యుడు, సంయమి అయిన లలితవిస్తరులు సుడిగాలిలో ఎండుటాకులాగా సంచలించి పోవడం యింతవరకూ చూడలేదు. చాలా చోద్యంగా వుంది !" - అన్నాడు జలధరుడు.

లలితవిస్తరుడు దిక్కుతోచని ఆందోళనపడుతూ ఉన్నాడు. జలధరుడు ఆయన స్థితిని గమనించాడు.

"భిక్కుల శరీరాలు నాశనంకావడం ప్రాకృతిక లక్షణం ! మనస్సు తలిరు టాకులాగా చలించడం అనాచారం ! అధర్మ ప్రవృత్తి మారుని విజయానికి నాంది !" - జలధరుడు అన్నాడు.

లలితవిస్తరుడు ఎందుకో విసుక్కున్నాడు.

"అబ్బా ! నన్ను విసిగించకు జలధరా ! నువ్వు నిజంగా జలధరంలాగా గర్జిస్తున్నావు ! నీ కంఠంనుండి ఒక్కోమాట వస్తూంటే - ఉరుము ఉరుము తున్నట్లూ, ఫెళఫెళార్భటాలతో, తళుక్కున మెరిసే తటిల్లతలాగా వుంటోంది.

నా గుండెల్లో కుంపటి రాజెయ్యకు ! రక్తజ్వాల రేగగొట్టకు జలధరా !" - లలితవిస్తరుడు తన హృదయ స్థితిని చెప్పుకున్నాడు.

తరువాత, జలధరుణ్ణి తప్పించుకునేందుకు, అక్కడినుంచి లేచి, అడివిలోకి వెళ్ళిపోయాడు.

తిరిగి, ఆయన ఆరామంలోకి వచ్చేసరికి, చాలా రాత్రయింది. జలధరుడు యింకా మేల్కొనే ఉన్నాడు. ఆచార్యులను చూడగానే – లేచి నిలబడుతూ–

"ఆర్యా !" అని వందనం చేశాడు.

"వత్సా !" - అని ఆయన ఆశీర్వదించాడు.

"మీ హృదయం క్రమేపీ ... " - ఆగిపోయాడు జలధరుడు - మిగతా మాట పూర్తిచేయకుండా !

"చెప్పు జలధరా !" - లలితవిస్తరుడు కోరాడు.

"ప్రలోభంవల్ల ప్రకాశక్షయ మవుతోంది !" - అన్నాడు జలధరుడు - మెల్లిగా !

"ప్రకాశక్షయమా ! ఏమిటీ – నా హృదయమేనా ! ప్రలోభంవల్లనా ! జలధరా ! ఏమిటీ ఆధారం ?" - లలితవిస్తరుడు ప్రశ్నించాడు.

"కామం – క్షణికం" - జలధరుడు ధైర్యంగా చెప్పాడు.

"నీతిబోధ చేస్తున్నావా వత్సా !" - చిన్నగా నవ్వి అన్నాడు లలితవిస్తరుడు.

"అవును - నేను వత్సనే !" అన్నాడు జలధరుడు.

"జలధరా ! యిహ నువ్వు వెళ్ళి పడుకో ! కాస్త నన్నాలోచించుకోనివ్వు! సంఘం రక్షింపబడాలి ! శత్రువులు పెరిగిపోతున్నారు", - అని అవతలికి వెళ్ళబోయాడు లలితవిస్తరుడు.

"ఆచార్యా ! మానవుడు తన అంతశ్శత్రువును చూసి ఎక్కువగా భయపడుతున్నాడు. చుక్కాని విరిగిన నావ దరి చేరలేదు. తురంగాల్లాగా ఎగిరెగిరి పడే తరంగాల దయపై ఆ నావ ఆధారపడివుంటుంది. మరి నాకు సెలవు !"– అని జలధరుడు వెళ్ళబోయాడు.

కానీ, యిద్దరూ వెళ్ళలేదు. నిలబడిపోయారు.

"వెడుతున్నావా ?" – లలితవిస్తరుడు అడిగాడు.

"అవును, వెడుతున్నాను. వెళ్ళమంటారా ?" – అనుజ్ఞ నడిగాడు – జలధరుడు.

"వెళ్ళు ... త్వరగా వెళ్లు !" - అన్నాడు లలితవిస్తరుడు. జలధరుడు మెల్లిగా వెళ్ళిపోయి పడుకున్నాడు.

"అసాధ్యుడు - జ్వాలద్దీపికాశిఖ" - లలితవిస్తరుడు, జలధరుణ్ణి అర్థం చేసుకుంటూ నిర్వచించాడు.

''గర్జించే ఓ భయదకాలమేఘం" - లలితవిస్తరుని మనస్సు రూఢిచేసుకుంది.

* * *

ఓ నాటిరాత్రి - చెరిసగం దాటింది, వెన్నెల.

లలితవిస్తరుడు నిద్రపట్టక లేచి, ఆరామం వాకిటిముందుకొచ్చి నిల బడ్డాడు. అడివి వెన్నెట్లో స్నానంచేస్తోంది.

ఒక్కసారి వెనక్కి తిరిగి ఆరామంలోకి చూశాడు.

మయూరాక్షి కనబడింది. తీగమీది పువ్వులాగా నిర్మలంగా - అమాయకంగా నిద్రపోతోంది. అల్లంతదూరంలో జలధరుడు నిద్రపోతున్నాడు. లలితవిస్తరుడు వాళ్ళిద్దరినీ నిశితంగా చూడటం మొదలుపెట్టాడు. వాళ్ళిద్దరూ అన్న పూర్వపు మాటలు, లలితవిస్తరుని మనస్సులో నిద్రలేచాయి - అగ్నిజ్వాలల్లాగా ! ఆ జ్వాలల సెగలకు — వెంటనే లలితవిస్తరుడు చలించాడు...

"మానవుడు అంతశ్శత్రువుని చూసి భయపడుతున్నాడు ... అంతశ్శత్రువు ... అంతశ్శత్రువు ... అదే శత్రువు..." - జలధరుని కంఠం ఆరామప్రాంగణంలో - ఆ నిశ్శబ్ద వాతావరణంలో ధ్వనించింది.

లలితవిస్తరుడు జలధరుని కంఠాన్ని నొక్కివేయాలనుకున్నాడు. ఇంతలో —

"మానవ జీవితంలో చరమ సాత్విక వృత్తి ఏది ?" అని మయూరాక్షి గొంతు మరోవైపునుంచి, ఆ వెన్నెల్ని చీల్చుకొచ్చి లలితవిస్తరుని నీడని ఆక్రమించుకుంది. అతను వెన్నెల తీగెల్లో చిక్కుకుపోయినట్లు భ్రమపడ్డాడు. కానీ ఆమె కంఠంకంటే; ఆమవేసిన ప్రశ్న అతణ్ణి ఉక్కిరిబిక్కిరి చేయసాగింది.

జలధరుని కంఠం - "అంతశ్శత్రువు !" అని గర్జించింది.

మయూరాక్షి గొంతు - "చరమసాత్విక వృత్తి" - అని ఘోషించింది.

ఈ రెండు కంఠాలూ తమలో తాము పోట్లాడుకుంటూ, తనమీద దాడి చేస్తున్నట్లుగా లలితవిస్తరుడు భావించాడు. పెద్ద కంచుతాళం తన చెవులదగ్గర మ్రోగినట్లు భయపడ్డాడు.

హఠాత్తుగా - ఎవరిదో కంఠం మళ్ళీ మ్రోగింది. లలితవిస్తరుడు - ఆ కంఠం మ్రోగినదిక్కు-వేపు చూస్తూ - నిలబడ్డాడు—

"నువ్వు జీవితాదర్శంనుండి యింతక్రిందకు దిగజారిపోయావా లలిత విస్తరా ! పాలరాతిమీద నిలవడం చాతగాని నీటి చుక్కలాగా, ఎంత దీనంగా అధోగతికి జారిపోయావు !" - ఆ కంఠం జాలిపడింది.

లలితవిస్తరుడు వణికిపోయాడు - తట్టుకుంటూ-

"నేనా ! నేనా ! నీటి చుక్కనా ! నిలవలేక దిగజారిపోవడమా ! ఎవరి మాటలు గుడ్డిగా పలికేది ? ఇంత అవివేకంగా - పిచ్చిగా — " - ఆచార్యుడు తన అంతస్థుని తల్చుకున్నాడు.

"అవును ... నువ్వే లలితవిస్తరా ! నువ్వే !" - ఆ కంఠం గంభీరాన్ని నింపుకుంది. అంతటితో ఆగలేదు - మళ్ళీ పలకడం ప్రారంభించింది...

లలితవిస్తరుడు మ్రాన్పడి చూస్తోండిపోయాడు.

"వనమయూరి వయ్యారాన్ని చూసి, కామప్రలోభంలోపడి పతనమై పోతున్నావు - నువ్వే ! నువ్వే ! గుడ్డిగా - పిచ్చిగా - అవివేకంతో !" - ఆ కంఠం ఉద్రేకంగా రేగింది !

లలితవిస్తరుడు జంకలేదు. పైపెచ్చు పెద్దగా - ఫెళ్ళున నవ్వాడు - నవ్వి—

"పంకజాన్ని పొందడానికి, పంకంలో పాదంవెయ్యడం పాపమా ?" - ఎదురుప్రశ్న వేశాడు.

"ఆ ఆకర్షణే నిన్ను అధఃపతితుణ్ణి చేస్తోంది ! అది పనికిరాదు. తప్పు ! తప్పు !" - ఆ కంఠం జాలిగా మందలించింది.

లలితవిస్తరుడు తన వాదాన్ని ప్రారంభిస్తో-

"ఆకర్షణ ఎన్నడూ పాపంకాదు. అత్యంత మాధుర్యంగలది. మయూరి నా కౌగిలింతలో వయారి కాకూడదా ! కావొచ్చు ! కావొచ్చు !"- దృఢచిత్తంతో అన్నాడు.

ఆ కంఠం అసహ్యించుకుంది

"నువ్వు చాలా నీచంగా ప్రవర్తిస్తున్నావు ! నీ కాషాయ వస్త్రాల్లో వైరాగ్యమూ; నీ విష హృదయంలో ప్రేమా ! ఎంత కపటివి లలితవిస్తరా నువ్వు ? మయూరిలాంటి వందలాది ఉపాసికలను సంరక్షించేభారం ఆర్యసంఘం మీద, నీవల్ల మోపబడివుంది" - ఆ కంఠం, లలితవిస్తరునికి, ఉన్న బాధ్యతని గుర్తుచేసింది.

కానీ, అతను వినిపించుకునే స్థితిలో లేడు - లేక -

"కావచ్చు! కానీ, మయూరిని కాదుగా!" — అన్నాడు.

"నిన్ను నువ్వు మోసగించుకుంటున్నావు" - ఆ కంఠం హెచ్చరిక చేసింది.

"లేదు...పొరపాటు... నన్ను నేను నమ్ముతున్నాను" - లలితవిస్తరుడు ఆత్మవిశ్వాసంతో చెప్పాడు.

"ఒట్టి అబద్ధం! ఓ స్త్రీ పయోధర సౌందర్యానికి ముగ్ధుడవయ్యావు! అవునా!" - ఆ కంఠం సూటి ప్రశ్న.

"అవును... ముగ్ధుణ్ణయ్యాను!" - లలితవిస్తరుని జవాబు

"ఛీ!" — ఆ కంఠం చీదరించుకుంది

లలితవిస్తరుడు పకాల్న నవ్వాడు — నవ్వి —

"కళ్ళకు విందుచేసే కమనీయ సౌందర్యం ఈ సృష్టిలో తారసిల్లినపుడు అనుభవించక - అసమర్థుడిలా, జడుడిలా ప్రవర్తించడం యిహ నేను ఒప్పుకోలేను." - తన నిర్ణయాన్ని గట్టిగా వ్యక్తంచేశాడు

ఆ కంఠం యిహ మాట్లాడలేక, దారుణంగా అసహ్యించుకుని - అదృశ్యమైంది.

ఇంతలో - ఎవరిదో నూపురధ్వనీ, ఎక్కడినుంచో మధురమైన సంగీతం, ఆలాపనగా వినబడింది.

లలితవిస్తరుడు ఆ ఆలాపనను వెతుక్కుంటూ - ఆరామాన్ని దాటి, అడివి చెట్లల్లోకి నడిచాడు

వెన్నెల మచ్చలు మచ్చలుగా చెట్లక్రింద పడింది.

ఆ ఆలాపనను అన్వేషిస్తున్న లలితవిస్తరునికి, మయూరాక్షి వచ్చినట్లూ, తనతో తీయగా — చెట్లక్రింద తిరుగుతూ - మాట్లాడుతున్నట్లూ; లలితంగా భ్రమపడ్డాడు. ఆమె గొంతులాంటి గొంతూ; మనిషిలాంటి మనిషీ, కళ్ళకూ మనస్సుకూ తోచినట్లే అతను గాఢ విభ్రమంలో మునిగిపోయాడు. మునిగిపోయి తిరుగుతూంటే - బ్రాహ్మణితీరం వచ్చేసింది ఆక్కడ ఓ చెట్టునీడలో — నిలబడిపోయాడు లలితవిస్తరుడు నిశ్చలంగా.

అ నిశ్చలతను భగ్నంచేస్తూ - వెనకనుంచి - హఠాత్తుగా -

"వచ్చేశాను...నేనే" — అంటూ మయూరాక్షి గొంతు వినిపించింది లలితవిస్తరుడు చటుక్కున వెనక్కి తిరుగుతూ -



"వచ్చావా? ఎందుకూ?" - అతను ఎరగనట్లు అడిగాడు.

"ఎందుకేమిటీ! మీకోసం! మిమ్మల్ని అందుకుని, ఆలింగనంలో అదుముకోవడానికి ! ఆనందం పొందడానికి! యిలా వెన్నెట్లో వచ్చాను! ఇవ్వాళ ఎలా వున్నాను? అందంగా-మీకు నచ్చేలాగా లేనూ?" - మయూరాక్షి ముద్దు ముద్దుగా అంది.

లలితవిస్తరుడు ఆమెని ఆపాదమస్తకం చూశాడు.

"ఇవన్నీ ఏమిటి?" - ప్రశ్నించాడు.

"ఆమాత్రం తెలీదా ఆచార్యా? ఇవి సుందర సుకుమార వస్త్రాలు; ఇది సుచిక్కణ వక్షోవర్తులం! ఇదంతా నా సౌందర్యం! నా యవ్వనం! ఇహ మిగిలింది, మనమిద్దరం పంచుకోవలసిన పరవశత్వం! హాయి!" -

మయూరాక్షి మత్తు, మత్తుగా వివరించింది తన సితిని.

లలితవిస్తరుడు ఉద్రేకపడి, మయూరాక్షిని కావిలించుకుందామని దగ్గరకు వెళ్లాడు – 'మయూరీ!' అంటూ – ఎంతో తపనతో – కానీ,

ఆమె అందలేదు. కనిపించలేదు. వెన్నెల వుంది.

నిరాశపడ్డాడు – నిలువెల్లా!

"మీ కౌగిలికి అందలేకపోతున్నా కదూ! మరి వెతుక్కోండి? ఎక్కడున్నానో? కనిపిస్తున్నానా?" – మళ్ళీ మయూరాక్షి కంఠం రెచ్చగొట్టింది – కవ్విస్తో – చెట్లక్రింది వెన్నెల మచ్చల్లోంచి.

"లేదు ... మయూరీ! ఎక్కడ నువ్వు?" – లలితవిస్తరుడు జాలిగా అడిగాడు. అతని జాలికి మయూరాక్షి హేళనగా నవ్వేస్తో – దూరంగా – దూరంగా అదృశ్యమైపోయింది.

కానీ, ఓ కంఠం – మునుపటిదే – మళ్ళీ మ్రోగింది.

"ఇంత కామోద్రేకమా లలితవిస్తరా! ఇంత రెచ్చిపోయే గాఢ పరిష్వంగ తృష్ణా! క్షణకాలం శరీర ఐక్యతకు యింత విపరీత దాహమా!" – నీచంగా పలికింది!

"ఆలోచించు!" – మళ్ళీ హెచ్చరిక చేసింది.

"ఆలోచనలో నన్ను నేను, ఆత్మవంచన చేసుకోలేను!" – లలితవిస్తరుడు అన్నాడు – మూర్ఖంగా!

"అంతేనా! సద్వంశంలో పుట్టావు. సకల శాస్త్రాలూ చదివావు. వివాహం చేసుకున్నావు. అతిలోక సుందరి అయిన భార్య మృతికి ఆనాడు పదేపదే వగచి, ఈ శరీరం అశాశ్వతమని యెంచి, యవ్వనంలోనే నవరస భావాల్ని నీరసపర్చి, భిక్షుకుడివయ్యావు. ఇన్నాళ్ళు – సౌందర్యమూర్తి అయిన స్త్రీనీ; ఆమె రాగరంజిత రూపాన్నీ; విలాస విభ్రమమైన చేష్టల్నీ విస్మరించి బ్రతగ్గలిగావు...ఈనాడు— ఇప్పుడు—యిన్ని సంవత్సరాల తర్వాత—నీలో ఈ కామాగ్ని ఎందుకు ప్రజ్వరిల్లిందో తెలీడంలేదు. ఈ మహాజ్వాలా వలయంలో నువ్వు పడిపోయి, పతనమై – ఈ సంఘారామాన్ని భస్మీపటలం చేస్తావా?" – ఆ కంఠం కఠోరంగా ప్రశ్నించింది.

వెంటనే, జలధరుని కంఠంకూడా గర్జిస్తూ–

"శరీర విధ్వంసనం ప్రాకృతిక లక్షణం. కానీ, మనో విధ్వంసనం అనాచారం...అధర్మం...పాపం..." – ఆక్రోశించింది.

లలితవిస్తరుడు, ఆ రెండు కంఠాలకూ వణికిపోయాడు. మొదటి కంఠం

తన "అంతరాత్మ ఘోష"ని గ్రహించుకున్నాడు. పశ్చాత్తాపం కలిగింది - తనకి తాను ఓడిపోతూ-

- "తథాగతా! నావల్ల సంఘారామానికి కళంకం రానీయకు!" - అని గబగబా, బ్రాహ్మణీతీరంనుంచి ఆరామంవైపుకు నడక సాగించాడు లలితవిస్తరుడు.

సరాసరి ఆరామం ముందుకొచ్చి నిలబడ్డాడు.

ఎదురుగా బుద్ధవిగ్రహం కనిపించింది; చూస్తో -

''క్షమించరాని మహాపాపం చేశాను. ఒకనాడు - ఈ యవ్వనం, మారుణ్ణి పరాజితుణ్ణి చేసింది. తిరిగి నాకు ఆ బలాన్ని ప్రసాదించు ప్రభూ! తథాగతా!" - అని మోకరిల్లాడు. లలితవిస్తరుని కళ్లు చెమ్మగిల్లాయి.

ఆయన మనస్సు పశ్చాత్తాపాగ్నిలో కాలుతోంది.

అది తెలీక — జలధరుడు, మయూరాక్షి గాఢనిద్రలో వుండిపోయారు - వేరువేరుగా-...ఆరామంలో!

* * *

ఒకనాటి మధ్యాహ్నం-

జలధరుడు లేనిసమయం చూసుకుని, మయూరాక్షి లలితవిస్తరుని దగ్గరకు వచ్చింది.

ఆమెను చూడగానే ఆచార్యులు ఆశ్చర్యపడ్డారు. మనస్సు పశ్చాత్తాపంలో క్షాళితమైనా, మార్పులో మారుఛాయలు పూర్తిగా పోలేదు. కామధూమం యింకా గుండెల అంచులకు పట్టి మరకలు - మరకలుగా వున్నాయి.

అలా వచ్చిన మయూరాక్షిని చూస్తో-

"ఏమిటీ విశేషం?" - అని ప్రశ్నించాడు లలితవిస్తరుడు.

జలధరులు సంఘం విధ్వంసం కాగల సమయం ఆసన్నమైందని సెల విచ్చారు. అది నిజమేనా?" - భయంతో అడిగింది మయూరాక్షి.

లలితవిస్తరుడు ఉలిక్కిపడుతూ——

"జలధరుడా! అలా అన్నాడా! ఆ రోజే వస్తే నిజంగా యెవరాపగలరు ఆ విపత్తుని? అయినా, ధర్మ విధ్వంసం జరగదు మయూరీ!'' - దృఢ విశ్వాసంతో చెప్పాడు.

"ఏమో? నాకుమాత్రం భయంగా వుంది." - మయూరాక్షి మొహం భయంతో నిండిపోయింది — క్షణంలో!

"మయూరీ ! ముఖాన్ని వూరికే భయరేఖల్తో మార్చుకోకు ! ఎందుకంత సంచలనం ?" – లలితవిస్తరుడు ధైర్యం వహించమని కోరాడు. అలా కోరుతూ, కూర్చున్నవాడల్లా లేచి ఆమె దగ్గరకు వచ్చాడు. ఆమెమీద చెయ్యి వెయ్యబోయాడు. మయూరాక్షి, ఆచార్యుల చూపుల్నీ; మనోగత భావాల్నీ గ్రహించి, చటుక్కున అవతలికి తప్పుకుంటూ—

"ఆచార్యా ! ఏమిటీ విపరీతం ? చూస్తూ – చూస్తూ మీరే యిలా నన్ను సమీపించడం నీచంగా తోస్తోంది. పతనం నిజంగా చేరువవుతోంది." - మందలింపుగా అంది.

"భయపడకు మయూరీ ! గౌతముని వరదహస్తం మన శిరస్సులమీదే వుంది. మారుడు మనల్ని ఏమీ చేయలేడు. మయూరీ ! తథాగతునిపై ప్రమాణముంచి చెప్పు ! మనస్ఫూర్తిగా చెప్పు ! నువ్వు నన్ను...చెప్పు..." – యింకా దగ్గరకు వెళ్ళి నిలబడ్డాడు లలితవిస్తరుడు కాముకంగా -

మయూరాక్షి, ఆచార్యులవంక దైన్యంగా చూస్తో–

"ఆచార్యా ! నేను విగత భర్తృకను కానని జలధరుని జోస్యం ! ఆనాటి నుంచీ నా హృదయంలో ఏదో తృష్ణ కానరాని స్వప్నంవలె ఉప్పొంగుతోంది." - మనస్ఫూర్తిగా చెప్పేసింది.

లలితవిస్తరుడు దెబ్బతిన్నాడు. లేస్తో-

"జలధరుని వాక్చమత్కృతిని నమ్మి వూబిలోకి దిగబోకు మయూరీ ! పతి లభిస్తే ఈ సంఘారామాన్ని విడిచిపెడతావా ? గౌతమోపాసికవైన నువ్వు; మానవమాత్రునికి తీగెలా వంగిపోతావా ? కల్పిత మరు మరీచికలో దోవతప్పి, తథాగతునికి ద్రోహం తలపెడతావా ? నువ్వు ఈ చిత్త చాంచల్యానికి ప్రాయశ్చిత్తం చేసుకోవాలి మయూరీ !" - ఆజ్ఞాపించాడు అధికారికంగా !

"అన్నిటికీ సిద్ధమే ఆచార్యా !" - అంది మయూరాక్షి - నిర్భయంగా !

---

"మయూరీ ! చివరకు ఎంతపని చేశావు ?" - నిట్టూర్పు విడుస్తూ లలితవిస్తరుడు అన్నాడు.

"నేనా ... ఆచార్యా ! నేనా ..." - ఆమె తెల్లబోతూ అంది.

"అవును...నువ్వే ! నువ్వే ! ఈ సంఘారామ జీవితంలో పెనుతుఫాను రేపావు. యిహనైనా స్వార్థాన్ని త్యజించు ! పురుషశక్తిని వదిలెయ్యి ! ఆనాడు మహోల్లాసంతో ఈ కాషాయ వస్త్రాలు ధరించావు. తిరిగి ఈనాడు నీకీ అహంకారం పనికిరాదు. ఆర్యసంఘానికే సిగ్గుచేటుగా వుంది నీ చర్య ! నువ్వు

గౌతమోపాసికవు ! పతితులను ఉద్ధరించే భారం నీమీద వుంది. లోక కళ్యాణ కారకురాలివి ! నిన్ను నువ్వు మర్చిపోకు! ఒక్క తథాగతుణ్ణే తల్చుకో !'' -- లలితవిస్తరుడు బోధచేశాడు; మందలించాడు.

మయూరాక్షి మౌనంగా వుండిపోయింది.

మళ్ళీ ఆచార్యులే - బుద్ధవిగ్రహంవంక చూస్తో -

"ఓ బుద్ధ దేవా ! నిన్ను మరిచే ఈ మానవాళిని ఒక్కసారి మేల్కొల్పు ప్రభూ !" - అని మొకరిల్లాడు.

మయూరాక్షి చిన్నగా లోలోన నవ్వుకుంది.

ఇంతలో - అక్కడికి రివ్వున జలధరుడు వచ్చాడు. అతని ముఖమండలం గంభీరంగా జేవురించి వుంది. ఏదో దృఢసంకల్పం కనుబొమల మధ్య ముడిపడి కనబడుతోంది.

మయూరాక్షి, జలధరుణ్ణి తదేకంగా చూస్తూంటే-అవతలికి వెళ్ళిపొమ్మని కళ్ళతో సైగచేశాడు. ఆమె పాదరసంలాగా జారుకుంది.

ఆమె అలా వెళ్ళగానే, లలితవిస్తరుడు మోకరిల్లినవాడల్లా లేచి, వెనక్కి తిరిగాడు. జలధరుడు అగ్నిశిఖలాగా కనిపించాడు. ఒక్కక్షణం లలితవిస్తరుడు విస్తుపోయాడు- ఆయన గుండెల్లో మేఘగర్జన వినిపించింది. ఉరుములు వురిమాయి. తుఫానుసందడి రేగింది. తట్టుకుని నిలబడి ఉన్నాడు చూస్తో !

"నేను ఈ సంఘాన్ని వదిలివేయదల్చాను !" జలధరుడు గాఢ నిర్ణయంతో చెప్పాడు.

లలితవిస్తరుడు హడలిపోయాడు.

"వదిలివేయదల్చావా ? సంఘాన్ని వదిలేస్తావా జలధరా ! ఇంతేనా, నాపట్ల నీకున్న గౌరవం ! వాత్సల్యం ! పదిహేను సంవత్సరాలుగా నిన్ను కన్నతండ్రి వలె పెంచి పెద్దచేసాను. నాతోనేనా నువ్విట్లా మాట్లాడేది ? కామవాసనాయుతుడైనవాడిలా, నువ్వు ఈ కాషాయవస్త్రాలను విసర్జిస్తావా ? ఆర్యావర్తం, దక్షిణాపథం, చీనా- యవద్వీపమూ, సమస్త జగత్తూ ఏ మహాశక్తి చిందుల్లో, ఏ తపచ్ఛాయల్లో చిరశాంతిని సంపాదించిందో, ఆ మహా తపశ్శక్తిని వదిలి హతాహతుడవై, మందభాగ్యుడవై మారుని సుకుమార చేష్టలకు లొంగి వెళ్ళిపోతావా ? జలధరా నిజంగా వెళ్ళిపోతావా ?" గుండెని అరచేతిలో పెట్టుకుని అడిగాడు విచారంగా లలితవిస్తరుడు

జలధరుడు శాంతంగా చూస్తో-

"నేను గృహస్థాశ్రమం స్వీకరించదల్చాను. అదేమీ పాపంకాదు," అన్నాడు.

"నీ ప్రతిభవల్ల, నీ విజయాలవల్ల ఆర్యావర్తంలోని మహామేధావులంతా ఈ బ్రాహ్మణినదీతీర సంఘారామాన్ని చూసి, శిరస్సులు వంచుతున్నారు. ఎందుకో తెలుసా ? నువ్వు ఒక అసాధారణ వ్యక్తివని గుర్తించీ, గొప్ప మేధావి వని ఎంచీ ! ఒకవైపు ఆర్య సంఘంపై కారుమబ్బులు క్రమ్ముకుంటున్నాయి. మరోవైపు యవనులు పురుషపురం, తక్షశిల మొదలైన బౌద్ధ విహారాల్ని భస్మీ పటలం చేస్తున్నారు. జలధరా ! నువ్వు వెళ్ళిపోతే, ఈ ఆర్య సంఘాన్ని నేనొక్కణ్ణీ రక్షించుకోగలనా? చెప్పు జలధరా! చెప్పు! అయినా, నువ్వు మయూరిపై, ఎందుకింత మరులుగొని వున్నావో చెబుతావా ?" లలితవిస్తరుడు బ్రతిమి లాడుతూ అడిగాడు.

"ఆచార్యా ! రూపమోహాలకు ఈ రోజు పరాజితుణ్ణయ్యాను. నేనిదివర కెన్నడూ చూడని మహత్తర సౌందర్య సృష్టిని ఈవేళ చూశాను !" జలధరుడు ఆవేశాన్ని పెంచుకోసాగాడు.

లలితవిస్తరుడు మౌనంగా వుండిపోయాడు-చూస్తో! మళ్ళీ జలధరుడే ప్రారంభించాడు.

"ఆర్యసంఘం ఒక్క వ్యక్తిమీదనే ఆధారపడి వుంటే, అది ఎక్కువకాలం జీవించి వుండలేదు." గట్టిగా చెప్పాడు.

"జలధరా ! నువ్వు సంఘాన్ని అవమానిస్తున్నావు ?" లలితవిస్తరుడు ఆక్రోశించాడు.

"లేదు ఆచార్యా !" నమ్రతగా అన్నాడు- జలధరుడు.

"అవును. నిజంగా అవమానిస్తున్నావు !" లలితవిస్తరుడు మళ్ళీ అరిచాడు- కళ్లు ఎర్రబడ్డాయి.

"లేదు భిక్షూ ! లేదు." జలధరుడు విజృంభించాడు.

"ఏమిటీ ! నన్ను- 'భిక్షూ' అని సంబోధిస్తున్నావా ? ఏమిటీ విపరీతం ?" లలితవిస్తరుడు తెల్లబోయాడు.

"అగౌరవిస్తున్నానని కించపడుతున్నారా ? మీరు యిహ సామాన్య భిక్షువులు ! కానీ, మానవుడు అందరికంటే పైమెట్టువాడు. అతణ్ణి మీరు చువ్వలా కాల్చి, లొంగతీసి, ఆశ్రమాలలో, ఆరామాలలో- విహారాలలో; జీర్ణపర్ణశాలల నీలి నీడల్లో క్రుద్ధకుటీర కుపిత కుట్రలక్రీనీడల్లో బంధించి, వుంచగలిగినంత

కాలం వుంచగలిగారు. ఇహ ప్రయోజనంలేదు. వుంచలేరు. వుండదు..." జలధరుడు రెచ్చిపోయాడు.

"జలధరా! నువ్వు స్త్రీ గాఢ పరిష్వంగనా సుఖాభిలాషివై పిచ్చివాడిలా మాట్లాడుతున్నావు! అదే అమరత్వమని భావిస్తున్నావు! నా దగ్గర స్త్రీని గురించి తల్చడానికి సిగ్గులేదా?" అన్నాడు లలితవిస్తరుడు.

''సిగ్గా! ఎందుకూ! యశోధర పాపియా? అయితే, రాహులుని జన్మ హేతువు పాపకృత్యమా? మాతృగౌరవం పొందడం పాపభూయిష్ఠమా? కాదు. కాదు... ఈ యవ్వనం భిక్షుకావృత్తికి తగిందికాదు." జలధరుడు ఖండితంగా తన నిర్ణయాన్ని చెప్పాడు.

లలితవిస్తరుడు కుపితుడయ్యాడు.

"పాపీ! ఛండాలా! నీచుడా! నీకు స్త్రీమూర్తి వక్షోవర్తులంలో కమనీయ జీవిత స్వర్గం కనిపిస్తోందా? ఆమె నేత్రాలలో నీకు వెన్నెలరేఖలు పాతరలాడు తున్నాయా? ఆమె మధుర వచనాల్లో అమృతం చిప్పిల్లుతోందా? నిజానికి యివన్నీ అశాశ్వతాలే! అది స్వర్గం కాదు– నరకం! అవి వెన్నెల రేఖలు కావు– కుట్రలు సలిపే క్రీనీడలు! అవి మధుర వచనాలు కావు– మాదవత్వంతో కూడిన మాయమాటలు! అమృతంకాదు– విషం! యవ్వనం వుడిగిపోగానే, ధ్వంసమై– మృత్యుముఖానికి చేరుకుంటావు! ఇది తథ్యం!" శపించాడు.

జలధరుడు వూరుకోలేదు– మళ్ళీ రేగాడు.

"యవ్వనం– పాపభూయిష్ఠమైతే; అందం– లోపభూయిష్ఠమైతే; ఆనందం– ఆకర్షణ అశాశ్వతాలయితే, స్త్రీని ప్రకృతితో ఎందుకు పోల్చారు? దానికి మాతృత్వమివ్వగలిగే శక్తిసంపన్నత ఎలా వచ్చింది? అసలు ప్రకృతి ఎందుకు సృష్టించబడింది? నేను వెళ్ళిపోవడంలోగల అంతరార్థం ఈ ప్రకృతిని అన్వేషించడానికే!'' జలధరుడు తన మనోగతభావాన్ని గురువులకు చెప్పాడు.

"నువ్వు వెళ్లలేవు'' ఆయన అరిచాడు.

''ఎందువల్ల?'' జలధరుడు ప్రశ్నించాడు.

లలితవిస్తరుడు కఠోరంగా నవ్వి–

''ఈ సంఘానికి నువ్వు దానం చేయబడ్డావు. సంఘం నిన్ను పెంచి, యింత వాణ్ణి చేసింది!'' ఆంక్ష విధిస్తో చెప్పాడు.

''నేనుమానవుణ్ణి! బలిపశువుని కాను! బలివితర్థికపై తల వంచుకుని నరి కించుకోవడానికి!" జలధరుడు కోపంతో మూర్తీభవించాడు.

"ఛీ! పాపీ! న్యాయంగా **సంఘం** నిన్ను క్షమించదు" – లలితవిస్తరుడు ఉరిమాడు.

జలధరుడు చిన్నగా నవ్వి –

"న్యాయం! ఏమిటీ న్యాయం! మానవుణ్ణి యజ్ఞపశువుని చేయడమా? యిదే అయితే, ఆర్యసంఘం ముక్కలు ముక్కలైపోతుంది. తప్పదు! గౌతముని చివరి పదచిహ్నాలు సైతం, ఆర్యభూమిలో అంతర్ధానమైపోతాయి! ఇది పరిశుద్ధమైన యధార్థం!" అన్నాడు.

లలితవిస్తరుడు ఒక్క నిట్టూర్పు బరువుగా విడిచి –

"ఎంత నీచంగా వదరుతున్నావు జలధరా! ఇంత గర్వాతిశయమా నీకు!" అన్నాడు.

"నేను తప్పక వెళ్ళిపోతాను! ఇహ భిక్షువుగా బ్రతకడం అసంభవం! ఇంతేగాదు – మయూరాక్షి కూడా నాతోబాటు ఈ సంఘాన్ని వదిలేస్తుంది!" – జలధరుడు మరో సమిధ వేశాడు.

**"మయూరి కూడానా!"** – లలితవిస్తరుడు తెల్లబోయాడు.

"అవును. మయూరికూడా సంఘాన్ని వదిలిపెడుతుంది." – జలధరుడు గట్టిగా చెప్పాడు.

"ఎందుకని?" – లలితవిస్తరుడు ప్రశ్నించాడు.

"స్త్రీ పాపరూపిణి కదా! ఆమె అలింగనం విషతుల్యం కదా! అయినా, మీరు మయూరి పేరు వినగానే, అలా నిర్విణ్ణులైపోయారేమిటీ?" – జలధరుడు ఎరగనట్లు ప్రశ్నించాడు.

"అబ్బే! ఏంలేదు." – లలితవిస్తరుడు సర్దుకున్నాడు. జలధరుడు ఆయన స్థితిని గ్రహిస్తో –

"మయూరాక్షిని నాతోబాటు స్వయంగా తీసుకుపోతున్నాను మీకు ఆమెమీద ఆసక్తి; ఆపేక్షా; మోహం ఉన్నాయని నాకు తెలుసు! ఇహ మీ మోసం ఆమె దగ్గరగానీ, నావద్దగానీ సాగదు!" – నిర్భీతిగా చెప్పాడు.

"మయూరాక్షి ఒక మహాజ్వాలా నర్తకి! ఆమె మహోజ్వల జ్వాలా నృత్యంలో – ఆ భంగిమల్లో – ఈ సంఘాన్ని దగ్ధం చేయగలదు!" – లలితవిస్తరుడు రౌద్రంతో అన్నాడు.

"అవును...మిమ్మల్నికూడా!" – జలధరుడు చాలా తేలిగ్గా అన్నాడు. ఆ



మాటకు లలితవిస్తరుడు స్రమాన్పడిపోయాడు. నోట మాట రాలేదు. శిలయ్యాడు!

జలధరుడు వెంటనే అక్కణ్ణుంచి వెళ్ళిపోయాడు. అప్పటికి సాయంత్రం దిగజారిపోయింది

చీకట్లు ముసురుకున్నాయి...

* * *

బ్రాహ్మణి నదీతీరం –

మార్గశీర్షపు వెన్నెలను పుచ్చపూవులా పర్చుకున్న ఇసుకబయలు. మెల్లిగా– ముగ్ధవధూమణి వయ్యారాల నడకలా పారే నీటిప్రవాహం. చిరు కెరటాల చిరునవ్వుల సవ్వడి...అక్కడక్కడా చకోరాల సయ్యాటలలో రెక్కలు చేసే చప్పుళ్ళు...ఆ కొమ్మనుంచి, ఈ కొమ్మపైకి ఎగిరే – వాలే–కేకి గణ క్రీంకారాలూ – ఆనాటి రాత్రి – వెన్నెల దీపంతో – మహాకవి కావ్యంలా మనోజ్ఞంగా వుంది.

మయూరాక్షి ఆ వెన్నెల్లో – ఆ ఇసుకబయల్లో – ఓ చోట కూర్చుని,

తన హృదయావేదనను క్రమక్రమంగా - ప్రకృతికి వ్యక్తంచేస్తూ - పాడుకో సాగింది.

నయనాంతర్గత విషాద యవనిక
అలవోకగ ఎవరో తీసిరి!
నిదురబోవు హృదయవీణ
కదిపి మీటి మధురముగా -

నెలబాలుని చిరువెన్నెల
అలముకొనని జీవితమున
మలయానిల మాలికలను,
వెన్నెల తియ్య దేనియలను
కురిపించెనె సుకుమారుడు
కుసుమ బాణములను వేసి -

తప్త కాంచనమ్ముపోలె
తరళ కాంతులీనె ఎడద
తృప్తిమీర ఆశాలత
చిగురించెనె సాగి - సాగ -
నయనాంతర్గత విషాద యవనిక
అలవోకగ ఎవరో తీసిరి! —

—మయూరాక్షి తన్మయంగా పాడుకోసాగింది. పరిమళించిన వెన్నెల ఆమెనీ, ఆమె గానాన్నీ అభిషేకిస్తోంది.

ఇంతలో - జలధరుడు, ఆమెని వెతుక్కుంటూ వచ్చి -

"మయూరీ!" - అని పిలిచాడు. మయూరాక్షి ఉలిక్కిపడి -

"మీరా!" - అంది.

"ఏం - భయపడ్డావా! నీ ఏకాంతాన్ని భంగపర్చాను కదూ!" అన్నాడు జలధరుడు

"లేదు ప్రభూ! రవ్వంత జలదరించాను." చిన్నగా నవ్వుతూ అంది మయూరాక్షి.

"అందుకే నువ్వు మయూరివిగా నా జీవితంలో ప్రవేశించి, భాగం పంచుకున్నావు!" - అన్నాడు జలధరుడు.

"జలధరం లేకపోతే, మయూరికి సృష్టిలో విశిష్టతేముంటుంది దాని వయ్యారానికీ, లావణ్యానికీ మీ పిలుపే ప్రోత్సాహం! సంతృప్తి! ఇన్నాళ్ళుగా ఈ ముచ్చటైన పిలుపుకి కాదూ - ఈ మయూరి తపస్సు!" - మయూరాక్షి మనస్సు విప్పింది.

"మయూరీ!'' - జలధరుడు పిలిచాడు.

ఆమె, అతని ముఖంవంక చూసింది

"మయూరీ! నేను నీతో కొన్ని విషయాలు చెప్పదల్చుకున్నాను. దానిమీద నీ - నా జీవితాలు రెండూ ఆధారపడి వున్నాయ్ 'అందుకే కాబోలు' అన్నట్లు - ఈ వేళ నీ గొంతునుంచి మేఘరంజని రాగం మనోరంజకంగా విన వచ్చింది బహుశా! ఈ రాగమే, మన జీవితంలో జీవనరాగమై - లోక విఖ్యాత మవుతుంది - ఆశలు ఫలించినట్లుగా!" - జలధరుడు హాయిగా మాట్లా డటం ప్రారంభించాడు - యిలా!

"ఏమిటో సెలవిస్తున్నారు? బోధపడటంలేదు!" అంది మయూరాక్షి!

''మయూరీ! నేను — నేను నీ భర్తను!" — జలధరుడు మనస్సులో ఉన్న విషయాన్ని చెప్పేశాడు.

"ఆర్యా! మీరు నన్ను అవమానించడంలేదు గదా!" — మయూరాక్షి సందే హంగా అంది.

"లేదు మయూరీ! నీ హృదయం; నీ తపన అర్థంగాకపోలేదు కానీ, నువ్వు — ఈ వాతావరణాన్ని విస్మరించలేక ఓ వైపూ — నాపై నీకున్న భావంతో మరో వైపూ— విచలితాత్మురాలి వవుతున్నావు! అందులో అకాల వైధవ్యం నిన్నలా భావింపచేస్తోంది. అంతే! అది అసత్యం! ఇది నీ అజ్ఞానం! పర్వతంనుండి క్రిందికి వచ్చే మార్గం నీకు కనిపించడంలేదు. అందువల్ల దాన్నే నమ్ముకుని, అక్కడినుండి దొర్లడానికి ప్రయత్నం చేస్తు న్నావు." — జలధరుడు వివరించాడు.

"మీరేమిటో — వింతగా మాట్లాడుతున్నారు?" — మయూరాక్షి అంది.

"భర్త అనుజ్ఞలేనిదే ఏ స్త్రీ కూడా ఉపాసికగా వుండరాదు." — జలధరుడు అన్నాడు.

"ఈ సంఘానికి దానంగా సమర్పించబడిన వ్యక్తికి, ఉపాసికకు అనుమ తిచ్చే అధికారం ఎక్కడుంది?" — మయూరాక్షి సూటిగా అడిగింది.

"అదేమీ కాదు" — జలధరుడు అన్నాడు.

"ఆర్యా! మీరు నన్ను పిచ్చిదానిని చేస్తున్నారు! మీరే సర్వస్వాన్నీ త్యజించి, నన్ను చేపట్ట జూస్తున్నారు!" – మయూరాక్షి చులకనభావం చూపింది.

"లేదు. నీ విషయమంతా తెలిసింది!" – జలధరుడు అన్నాడు.

"ఏమిటీ తెలిసింది మీకు?" – ఆమె అడిగింది.

"చెప్పమంటావా మయూరీ! నీ తల్లిపేరు కిరణబాల; నీ తండ్రి మహాశ్వేత! నా తండ్రి పేరు శశిధరుడు. నా తల్లి కేదార! చిన్నప్పుడు నన్ను దొంగలు అపహరించి, చివరకు ఈ సంఘారామానికి దానంచేశారు నీ తండ్రి ఉజ్జయిని నుండి, తిరిగి మణిభద్రపురం వెళ్ళే సమయంలో మనిద్దరికీ వివాహం జరిగింది మా నాన్నగారూ – మీ నాన్నగారూ కలిసి, జావా సుమిత్రా దీవులలో వ్యాపారం చేయాలని అప్పట్లో అనుకున్నారట!" – జలధరుడు పూర్వ వృత్తాంతాన్ని చెప్పాడు.

మయూరాక్షి తెల్లబోతూ –

"స్వామీ! నాకేం తోచడంలేదు! మీరు...మీరు...నా...కాదు...కాదు! జ్యోతిష ప్రభావంవల్ల మీరీ విషయాలన్నీ తెలుసుకుని వుంటారు. అంతే! అంతే స్వామీ!" – తికమకపడుతూ అంది.

జలధరుడు పకాల్న నవ్వాడు – నవ్వి –

"జ్యోతిషం పేర్లను చెప్పదు మయూరీ! పద...ఈ సంఘంలో మనం కలిసి యిహ వుండలేం! యవ్వనం, ప్రేమ అంటే, ఈ సంఘానికి అర్థం తెలీక, పాపమంటుంది. నాకు యిహ ఆ పాపమే కావాలి! నా జీవితం ఎండిపోయిన మానువలె శుష్కమై – నీరసమైపోయింది ఇహ యిలా వుండటం నా కిష్టంలేదు. సంవత్సరాల తరబడి, నువ్వు నాకై నిరీక్షించి, ఎన్నో దుఃఖాలను సహించి, అపజయాన్ని జయమని భావించి – తలవంచావు! ఎవరి కోసం నువ్వు; నీ తల్లిదండ్రులూ – ఏడ్చేడ్చి కళ్ళు పోగొట్టుకున్నారో – అతడు ఈనాడు – నీ జీవిత సుఖస్వర్గ ద్వారాన్ని తెరవమని యాచిస్తున్నాడు మయూరీ!" – బేలగా అన్నాడు

మయూరాక్షికి అతని మాటలపై నమ్మకం కలగలేదు. ఏదో సందేహం ఆమెని పీడించసాగింది

"మీరు నా భర్తలే – దేవతలే కావొచ్చు! కానీ, ఆర్యసంఘం ఏమనుకుంటుంది? వారికి మనమంటే విశ్వాసం కలుగుతుందా? కాదు స్వామీ! ఇహ

జీవిత శేషమెంత వుంది? మదనరూప రాగలాలసని వదిలేద్దాం!" — భయ భయంగా అంది మయూరాక్షి.

జలధరుడు మందహాసం చేశాడు.

"రూపలాలసా — మయూరీ! పరవశత్వానికి రూపమేది ఉన్నా, మన సౌందర్యం వుండదు. పురుషుణ్ణి చూస్తే అసహ్యం వేస్తోందని, గుండెమీద చెయ్యేసుకుని చెప్పగలవా? స్వరలహరుల ఆరోహణ, అవరోహణం వలెనున్న మృణాల కోమల సుకుమార బాహువల్లరులు; పరిస్థితిజన్యాలై; వైషమ్యరూప మేఘపటలాలలో దాగిన ఈ చంద్రవదనం — అంతులేని నీ సౌందర్యం — మయూరీ! కాషాయవస్త్రాలపాలై, ఆక్రందనం చేయడానికేనా? అలా వీల్లేదు! అలా కావడం సంభవిస్తే నేను చూస్తూ సహించలేను!" — జలధరుడు, ఆమె అపూర్వ సౌందర్యం వృధాగా — అడివికాచిన వెన్నెల కావడానికి యిష్టపడ లేదు.

మయూరాక్షికి యింకా సందేహం తీరలేదు.

"పునర్జన్మ — ! పరలోక శృంఖలాలను అకారణంగా తెంచివేయడంలో ఔచిత్యమేముందీ?" — ఆమె అడిగింది.

"మయూరీ? మార్గం మరిచిపోకు! ఆత్మవంచన చేసుకోవడంవల్ల ప్రయోజనంలేదు. పరలోకం కేవలం ఓ కల్పన! ఓ వూహ! అది ఎవ్వరికీ ప్రత్యక్షరూపం కాదు! లలితవిస్తరులు నీలో పరలోక విశ్వాసాన్ని కలుగ చేశారు అసలు ఆయనకు ఈ పరలోకజ్ఞానం ఎలా లభించిందో అడుగు! ఎవరు చెప్పారు? పోనీ, ఎవరు చెప్పగా విన్నారు? ఆ చెప్పినవారు కూడా ఎవరిదగ్గరో విన్న బాపతు! పరలోకాన్ని స్వయంగా చూసి, ఇది నిజమేనని ఎవరైనా అక్కణ్ణుంచి యిక్కడికి వచ్చి, చెప్పిన మహాత్ములున్నారా? ఇలాంటి వూహను ఆధారంచేసుకుని ప్రత్యక్ష స్థూల జీవితాన్ని హోమం చేసుకోవడం తెలివిగల పనికాదు మయూరీ!'' — జలధరుడు ఆమెను ఎలాగైనా ఒప్పించడానికి ప్రయత్నించసాగాడు

ఆమె లొంగక — "అయినా..." అని ఆగిపోయింది.

జలధరుడు కూడా అంతటితో ఆగలేదు —

"ఇంకా 'అయినా' ఏమిటి మయూరీ! మృత్యువు తర్వాత, నువ్వు ఎలా పరలోకాన్ని చేరగలవు? జీవాత్మతోటేనా! ఈ జీవాత్మ కేవలం పాషండం! మానవునిలోని ఆలోచనానుభూతుల శక్తి, ఈ స్థూల శరీరం

తాలూకు సూక్ష్మక్రియ! స్థూలరూపమైన పుష్పంలో వున్న సుగంధం — తైలం — ఒత్తి — ఈ రెండింటి దయవల్లా — ; అగ్నిదోహద క్రియవల్లా వచ్చే దీ ప్రకాశం! నిర్యాణం తర్వాత దీని ప్రకాశం శూన్యం! సూర్యుడు, దీపం — రెండూ పోయిన తర్వాత, కాంతి ఏదీ? జీవునికంటే వేరైన ఆత్మ లేదు. తన్నిర్మాణ ప్రయత్నం శుద్ధమూర్ఖత్వం! ఇతరులు చెప్పిన మాటల్ని గుడ్డిగా విశ్వసించక, నీ అనుభూతుల్ని మేల్కొల్పు! మయూరీ — స్వానుభూతియే జీవిత పరమసత్యం! ఈ చరాచర జగత్తు యావత్తూ సత్యపుంజీభూతం! నేను సత్యం...నువ్వు సత్యం! నీ నా అస్తిత్వ సంబంధం సత్యం! పరమ సత్యం!" — జలధరుడు తన మేధ సంపత్తిని చూపడం మొదలు పెట్టాడు.

అయినా, మయూరాక్షి అంకెకు రాలేదు!

"కానీ, శరీరం నశ్వరం! దానిద్వారా లభించే సుఖాలూ నశ్వరాలేగా!" — ఆమె అంది.

జలధరుడు చిన్నగా నవ్వి —

"అమరత్వాన్ని కాంక్షిస్తున్నావా మయూరీ! భ్రమవల్ల దేనిని నాశనమని అంటున్నావో, అది కేవలం పరివర్తన మాత్రమే!" అన్నాడు తేలిగ్గా!

"ఎలా? వివరిస్తారా?" — మయూరాక్షి అడిగింది.

"అయితే విను! కొన్నివేల సంవత్సరాల క్రింద మానవుడు జీవించి ఉన్నాడు. నేడూ ఉన్నాడు! అమరుడే! యింకా వేలసంవత్సరాల తర్వాత కూడా అతడు అమరుడుగానే జీవించి ఉంటాడు మయూరీ! సంతతి రూపంలో మానవుడు అమరత్వాన్ని పొందుతున్నాడు!" — జలధరుడు సూక్ష్మంగా చెప్పాడు.

మయూరాక్షి, అతని మాటలకూ; అందులోని సారాంశానికీ లొంగలేదు. తిరస్కారపూర్వకంగా —

"ఏమైనా స్వామీ! నేను గౌతమోపాసికను! మీరు నా రూప యౌవ్వన ప్రలోభంలోపడి, జీవితంలోని ఉన్నతాదర్శాలను మర్చిపోయి జారిపోతున్నారు! గౌతముని సాక్షిగా, నేను ఆయనకి అంకితమైపోయాను! నేనెక్కడికీ రాను! రాలేను!" — అని చెప్పేసింది.

జలధరుడు హతాశుడవుతూ —

"మయూరీ ! ఇదా నీ మాట ! నా హృదయాన్ని చీల్చుతిన్నావు మయూరీ !" - అని అంటూ ఆ వెన్నెల్లో – ఇసుకబయలుపై తూలి పోయాడు.

"అయ్యో!" – అంటూ మయూరాక్షి, జలధరుణ్ణి పట్టుకుంది. అతనికి ముచ్చెమటలు పోస్తున్నాయి.

"జలధరా!" - అని మయూరాక్షి వింతగా పిలిచింది! జలధరుడు పలకలేదు.

*　　　*　　　*

గతరాత్రి – బ్రాహ్మణి తీరంలో – ఇసుకబయలులో – వెన్నెట్లో – జరిగిన సంఘటన గురించి లవితవిస్తరుడు తెలుసుకుని, కోపంతో వూగి పోతున్నాడు

ఎదురుగా మయూరాక్షి దోషిగా నిలబడివుంది. లవితవిస్తరుడు కళ్లెర్రచేస్తూ –

"మహామేధావుల బుద్ధి తేజోవిహీన మయ్యేట్లూ; స్వర్గం చీకటి భారాన్ని వహించేట్లూ; మానవజీవితానికి అభిశాపరూపంలో మహావిషం వ్యాపించేటట్లూ – చేసిన నేరం – అపచారం – రెండూ నీ మీద ఉన్నాయి మయూరీ! బుద్ధదేవుని పాదపద్మాలు స్పృశించి – నేను చెప్పేది – అసత్యమేమో ఆలోచించు!" –అన్నాడు.

సరిగ్గా – ఆ సమయానికే జలధరుడు మెల్లిగా వచ్చాడు. అతణ్ణి చూడగానే, లవితవిస్తరుడు మరింత కోపఘూర్ణితు డయ్యాడు. జలధరుడు పట్టించుకోక–

"తనను తాను మోసగించుకోవడం మానవధర్మమా?" – అని నేను తమర్నే సూటిగా ప్రశ్నిస్తున్నాను" – అన్నాడు ఉత్తేజిత కంఠంతో!

"జలధరా ! మారుడు నిన్ను పూర్తిగా జయించాడు" – అన్నాడు లవితవిస్తరుడు హేళనగా!

"మీరు యితరుల్ని మోసగించగలరుగానీ, ఈ జలధరుణ్ణి మోసంచేయలేరు! నా కన్నుల్లో యింకా తేజస్సు క్షీణించలేదు! సంఘంలో–మయూరాక్షి అవమానించబడితే, చూస్తూ వూరుకునేవారు తిర్యక్కులకంటే హీనులన్నమాట!" – జలధరుడు గర్జించాడు.

లవితవిస్తరుడు అసహ్యించుకుంటూ –

"వివేకహీనుడా ! స్త్రీ వ్యామోహంలో దట్టంగా చిక్కుకున్నావు !"అన్నాడు.

"మీ మనస్సులోని ఆసక్తిని నామీద మోపుతున్నారు! గ్రహిస్తున్నారా ఆచార్యా!" జలధరుడు చురకలేశాడు.

లలితవిస్తరుడు పిచ్చిగా నవ్వి—

"నువ్వుమాత్రం మయూరిపట్ల ఆసక్తుడివి కాలేదా?" అని ఎదురుప్రశ్న వేశాడు.

"ఈ సంఘం అపవిత్రమైనప్పుడు, నేను మయూరిపట్ల ఆసక్తుడనవడంలో వింతలేదు!" అన్నాడు జలధరుడు.

"నువ్వే అంటున్నావుగదూ- ఆ మాట!" లలితవిస్తరుడు అరిచాడు.

"నిరాఘాటంగా!" జలధరుడు చెప్పాడు

"శిక్ష ననుభవిస్తావు జలధరా! ఈ పాపాచరణకంతకూ నువ్వే ప్రబల కారణం! నీతో యిహ నాకు పనిలేదు. నిప్పుని గుప్పెట్లో ఎవరు దాచుకో గలరు?" లలితవిస్తరుడు ముఖం తిప్పుకున్నాడు.

"అయితే, సంఘంలో మనుష్యులుగాక, గడ్డిపోచలు నివసిస్తున్నాయా?" జలధరుడు రెట్టించాడు.

"నువ్వు అగ్నికంటే భయంకరుడివి!" లలితవిస్తరుడు తీర్మానించాడు.

"అయితే- తప్పకుండా ఈ బ్రాహ్మణి నదీతీర సంఘారామం ధ్వంసమవు తుంది." జలధరుడు ఉద్రేకంగా గర్జిస్తూ శపించాడు.

సరిగ్గా- ఆ సమయంలో— అతని శాపానికి ప్రతిఫలంగా ఎక్కడినుంచో గుర్రపుడెక్కల ధ్వని వినిపించింది. ఉరుములు- మెరుపులూ; తుఫానుహోరూ; వికృతమైన కంఠాలూ వినిపించాయి.

"నాకు నీ ఉపదేశాలతో; శాపాలతో పనిలేదు. నీ బెదిరింపులకు నేనేమీ జడుసు కోను!" అని లలితవిస్తరుడు వెనక్కి తిరిగి వెళ్ళిపోతూ-

"మయూరీ! యింకా యిక్కడే వున్నావా? ముందు వెళ్ళి, నీ పనేమిటో చూసుకో! పతనమైపోతోంది ఈ ఆర్యధర్మం! వెళ్లు!" ఆజ్ఞాపించాడు.

మయూరాక్షి ఒక్కసారి తలెత్తి—

"ఏమిటీ సంచలనం! ఏమిటీ!!" అని వెళ్ళబోతూండగా- జలధరుడు ఆమె చెయ్యి పట్టుకుని-

"ఆగు- మయూరీ!" అన్నాడు.

లలితవిస్తరుడు వెంటనే

"ఎందుకూ ఆపావు?" అనడిగాడు.



"మయూరిని నాతోబాటు తీసుకుపోతున్నాను ! ఆమె నా భార్య !" అన్నాడు జలధరుడు !

"నువ్వు ఒక పవిత్రురాలిని పాపకూపంలోకి పడత్రోయాలని చూస్తున్నావు! కానీ, ఆ పని ఎన్నటికీ జరగనివ్వను ! ఇష్టమైతే, నువ్వొక్కడివే వెళ్ళు ! మయూరి యిక్కడే వుంటుంది. ముందామె చెయ్యి విడిచిపెట్టు !" లలితవిస్తరుడు ఉరిమాడు.

"మీరు నివురుగప్పిన నిప్పులాంటివారు ! నన్ను మోసంచేయలేరు ! మయూరాక్షి నా భార్య ! ఆమెతో నాకు వివాహం జరిగింది ! మీరు ఆమెని గుడ్డి భ్రమలో పడేశారు ! స్వార్థపూరిత హృదయంతో ఆమెని చేపట్టాలని వెంపర్లాడుతున్నారు !" జలధరుడు ఉద్రేకం చూపసాగాడు.

"మయూరి ఇక్కడ ఉండక తప్పదు !" లలితవిస్తరుడు శాసించాడు.

"ఎందుకుండాలి ? మీ కుత్సిత కాముక ప్రవృత్తి శమనానికా ? ఇదేనా మీ త్యాగం ? మీ వైరాగ్యం ?" జలధరుడు విజృంభించాడు.

"జలధరా ! అవాచ్యాలు పలకకు ! నశిస్తావు !" లలితవిస్తరుడు కఠోరంగా అన్నాడు.

జలధరుడు హేళనగా నవ్వి-

"మీరు మయూరాక్షిని ఏ పుణ్యశిఖరాలమీదికి తీసుకుపోవాలనుకుంటున్నారో చెప్పండి ! ఉపాసికలు శీలభ్రష్టలై, మీవంటి అనాచారుల పాలబడుతుంటే, ఆర్యసంఘం చూస్తూ వూరుకుంటుందా ? దానికేమీ బాధ్యతలేదా ?'' అని లలితవిస్తరునికి సమాధానంచెప్పి, మయూరాక్షివంక చూశాడు. చూసి-

"ఏం మయూరీ? ఏమిటి నీ ఉద్దేశ్యం ? చెప్పు! ఇక్కడ వుండే పక్షంలో నీ స్త్రీత్వం సురక్షితం కాజాలదు ! ఏ నిముషాన్నైనా- ఈ కాలోరగం నిన్ను కాటు వెయ్యక తప్పదు ! నీ జీవితశక్తిని పీల్చివేస్తుంది ! నువ్వు నాతో రాక తప్పదు మయూరీ !" అన్నాడు- జలధరుడు !

మయూరాక్షి ఎటూ చెప్పలేక-

"మీరెందుకింత తెగిస్తున్నారు ?" అంది.

"నీకోసం ! నా భార్య మయూరాక్షికోసం ! నీ సుఖమయ జీవితంకోసం ! తెలుసా !"-జలధరుడు మనస్ఫూర్తిగా చెప్పాడు.

గుర్రపుడెక్కల చప్పుళ్లు దగ్గరవసాగాయి. మళ్ళీ విచిత్రమైన కంఠధ్వనులు రేగాయి. తుఫాను హోరు...

"అరుగో ! యవన సైనికులు ! సంఘారామం చుట్టుముట్టారు !"-జలధరుడు అరిచాడు. అరిచి, వెనక్కి తిరిగాడు.

మయూరాక్షి కనిపించలేదు. కంగారుపడ్డాడు.

"ఏది మయూరి ? ఎక్కడ ?" వెదకడం మొదలుపెట్టాడు- ఆరామగదుల్లో- చీకట్లలో-

"రా ! మయూరీ ! రా ! నా వెంట రా !" అని మయూరాక్షి చెయ్యి పుచ్చుకుని, లలితవిస్తరుడు గుంజడాన్ని జలధరుడు చిన్న దీపంముందు చూశాడు. రివ్వున అక్కడికి పోతూ-

"ఆచార్యా ! మీరిలా నా భార్యని తాకి, పడలాక్కునిపోవడం ఉచితం కాదు ! దారుణకృత్యం ! వదిలెయ్యండి !" అని జలధరుడు, లలితవిస్తరుని

చేతిని లాగాడు! లాగి తలెత్తగానే- జలధరుని ఎదురుగుండా ఓ యవనసైనికుడు నిలబడి ఉన్నాడు— కత్తితో! భయంకరంగా!

జలధరుడు, లలితవిస్తరుడు, మయూరాక్షి ముగ్గురూ తప్పుకోవాలని ప్రయత్నించబోయారు. కానీ, ఆ సైనికుడు కత్తిఎత్తి—

"ఆగండి! కదిలారో సఫా!" అని అరిచాడు; అరుస్తూ— లలితవిస్తరుణ్ణి పట్టుకున్నాడు వచ్చి!

జలధరుడు జాలిపడ్డాడు— అడ్డువెడుతూ— "ముందా కత్తిదించు! ఆయన లలితవిస్తరులు! ఈ సంఘారామ సంచాలకులు! మా గురుపాదులు! ఎత్తిన కత్తిదించి, ప్రాణభిక్ష పెట్టండి!" వేడుకున్నాడు.

ఆ సైనికుడు వికటంగా నవ్వి—

"చుప్‌రహో! తప్పుకో ముందు! కత్తికి అడ్డంరాకు!" అని ఎడంచేత్తో జలధరుణ్ణి బలంగా తోశాడు.

ఆ తోపుడికి జలధరుడు వెళ్ళి ఆరామగదిగోడకి కొట్టుకున్నాడు. పెద్ద శబ్దమైంది- ఆ గదంతా చీకటితో నిండిపోయింది.

వెలిగే చిన్నదీపం ఆరిపోయింది, ఎప్పుడో!

సైనికుడు కనిపించలేదు. అతని అలికిడి కూడా వినిపించలేదు. నెమ్మదిగా జలధరుడు ఆ చీకటిలో మయూరాక్షిని వెతుక్కుంటూ పట్టుకున్నాడు.

ఆమె 'స్వామీ!' అంది.

"ఇశ్శో! అరవకు! ఇక్కడ— దక్షిణగవాక్షం దగ్గర! మూలకు రా!" మయూరాక్షిని మెల్లిగా దగ్గరకు చేర్చుకున్నాడు జలధరుడు.

"ఆచార్యులు ఏరీ?" మయూరాక్షి శబ్దంరాకుండా అడిగింది.

"చీకటి మింగేసింది!" జలధరుడన్నాడు.

"స్వామీ! ఆరామమంతా ధ్వంసమైపోతోంది! గడ్డపలుగులు ఎలా మోగుతున్నాయో వినిపిస్తోందా?" మయూరాక్షి వేదనపడింది.

"అవును... ధ్వంసమవుతోంది. నిజమే! వెలుగు పోతోంది! చీకటి ఆర్యావర్తాన్ని అలుముకుంటోంది!" జలధరుడు ఆమె వేదనను పంచుకుంటూ అన్నాడు.

ఇంతలో పెద్ద చప్పుడైంది ఆరామంలో!

"విన్నావా మయూరీ! బుద్ధవిగ్రహాన్ని ఎలా పగలకొడుతున్నారో?" జలధరుడు గాద్గదికంగా అన్నాడు.

ఇద్దరూ మెల్లిగా- గవాక్షంలోంచి, ఆరామ మధ్యభాగంలోకి తొంగిచూశారు. యవనసైనికులు నిజంగానే బుద్ధవిగ్రహాన్ని బద్దలుచేస్తూ- తవ్వుతున్నారు.

వాళ్లమధ్య ఆరామ దీపాలు వెలుగుతున్నాయి.

"ఎందుకలా చేస్తున్నారు ?" మయూరాక్షి అడిగింది మెల్లిగా.

"రత్నాల్ని తవ్వుకుని, బస్తాల కెత్తుకుని పోవడానికి !'' జలధరుడు చెప్పాడు.

"ఏమిటా మంట ?'' మళ్ళీ ఆమె అడిగింది.

''మతగ్రంథాల్ని తగలపెడుతున్నారు !" జలధరుడు చూస్తో చెప్పాడు- బాధగా !

"మరేమిటీ కర్తవ్యం ?'' ఆమె అడిగింది.

"బయటకి తప్పుకోవడమే !'' జలధరుడు అన్నాడు.

''ఎట్లా ?" ఆమె ప్రశ్నించింది.

"నేను మెల్లిగా దారితీస్తాను. వెంట వచ్చెయ్యి ! చప్పుడు చేయకు !'' జలధరుడు చెప్పాడు.

''ఎక్కడికి ?'' మయూరాక్షి అడిగింది.

"భర్తదగ్గరికి !'' జలధరుడు అన్నాడు.

మయూరాక్షి యిహ మారు మాట్లాడకుండా, జలధరునితోపాటు- ఆ చీకట్లో వెంట నడిచింది.

ఇద్దరూ రహస్యమార్గంలోంచి, ఆరామాన్ని దాటి, అడివిలోకి వచ్చేశారు.

వెన్నెల కాస్తోంది. బ్రాహ్మణి పారుతోంది.





# వేటపు

ఘండికోట బ్రహ్మాజీరావు

నూరు రూపాయల నోటు మరోమాటు చూచి మడిచి పర్సులో పెట్టుకోబోతున్న శివయ్య ఒక్కసారి నీరువిడిచి పోయాడు.

ఎదురుగా రామారావు నిలబడ్డాడు

అతని కళ్ళలో నిప్పులు రేగు తున్నాయి.

"శివయ్యా! ఆ నోటు ఇలా తే!" రామారావు కోపంగా అన్నాడు.

శివయ్య దానిని గట్టిగా పట్టు కున్నాడు.

"ఇయ్యి ముందు!" గర్జించాడు రామారావు.

శివయ్య దీనంగా రామారావు ముఖం లోకి చూచాడు.

"లైసెన్సు తొందరగా తయారు చేయించడానికి కారణ మిదేనా? బతిమాలి బతిమాలి వారంరోజులలో ఇవ్వవలసిన

దానిని రెండురోజులలో ఇప్పించావు!"

శివయ్య జవాబు చెప్పలేదు. చూపులు కిందకు తిప్పుకున్నాడు.

"ఆఫీసులో ఎవరూ లేరనుకున్నావు. ఉన్న ఒక్క బంట్రోతును బజారుకి పంపించావు. నీకన్నా ముందు ఆఫీసుకు వచ్చి, మూలనున్న బీరువాలోని ఫైళ్ళు చూస్తున్నానన్న సంగతి కూడా తెలుసు కోలేక పోయావు. అంతే. లంచం పుచ్చుకునేటప్పుడు కళ్ళు మూసుకు పోతాయి."

శివయ్య ముఖం ఉదాసీనంగా ఉంది. పిడికిలి బిగించి నోటు బయటికిపోకుండా పట్టుకున్నాడు.

"నీ కొచ్చిన వయస్సు ఇంకెవరి కొచ్చింది? ఈ ఎంగిలికూడు కెందుకు కక్కుర్తి?"

రామారావు కళ్ళలోకి చూస్తూ నోటు జేబులో తొందరగా పెట్టుకొని గట్టిగా జేబు నొక్కి పట్టుకున్నాడు శివయ్య.

"శివయ్యా! ఇది లంచం సొమ్ము. కష్టార్జితం కాదు. పిల్లలు కలవాడిని. ఇటువంటిదాన్ని గ్రహించడంకన్న పాపమేముంది?"

శివయ్య పెదవులమీద కాంతిలేని చిరునవ్వొకటి కదిలింది.

"అవును రామం! పిల్లలు కలవాడిని కాబట్టే ఈ పని..." అన్నాడు శివయ్య.

"ఈ మాట అనడానికి సిగ్గు వెయ్యడం లేదా! ఇంతకన్నా పెళ్ళాం, పిల్లలతో ముష్టెత్తుకోడం మంచిది. లేకపోతే పస్తులుండడం మేలు."

"అవును. ఒంటరిగాడివి. నీకేం తెలుసు ఈ సంసారం పోషించడం!"

"ఒక్కమాట శివయ్యా! ఈ డబ్బు న్యాయంగా ఆర్జించినదేనా?"

"ఇది వెంకటనారాయణగారు సంతోషంగా ఇచ్చినది."

"ఎవరికి?...ప్రభుత్వానికా?"

"కాదు! పని పూర్తి చేయించిన వారికి".

"చూడు శివయ్యా! ఈ పనికిమాలిన మాటలు కట్టిపెట్టు. నోటు ఇలా తే!"

"బాబ్బాబూ! ఈ ఒక్కసారికి ఊరుకో! ఇకమీద పుచ్చుకోనులే... కావలిస్తే ప్రమాణం చేస్తాను."

"ఎన్నిసార్లు చేయలేదు. వాటిమీద నాకు నమ్మకం పోయింది. నోటు ఇచ్చి, దానిని వెంటనే ఆ వెంకటనారాయణ గారికి పంపి క్షమాపణలు వేడుకుంటాను."

"వద్దు! అటువంటి పని చెయ్యొద్దు!"

రామారావు కోపం పట్టలేకపోయాడు. బలంగా శివయ్యచేతిని లాగి జేబులో నున్న నోటును తీసాడు. పెనుగులాటలో జేబు చిరిగిపోయింది.

శివయ్య నిస్సహాయంగా రామారావు కళ్ళలోకి చూశాడు. పోరాటంలో ఓడిపోయాడు.

"ఉన్న ఈ ఒక్క చొక్కా కొడు

క్కోడానికి వీలులేకుండా చిరిగిపోయింది తమ్ముడూ! ఆదివారంనాడు ఉతుక్కొని వారం అంతా వాడుతున్నాను."

రామారావు ముఖం వివర్ణమయింది. చొక్కా జేబుదగ్గర చిరిగిపోయింది. తొందరపాటుకు పెదవి కరుచుకున్నాడు.

"వెంకటనారాయణగారు ఏ పదో ఇస్తారని నీ కాళ్లు పట్టుకొని ఈ పని చేశాను. మంచో ...పాడో... పది రూపాయల దగ్గిర వంద రూపాయలు వస్తే అదృష్టం పండిందని పగటి కలలు కన్నాను. పెళ్ళానికో, పిల్లలకో... పాపం బొత్తిగా వాళ్ళు చింకివాటితోనే కాలం గడుపుతున్నారు ... బట్టలేనా కొందామనుకున్నాను."

రామారావు చేతిలో నున్న నోటు మడతలు విప్పి సరిచేస్తూ చూపులు దించుకున్నాడు.

"బట్టల మాటకేం...నాలుగు రోజులయి రాత్రిపూట పస్తులుంటున్నారు పిల్లలు—జీతాలు వచ్చేవరకేనా రెండు పూటలా తిండి దొరుకుతుందని సంతోషించాను."

రామారావు ఆ మాటలు వినలేక పోతున్నట్లు చెవులు మూసుకున్నాడు. హృదయంలోంచి బాధగా బయటపడుతున్న పలుకుల కోతకు తట్టుకోలేనట్లు కంపిస్తున్నాడు.

"తమ్ముడూ! నిన్ను నిందించడం వల్ల ప్రయోజనమేముంది?... లేనిపోని ఆశలలో శుష్కించిన వాళ్ళ కళ్ళలో ఏముంటాయి?... పెళ్ళాం పిల్లలని ముంచి తిరిగి వాళ్ళను నిరాశకు పాలు చెయ్యాలి..."

రామారావు కళ్ళలో నీళ్లు తిరిగాయి.

"వాళ్ళకు తెలుసు...నా మాటలలో నిజం లేదని..."శివయ్య పెదవులమీద జీవంలేని చిరునవ్వొకటి దొర్లింది.

రామారావు కళ్ళు తుడుచుకున్నాడు.

"బ్రదర్! ... క్షమించు... ఏదో ఉద్రేకంలో..."

"లేదు తమ్ముడూ!...నువ్వు బాధ పడకు...నీవంటివాళ్ళు దేశానికి కావాలి."

"శివయ్యా!"

రామారావు ముఖంలో కొత్త వెలుగు తోచింది.

"శివయ్యా!"...రామారావు జేబులో నున్న పర్సు తీశాడు. "నిన్ననే బాంకు నుండి డబ్బుతీశాను ఏదో కొందామనుకున్నాను. తరువాత ఆలోచించవచ్చు దాని గురించి. ప్రస్తుతానికి ఈ డబ్బు వాడుకో" — పదిరూపాయల నోట్లు అయిదు తీసి శివయ్య చేతిలో ఉంచాడు.

"వద్దు తమ్ముడూ! అప్పు తీర్చే తాహతుకూడా నాకు లేదు "

"లేదు, లేదు! తీసుకో!" రామారావు ఆ నోట్లు తీసి చినిగిపోయిన శివయ్య

జేబులో పెట్టాడు. అవి జారిపడిపోతుంటే ఒక కవరులో పెట్టి యిచ్చాడు.

శివయ్య జవాబు చెప్పలేదు. ఆ కవరు రెండు మూడుసార్లు వళ్ళ కద్దుకొని జాగ్రత్తగా డ్రాయరు వెనుక భాగంలో ఉంచాడు.

రామారావు తన సీటులోకి వెళ్ళి కూర్చున్నాడు. కిటికీలోంచి చూచాడు_ శైలజ గొడుగు ముడిచి అఫీసు మెట్లె క్కుతున్నది. ఆమెను చూచి పెదవి విరిచి అతను నవ్వుకొన్నాడు.

"చాల వేగం వచ్చావే!" శైలజ రామారావును చూచి పలకరించింది. పక్కనున్న కుర్చీ చూపించాడు.

శైలజ కుర్చీలో కూచుని వానిటీ బాగ్‌లోంచి రుమాలు తీసి ముఖం మీది చెమటను ఒత్తుకుంది. లవండరు వాసనలు అందులోంచి బయలుదేరి రామారావువేపు ప్రయాణం చేశాయి.

"రేపు సెలవుపెడుతున్నాను, పని పూర్తి చేయాలని ముందుగా వచ్చాను. దొరగారు కూడా వస్తానన్నారు. మళ్లా చెప్పడం మరచిపోతానేమో!... రేపు సాయంకాలం పార్టీకి తప్పక రాక తప్పదు సుమా! ... వేయి కళ్ళతో నీకోసం..." శైలజ కళ్ళలో చెప్పలేని అనుభూతి...

ఇంతలో బంట్రోతు పైళ్లదస్త్రం ఒకటి తెచ్చి మేనేజరుగారి టేబిలు మీద పెట్టాడు.

"వస్తా... ఈ పెద్దమనిషి వస్తే వేళాకోళం చేస్తాడు, శైలజ లేచి నిలబడి రామారావుకో చిరునవ్వు అందించి వెళ్ళిపోయింది.

రామారావు ఆమెతో ఏమీ మాట్లాడ లేదుఏదో ఆలోచిస్తున్నాడు.

మేనేజరు లోపలికి వచ్చాడు.

పోలీసువాను ఒకటివచ్చి బయట నిలుచుంది. తొందరగా జవానులు దిగి సర్దుకున్నారు నలువేపులా పేము బెత్తం తిప్పుకుంటూ ఇనస్పెక్టరు గారు లోపలికి వచ్చారు.

మేనేజరు లేచి నమస్కారం చేశాడు ఇనస్పెక్టరుగారికి.

"సెర్చ్‌వారంటు, పంతులుగారూ!" అన్నారు ఇనస్పెక్టరుగారు నాలుగు వేపులకు చూస్తూ.

"ఏమయింది సార్?" మేనేజరు ప్రశ్నించాడు

"ఎవరో శివయ్యట?"

అందరి దృష్టులు శివయ్య మీదికి పోయాయి. మనిషి గాభరాపడు తున్నాడు.

"అతను మా డిస్పాచ్ క్లర్క్ సార్!"

మీ లైసెన్సు క్లార్కుకి కొద్దికాలం కిందటే మా మనిషి డబ్బిచ్చి పోయాడు."

"దేనిగురించి సార్?"

" అతను వెంకటనారాయణగారి తుపాకీ లైసెన్సు రెండురోజులలో ఇచ్చాడు. అందుకు బహుమతి వంద రూపాయలు."

"హూ లైసెన్సు క్లార్కు వేమిసాన్!"

రామారావు సీటులోంచి లేచాడు. శివయ్య ముఖంలోకి చూచాడు. శుష్కించిన అతని ముఖంలో ఒక నెత్తురుచుక్క కూడా లేకుండా ఇగిరి పోయింది శరీరం చెమటపట్టి అతను భూమికి కుంగుతున్నట్లు కనిపించాడు. పరిస్థితి విషమించింది. దారులన్నీ మూసుకున్నాయి.

మేనేజరు టేబిలు దగ్గరికి రామారావు నడిచాడు.

"నమస్కారం నాయుడుగారూ !"

ఆయన రామారావు పెట్టిన నమస్కారం అందుకున్నాడు.

"నేను లైసెన్సుక్లార్కు రామారావుని. బహుశా నాగురించి వెతుకు తున్నట్లుంది."

"మీ పేరు శివయ్యా కాదే?"

"ఆ శివయ్యా కేమీ తెలీదు. నేను లేనప్పుడు ఎవరో నా కిమ్మన్నారని ఈ పందరూపాయల కాగితం ఇచ్చాడు."

"గుడ్!..."

"మీరు బహుమతిగా పంపిన వంద రూపాయలు అందుకొన్నాను. ఈ నోటు నంబరు, ఈ చివరను పెట్టిన సంతకం సరిపోయాయో లేదో చూచు కొండి!" రామారావు పర్సులోంచి నూరు రూపాయలనోటు అందరూ చూస్తూండగా బయటికి . తీసి ఇనస్పె క్టరుగారిముందు పెట్టాడు,

ఇనస్పెక్టరుగారు డైరీతీసి నోటు నంబరు మరోసారి సరిపెట్టుకున్నారు. నోటు అంచున తన సంతకం కూడా సరిపోయింది,

"మేనేజరుగారూ? మీ లైసెన్సు క్లార్క్ రామారావుని అరెస్టుచేస్తున్నాము."

"ఆఫీసుకి కలెక్టరుగారు వచ్చినట్లున్నారు. వారి అనుమతి ముందు తీసుకుని ఈ పని చేస్తే మంచిదేమో!" అన్నాడు మేనేజరు.

"అవును, ఈ రామారావుని ఆయనకు చూపించాలి."

సాదా దుస్తులలో ఉన్న జవాను జేబులోంచి బేడీలు తీశాడు,

"నాయుడుగారూ! వానులో కూర్చో బెట్టిన తరువాత బేడీలు వేస్తేనో...మా అందరికీ కష్టంగా ఉంటుంది" అన్నాడు మేనేజరు.

"పంతులుగారూ! నలుగురికీ తెలియాలి! ఈ గౌరవం అందరికీ లభించదు కదా!"

రామారావు చేతులు చాచాడు. బేడీలు వేసిన తరువాత అతనిని కలెక్టరు గారి దగ్గిరకు తీసుకెళ్ళారు.

మేనేజరు ఫైళ్ళు పక్కకుపెట్టి నిల బడ్డాడు.

అప్పుడే ఆఫీసులోకి వచ్చిన విశ్వనాథం హాజరీ సంతకం పెట్టి నలుగురి వేపు చూశాడు.

"మేనేజరుగారూ! ఇప్పటికైనా తెలిసిందా! ఎవరెటువంటివాళ్లో! అందరూ కబుర్లు చెప్పేవాళ్లే-రెడ్ హాండెడ్‌గా దొరికినవాళ్ళకు కనీసం మూడేళ్ళు ముచ్చటైన ఖైదు. తరువాత...జన్మలో మరి గవర్నమెంటు ఉద్యోగం దొరకదు" అన్నాడు విశ్వనాథం కసినంతా వెళ్ళబోస్తూ.

శివయ్య శరీరం కంపిస్తున్నది. ఎంత ఘోరం! ఎంత ఘోరం ...ఆతని కళ్ల ఎదుట బిచ్చమెత్తుకుంటున్న పెళ్ళాం పిల్లల బొమ్మలు కనిపిస్తున్నాయి.

"ఈ దెబ్బ నీకు తగలవలసింది!" అన్నాడు మేనేజరు.

శివయ్య తుళ్ళిపడ్డాడు. విశ్వనాథాన్ని ఉద్దేశించి అన్నమాటలకు.

"అదృష్టవంతుడివి. కొత్తగా నీ సీటుకొచ్చిన వాడికి నీ పాపం చుట్టుకొంది".

విశ్వనాథం నవ్వుతున్నాడు.

శివయ్య గుండెలమీద చెయి వేసుకున్నాడు. వేగంగా కొట్టుకుంటున్న గుండె దారిపడుతున్నది.

మేనేజరు కలెక్టరుగారి గదివేపు నడిచాడు.

"ఆదర్శాలు వల్లించే మనుషుల నిజస్వరూపాలు చూద్దాం రండి!" అందరినీ పిలిచాడు విశ్వనాథం.

మేనేజరు వెనుక విశ్వనాథం, శివయ్య ఇంకా మరిద్దరు గుమాస్తాలు కలెక్టరుగారి గదివేపు నడిచారు.

ఆ సరికే రామారావును లోపలికి తీసికెళ్ళారు. డిక్టేషను ఆపి శైలజ బయటికి వచ్చింది.

"రేపు బర్తుడే పార్టీకి, వచ్చేనెల వివాహమంగళానికి రామారావుని వదిలిపెట్టమను" అన్నాడు విశ్వనాథం స్టెనో శైలజ ముఖంమీద.

శైలజముఖం కోపంతో ఎర్రబడింది.

"ప్రియురాలి పుట్టినరోజు కానుకకై పుచ్చుకున్నట్లుంది పాపం!" అన్నాడు విశ్వనాథం మళ్ళా ఆమెనే అల్లరి పెడుతూ.

"షటప్!" తన్నిసంతచేసి శైలజ తన గదిలోపలికి వెళ్ళిపోయింది.

కొద్దిసేపటిలో రామారావుని తీసుకొని ఇనస్పెక్టరుగారు బయటికి వచ్చారు. రామారావుముఖం చాల ప్రశాంతంగా ఉంది. ఉదాసీనత ఏ కోశాన్ని కనిపించలేదు. కాని అందరి ముఖాలలో విచారం వ్యక్తమవుతున్నది.

వానులోకి ఎక్కుతున్న రామారావు అందరికీ కనబడ్డాడు.

ధారలుగా కారుతున్న శివయ్య కతను కనపడలేదు. మరెవరో కనిపించారు.

శివయ్య తన వయసు సంగతి మరచిపోయి రెండు చేతులు ఎత్తి నమస్కరించాడు తన వేలుపుకి.

---




ట్రైన్ కదిలించి. పెట్టే, బెడ్డింగ్ అన్నీ జాగ్రత్తగా సర్దుకుని సీట్లో కూర్చున్నాను.

చీకటి పడుతూండటంతో లైట్లు వెలిగాయి.

సిగరెట్ వెలిగించి పక్కన ఉన్న వ్యక్తి వంక చూశాను.

నలభై అయిదేళ్ళుంటాయతనికి. తెల్లని లాల్చీ తొడుక్కున్నాడు.

"మీ పేరు తెలుసుకోవచ్చా!" పరిచయం చేసుకోవటానికి అడిగాను.

"గోపాలం. మీ పేరు?" అడిగాడతను.

"రఘువల్లభ" అన్నాను నెమ్మదిగా.

అతను రెండుక్షణాలు నావంక తదేకంగా చూస్తూ—

"రఘువల్లభ అంటే... ప్రఖ్యాత రతయితలా మీరు?" అడిగాడు.

"అదేం అలా ప్రశ్నించారు ?" నవ్వుతూ అడిగాను.

"ఏం లేదు. అతని రచనలు చాలా చదివాను అందుకని" అన్నాడు.

"నేనే అతనిని" అన్నాను కాస్సేపయ్యాక.

ఎందుకో అతని వదనంలో నా ప్రతిభకు మించిన ప్రశంస కనిపించింది. నేను చటుక్కున తలవంచుకుని ఆ తరువాత కిటికీలోనుండి బయటకు చూడటం మొదలు పెట్టాను.

నన్ను రచయితగా ఎదుటిమనిషి గుర్తించటం నాకంతగా ఇష్టంలేదు. నా చుట్టూ ఉన్న జనంలో నా మీద అభిమానమున్నవారూ ఉండచ్చు. ఇష్టపడని వారూ ఉండచ్చు. ఎందుకో ఎవ్వరితోనైనా సాధారణవ్యక్తిగా మాట్లాడితేనే ఏదో తృప్తి ఉంటుంది. రచయితగా వారు గౌరవిస్తూ మాట్లాడితే ఏదో అడ్డుతెర నన్ను పరిపూర్ణంగా మాట్లాడనీయదు. అందుకే మాటలు మార్చేశాను.

"హైద్రాబాద్‌లో ఎవరుంటారు ?"

"హైద్రాబాద్‌కి కాదు. అక్కడ నుంచి సంగారెడ్డి బస్ ఎక్కాలి. అక్కడ మా అమ్మాయి ఉంది. హరిజనవాడలో దాని మొగుడు మంచివాడు కాదు. వదిలేస్తానంటున్నాడట. ఇద్దరికీ రాజీ కుదుర్దామని వెళుతున్నాను" అన్నాడతను.

ఎందుకో వివరాలు కనుక్కోవాలని పించినా అడగలేకపోయాను. ఎప్పుడు ప్రయాణం చేస్తున్నా ఇలా చుట్టు పక్కల వారితో మాట్లాడుతూంటాను. అలా మాట్లాడటం వలన కథలకి మంచి వస్తువు దొరుకుతుంది, వాస్తవికమైన రచన ఉద్భవిస్తుంది.

పరిశీలన అనేది పట్టే కలం ప్రతివాడి లక్షణం. పాత్రలను నడపటానికి ముందు స్వభావాలు పరిశీలించటం ఎంతైనా అవసరం. అందుకే ఇలా ప్రతి ఒక్కడితో స్నేహం చేస్తాను. పాత్రలు ఏవైనా నచ్చితే డైరీలో ఎక్కించేస్తూంటాను. ఆ తరువాత పత్రికలలోనూ ఎక్కుతాయి.

"ఏమిటోనండీ ! ఇలా ఉంటున్నవి కొంతమంది భార్యాభర్తల బతుకులు. అనవసరమైన పట్టుదలలకి పోయి జీవితాన్ని పాడుచేసుకుంటున్నారు" అన్నాడు.

అతను చెప్పిందంతా వింటున్నాను.

"మీరెక్కడికి వెళతారు హైద్రాబాద్‌లో?" అడిగాడతను.

"చంద్రకాంత్ అని నా ఫ్రెండ్ ఒకడు హైద్రాబాద్‌లో ఉంటున్నాడు. అతన్ని కలవటానికి" అన్నాను.

ఆ తరువాత మా ఇద్దరి మధ్యా ఎక్కువ సంభాషణలు జరగలేదు.

నా ఆలోచనలిప్పుడు చంద్రం చుట్టూ తిరుగుతున్నాయి.

టెలిగ్రాం అందిందో లేదో ! వాడిని




చెప్పు. ఆమె చేసిన తప్పేమిటి ?" అన్నాను.

ఓ సారి నిటారుగా, నిశబ్దంగా, చలనం లేకుండా కూర్చున్నాడు. ఆ తరువాత –

"రఘూ ! గులాబీ పువ్వును చూడగానే ఆకర్షింపబడ్డాను. కానీ బాగా దగ్గరికెళ్ళాక వెనక దాగిన ముళ్ళు హృదయంలో గుచ్చుకున్నాయి."

"అసలు ఏం జరిగింది చంద్రం ?" ఆదుర్దాగా అన్నాను.

తడారిపోతున్న గొంతుని, అతి కష్టంమీద పెగుల్చుకుని– "చెబుతాను రఘూ ! కానీ ఇందులో తప్పు ఎవరిదో నువ్వే చెప్పాలి" అన్నాడు.

"సరే కానీ'' అన్నాను.

వాడు చెప్పటం మొదలుపెట్టాడు. చెబుతూనే ఉన్నాడు. అది కథ కాదు. నిజమైన జీవితం. రెండు పాత్రల నడుమ నడచిన సంఘటనలు. అయితే ఇందులో తప్పు ఎవరిదో చెప్పాలి– అందుకే చెవులు రిక్కించి విన్నాను. చెప్పటం పూర్తిచేసి– "ఇప్పుడు చెప్పు రఘూ ! నేను చేసినది తప్పా ! రచయితగా నువ్వు జీవితాన్ని ఎన్నో కోణాలనుంచి చూశావు. నా పరిస్థితిని నువ్వు అర్ధంచేసుకోగలవు కదూ !" అన్నాడు.

మౌనంగా ఉండిపోయాను కాసేపటి దాకా. తరువాత–

"ఇప్పుడే తప్పు ఎవరిదో నిర్ణయించలేను చంద్రం ! ఒక వ్యక్తే అందరి వ్యక్తుల తరపునుండీ చెబితే సరియైన తీర్పు చెప్పటం కష్టం. సంపూర్ణని కలి

కాక. ఆమెనుండి విషయం రాబట్టాక కానీ ఏమీ చెప్పలేను.

"నా మీద నమ్మకం లేదన్నమాట" అన్నాను.

"అదికాదు. సంపూర్ణ అభిప్రాయాలు కూడా తెలుసుకోవాలి. సంపూర్ణ అడ్రెస్ ఉంటే ఇవ్వు. వెళ్ళేటప్పుడు ఆమెని కలుస్తాను" అన్నాను.

చంద్రం డ్రాయర్ తెరిచి అడ్రెస్ వ్రాసిచ్చాడు పేపరుపైన.

అడ్రెస్ తీసి సూట్ కేస్‌లో పెట్టాను.

ఆ రాత్రి చంద్రం నిద్రపోయాక లేచి లైటు వేశాను. డైరీ తెరిచి వ్రాయటం మొదలుపెట్టాను. చంద్రం చెప్పిన ప్రతి విషయం డైరీలో వ్రాసుకున్నాను.

ఈ కిందిది చంద్రం కథ.

చంద్రం : అమ్మపోయాక నిలువ నీడలేని నాకు ఎంతో ఆదరంతో చేయూతనిచ్చారు మామయ్య. అప్పుడే నా జీవితంలో నూతన అధ్యాయం ప్రారంభమయింది. సంపూర్ణతో అదే నా తొలి పరిచయం. రాకపోకలు లేక పోవటం మూలాన అంతవరకూ నేను సంపూర్ణను చూడనేలేదు.

"హలో బావా !" పంజాబీ డ్రెస్‌లో, అప్పుడే వికసించిన రోజాలా ఉంది సంపూర్ణ.

'అందం' చాలా విచిత్రమైనది. కొంతమంది ఎన్నో అలంకరణలు చేసినా అందంగా కనిపించరు కానీ కొంతమందిలో విచిత్రమైన శక్తి ఉంటుంది. అది వాళ్ళ నవ్వులోనూ, మాటల్లోనూ, అణువణువునా కనిపిస్తూ ఎదుటి మనిషిని తమ వైపుకు లాక్కుం టుంది. అలాంటి శక్తి ఉన్నవారు అంద మైనవారు. అలాగే సంపూర్ణ నన్ను మొదటిచూపులోనే ఆకర్షించింది. 'బావా' అన్న ఆ తీయని పిలుపుకి కాస్త మనసు చలించి ఏదో అనిర్వచనీయమైన అను భూతి కలిగింది.

"నువ్వు వస్తావని నాన్నగారు చెప్పారు. అప్పటినుంచీ నిన్ను చూడా లని ఎదురుచూస్తూ ఉన్నాను" అంది.

మొదటి పరిచయంతోనే ఏకవచన ప్రయోగం చేస్తున్న ఆమెని చూస్తే నాకు ఆశ్చర్యం కలిగింది.

సంపూర్ణ కాసేపు మాట్లాడి కాఫీ తేవటానికి వెళ్ళింది.

"ఎదిగీ ఎదగని మనస్తత్వానికి ప్రతిరూపం సంపూర్ణ ! అమయాకురా లైన ఈ పిల్ల లోకంలో నేడు జరిగే అన్యాయాలకు బలై పోదుకదా అని ఎప్పుడూ అనుకుంటూంటాను. దాని గురించే నా బెంగంతా !" అన్నారాయన నిట్టూరుస్తూ.

సంపూర్ణని ఇంకోసారి చూద్దామని ముందుకు ఆసక్తిగా వంగిన నాకు నిరు త్సాహమే ఎదురైంది.



పనిమనిషి తెచ్చిన కాఫీని అందుకున్నాను.

ఇంతలో సన్నగా పాట వినిపిస్తోంది. రికార్డ్ ప్లేయర్ లోనుంచి "భామనే, సత్యభామనే!" అంటూ ఎవరిదో గొంతు పాడుతోంది. తదనుగుణంగా నాట్యంచేస్తున్న చప్పుడు, గజ్జెల సవ్వడులు.

"సంపూర్ణ డాన్స్ చేస్తుందా మామయ్యా?" అడిగాను.

"దాని మనసెప్పుడూ డాన్స్ పైనే. చాలా ప్రోగ్రాంలు ఇచ్చింది," అన్నారు.

మౌనంగా వింటూ కూర్చున్నాను. ఆ తరువాత ఓ గంటకి స్నానం ముగించి పైకి వెళ్ళాను.

ఇంకా డాన్స్ ప్రాక్టీస్ చేస్తోందామె.

"కూర్చో బావా!" అంది.

స్వేద బిందువులు ముఖంమీద మెరుస్తున్నాయి. ఆసలే తేత శరీరమేమో ఎరుపెక్కింది.

"ఎల్లుండి కాలేజీలో డాన్స్ ప్రోగ్రాం ఉంది— ఎలా చేస్తున్నానో నువ్వే చెప్పాలి" అంది.

"చెయ్యి మరి" అన్నాను.

ఆమె చెయ్యటం మొదలుపెట్టింది.

ఆమె ఒక్క కాలిలోనే కాదు, ముఖంలో కూడా భావాలు స్పష్టంగా కనిపిస్తున్నాయి.

"చాలా బాగా చేస్తున్నావు సంపూర్ణా !" మెచ్చుకోలుగా అన్నాను.

ఆమె నవ్వింది మిన్నుల పున్నమి వెన్నెలలా. ఆ తరువాత నా పక్కనే కూర్చుంది.

"నీకు డాన్స్ అంటే చాలా ఇష్టంట కదూ !" అన్నాను ఏం మాట్లాడాలో తోచక.

"అవును. కానీ ఈ రోజుల్లో దానికి సరియైన ప్రోత్సాహం ఇచ్చేవారే కన బడటంలేదు. ఆడపిల్ల ఓ వయసొచ్చాక స్టేజీ ఎక్కటమే,తప్పుగా భావిస్తున్నారు. కళారాధనకి వయసుతో సంబంధం లేద న్నది నా ఉద్దేశ్యం" అన్నది.

తనయొక్క మనోభావాలు సంశయం లేకుండా పైకి చెబుతున్న ఆమె స్వభా వాన్ని మనసులోనే అభినందించాను.

మొదటిరోజుతోనే సంపూర్ణ గురించి చాలా తెలుసుకున్నాను.

చనువుగా, చెలిమిగా చూసే ఆ చూపులు, నెమలి పురివిప్పుతూన్నట్లున్న దట్టమైన ఆ కనురెప్పలు... ఆమెలోని చాలా అందాలకు నా మనసు ఏదో తీయని బాధతో మూలిగింది.

"మా కాలేజీ డేకి నువ్వు తప్పకుండా రావాలి" అంది.

"తప్పకుండా" అన్నాను వెంటనే ఒప్పేసుకుంటూ.

కాలేజీ డే వచ్చింది. సంపూర్ణ నాలుగు గంటలకే వెళ్ళిపోయింది. రావు గారు ఏదో పని ఉందని చెప్పి రాలేదు. చివరికి డ్రైవర్‌ని వెంటతీసుకుని ఒంటరి గానే వెళ్ళాను.

స్టేజీమీద మరీ అందంగా, అచ్చం సత్యభామలా కనిపించింది సంపూర్ణ.

డాన్స్ ప్రోగ్రాం అయ్యాక సంపూర్ణ కోసం ఎదురుచూస్తూ నిలబడ్డాను

దూరంగా ఎంతోమంది మగవాళ్ళ తోనూ, ఆడపిల్లలతోనూ మాట్లాడుతూ కనిపించింది సంపూర్ణ.

డ్రైవర్ ముందుసీట్లో కూర్చున్నాడు. నేనూ, సంపూర్ణా వెనకసీట్లో కూర్చు న్నాము.

"నాన్నగారు కూడా ఉంటే బాగుం డేది !" ఎందుకో ఆమె గొంతు జీరవోయింది.

"అవును. రమ్మన్నా రాలేదు. ఏదో అర్జెంట్ పనుందట."

సంపూర్ణ కళ్ళల్లో నీరు తిరగటం గమనించాను.

"ఆయనకు నేను డాన్స్ చెయ్యటం ఇష్టంలేదు," అంది కాసేపయ్యాక.

"అంటే ?"

''తన కూతురు డాన్సర్ అంటే ఆయనకు నామోషీ" అనేసింది.

నేనేమీ బదులు చెప్పలేదు.

ఇంటిముందు కారు ఆగేదాకా ఎవరి ఆలోచనలలో వారు గడిపాము.

సంపూర్ణ ముభావంగా లోపలికి నడిచింది.

రావుగారు ముందు వరండాలో కూర్చుని ఏదో పుస్తకం చదువుతున్నారు. అడుగుల చప్పుడుకి తలెత్తిన ఆయన చూపులు తీక్షణంగా సంపూర్ణను చూశాయి.

"ముందు లోపలికెళ్ళి ముఖం కడుక్కో"-ఆయన గొంతులో నిరసన.

సంపూర్ణ గబుక్కున లోపలికి నడిచింది.

"ఇది చంద్రం, ఈ పిల్ల వరస. అంతమంది ముందు డాన్స్ చెయ్యక పోతేనేం," అన్నారాయన.

నేను ఆయన మనసులో బాధను అర్థంచేసుకోగలను. అయితే సంపూర్ణ ఈ కాలపు పిల్ల. తండ్రిలో దృఢత్వం ఎక్కువగా లేకపోవటంచేత ఆడింది ఆట, పాడింది పాట అవుతోంది.

ఆ మరునాడే సాయంత్రం 'క్లబ్‌కి వెళుతున్నాను' అంటూ బయలుదేరింది సంపూర్ణ.

ఆమె 'లయన్స్' క్లబ్‌లో మెంబరట. త్వరలో సెక్రెటరీ కాబోతున్నదట.

"నువ్వూ మెంబర్‌వి కాకూడదూ!" అందామె.

"నాకు అలవాటులేదు. ఇప్పుడు అలవాటు చేసుకోలేను" అన్నాను.

ఆమె సూటిగా నావైపు చూసింది.

ఇంతలో బయట కారు హారన్ వినిపించింది.

"నే వెళుతున్నాను" చెప్పులు టకటకలాడిస్తూ కదిలి వెళ్ళింది సంపూర్ణ.

ఎవరో, సంపూర్ణ బాయ్ ఫ్రెండ్ అనుకుంటాను, నవ్వుతూ డోర్ తెరిచాడు. సంపూర్ణ ఎక్కింది. కారు కదిలింది. రెప్ప వేయటం మరచిపోయి ఆ దృశ్యంవైపు చూస్తూండిపోయాను. తుఫాను రేగినట్లు మనసు అల్లకల్లోలమైపోయింది.

''చంద్రం !"

మామయ్య గొంతు వినిపించేసరికి తడబాటును అణుచుకుని తలెత్తాను.

''చంద్రం ! నేనొకటి అడుగుతాను. ఏమీ అనుకోవుగా !"

''అడగండి." నిదానంగా అన్నాను.

''సంపూర్ణని నువ్వే చేసుకోవాలి. దానికి అయిన సంబంధమే అన్ని విధాలా యోగ్యమైనదనిపిస్తోంది. ఇంకొకళ్లు దాని ప్రవర్తన నచ్చక దానికి అన్యాయం చెయ్యొచ్చు. నువ్వు సంపూర్ణని చేసుకుంటే నాకు నిశ్చింతగా ఉంటుంది.''

అనుకోని ఆ మాటలకి ఆశ్చర్య పోయాను.

"ఉద్యోగం లేనిది పెళ్ళి ఏమిటి మామయ్యా?" అన్నాను.

"నీకు ఉద్యోగం వచ్చాకే చేసుకో!" అన్నారాయన.

'ఈయన ఎంత నిండైన మనిషి. ఇల్లు అశాంతినిలయంలా ఉన్నా, ఒక్కగానొక్క కూతురు కళ్ళముందే పాడైపోతున్నా, ఎండకీ వానకీ తల ఒగ్గని వృక్షంలా ఎంత గంభీరంగా ఉంటారు, అనుకున్నాను.

ఆయన అన్న మాటలకి సరియైన సమాధానమివ్వలేదు. పెళ్ళి గురించి ఆయన ఎత్తేవరకూ సంపూర్ణ అంటే ఎలాంటి అభిప్రాయమూ కలగలేదు కానీ... ఇప్పుడు... దీర్ఘంగా ఆలోచించటం మొదలుపెట్టాను. రావుగారు అటుగా వెళ్ళిపోయారు. జీవితంలో అన్నింటికంటే ముఖ్యమైన ఘట్టం పెళ్ళి. దాని విషయంలో ఏమాత్రం తప్పు నిర్ణయం చేసుకున్నా జీవితమంతా నరకాన్ని అనుభవించాల్సి ఉంటుంది.

ఒక్కసారిగా కంటిముందు సంపూర్ణ మెదిలింది. అయస్కాంతంలాగా ఆకర్షించే ఆమె అందం, పాలభాగంలోని మెరుపుతనం అంతా కనిపించింది. ఎందుకో పసిపిల్లలోని పసిత్వం గుర్తొచ్చింది. ఇంకోవైపు ఆధునికంగా కటలాడే నేటి వనితలకు ప్రతిరూపంగా ఉన్న సంపూర్ణ రూపు నిలిచింది. మనసు వికలమైంది. ఈ రెంటింటి గురించీ చాలాసేపు ఆలోచిస్తూ కూర్చున్నాను. ఈ ఆలోచనలతో సంపూర్ణ మీద వాంఛ పెరిగింది. ఆమెలో ఎన్నో ఆకర్షణలు కనిపించాయి.

"ఎలాగైనా సరే! సంపూర్ణని మార్చాలి! పెళ్ళైతే మారుతుందేమో! వయసు పొంగులా పొంగుకొస్తూంటే మనసు మధురమైన క్షణాలకోసం పరితపిస్తుంది. అందుకే సంపూర్ణలోని ఈ చలాకీతనం" అనుకున్నాను.

చాలాసేపయ్యాక నిర్ణయానికి వచ్చాను. 'అదే! నా మనసులో ఆరాధిస్తున్న సంపూరను నా జీవితంలోకి ఆహ్వానించాలి. ఆమె మనసును అర్థం చేసుకుని ఆమెని మార్చి నా దారికి మళ్ళించాలి.'

'శరీర వ్యాయామంతో శరీరాన్ని కాపాడుకున్నట్లే, మానసిక శిక్షణతో మనసును మార్చవచ్చు.'

రాత్రి పదిగంటలకి వచ్చింది సంపూర్ణ. ఆమెని దింపటానికి వచ్చిన వ్యక్తిమీద రెండుక్షణాలు చూపు నిలిపాను. అదేం పట్టనట్లు సంపూర్ణ ఒక్కర్తే మౌనంగా లోపలికి వచ్చింది. ఎంత ఆలోచించినా ఆమె ప్రవర్తన నాకు అర్థంకావటం లేదు.

"ఇందాక వచ్చినతను ఎవరు ?" అతి మామూలుగా అడిగాను.

"ఫ్రెండ్. అతనొక్కడే కాదు. అలాంటివారు చాలామంది ఉన్నారు నాకు'' అంది.

ఆ క్షణంలో సంపూర్ణ నాకు ఎంతో అమాయకురాలిలా కనిపించింది.

నాజూకుగా ఉండే సంపూర్ణను పదిలంగా గుండెల్లో దాచుకున్నాను. 'అందంగా ఉండే ఈమెకు ఆ భగవంతుడు లోకజ్ఞానం కూడా ఇచ్చి ఉంటే ఎంత బాగుండేది!' అనుకున్నాను

ఆ మరునాడే ఇంటర్వ్యూలో సెలెక్ట్ అయినట్లు ప్రైవేట్ కంపెనీనుండి వచ్చింది క్లర్క్ పోస్ట్.

మామయ్య దగ్గరికి వెళ్ళి ఈ వార్త చెప్పాను.

"సంపూర్ణని చేసుకోవటానికి నాకె లాంటి అభ్యంతరమూ లేదు. ఆమెని ఒక దారికి తెచ్చి, నాకిష్టం వచ్చిన రీతిలో మలుచుకోగలనన్న నమ్మకం నాకుంది" అన్నాను.

"చంద్రం!" ఆనందంగా ఆయన నా చేతులు పట్టుకున్నారు. "కానీ ఓ విషయం, సంపూర్ణని కూడా కనుక్కొని ఆమె అభిప్రాయం చెప్పండి. మనసుకు నచ్చని జంట దొరికితే జీవితం నిస్సారవంతమౌతుంది" అన్నాను.

"అలాగే చంద్రం! సంపూర్ణ ఒప్పుకుంటుంది. నాకు తెలుసు" అన్నారాయన.

ఆ రోజు ఎంతో మధురమైనరోజులా అనిపించింది. ముందు జీవితమంతా నందనవనంలా తోచింది.

ఆ రోజు చల్లని వెన్నెల వింతగా తోచింది.

ఎక్కడ చూసినా అదే రూపం

'సంపూర్ణ, సంపూర్ణ, సంపూర్ణ

కానీ ఆ రోజంతా ఆమె నన్ను తప్పించుకు తిరిగింది.

ఆశగా ఆమెకోసం ఒళ్ళంతా కళ్ల చేసుకుని ఎదురుచూస్తున్న నాకు నిరాశే ఎదురైంది.

* * *

మరునాడు ఉదయం...

బాల్కనీలో నిల్చుని బయటకు చూస్తున్నాను. ఇంతలో నా వెనకగా పడిన నీడను చూసి వెనక్కి తిరిగాను.

ఎదురుగా సంపూర్ణ! ఆమె వదనం నిర్మలంగా ఉంది.

"నీతో మాట్లాడాలి" అంది.

"మాట్లాడు" అన్నాను కూర్చుంటూ.

ఆమె కూడా కుర్చీ లాక్కొని కూర్చుంది.

"నన్ను ఇష్టపడే చేసుకుంటున్నావా?"

"ఎందుకలా అడుగుతున్నావు?"

ఆమె మాటలలో ఏదో కొత్తదనం ఉంది.

"ఎందుకంటే నా స్వభావం నీకు తెలియనిది కాదు. ఆ తరువాత బాధపడీ లాభం ఉండదు. నేను ఎవరిని చేసుకున్నా నా వ్యక్తిగతమైన అలవాట్లని మార్చుకోలేను. డాన్స్ నా కిష్టమైనకళ. స్టేజీ ఎక్కి ఎన్నో పర్ఫార్మెన్స్‌లు ఇవ్వాలని ఉంది. నీ సహకారం ఆశించచ్చా!"

ఆమె కళ్లెత్తి నా వంక చూసింది.

ఆమె వ్యక్తిత్వం నాకు తెలియనిది కాదు. అందుకే– "నీ మీద నాకు నమ్మకముంది సంపూర్ణా! అయితే హద్దుమీరితే నా కిష్టంలేదు" అన్నాను

"హద్దు మీరేటంత బలహీనురాలను కాను. నలుగురితో ఫ్రెండ్‌గా ఉంటే నా గురించి చెడ్డగా ఎలా భావిస్తారు?" అంది.

"సంపూర్ణా! నీ స్వభావాన్ని నేను రోజూ చూస్తూనే ఉన్నాను. నేను త్వరగా అపార్థంమాత్రం చేసుకోను, సరా!" అంటూ ధైర్యం చెప్పాను.

ఇలా పెళ్ళికి ముందే ఒకళ్లతో ఒకళ్లం నిర్ణయాలకి వచ్చేశాము.

"ఇంతకీ నీకూ ఇష్టమేనా నన్ను చేసుకోవటం" అన్నాను. అంగీకారంగా తల ఊపిందామె.

నాలుగురోజుల్లో ముహూర్తాలు నిశ్చయించి సంపూర్ణని నా దాన్ని చేశారు. అయితే నాకు మొదటిక్షణం లోనే ఒకరకమైన నిరుత్సాహం ఎదురైంది. ఎక్కడ చూసినా క్లబ్‌మెంబర్స్ ఆడా, మగా కలిసి తిరుగుతున్నారు ఇష్టం వచ్చినట్లు. సంపూర్ణ నాకంటే ఎక్కువగా వాళ్ళతోనే మాట్లాడుతోంది. ఇది సహించలేని విషయం. అయినా నిగ్రహించుకున్నాను.

ఆ రోజు గదిలో నేనూ, సంపూర్ణా మాత్రమే మిగిలాము.

నా మనసు మధురంగా ఆమె అందాన్ని చూస్తోంది. అనుభవంకోసం వయసు వేచి ఉంది.

మాట్లాడకుండా కూర్చుంది సంపూర్ణ.

"నాతో మాట్లాడటానికి అదోలా అయిపోతున్నావెందుకు? పొద్దున వాళ్ళందరితో ఎంతో బాగా మాట్లాడావుగా!"

కాస్త కటువుగానే అన్నాను. ఎందుకన్నానా అని మరునిమిషంలో బాధపడ్డాను కూడా.

"పెళ్ళిచేసుకొన్న మొదటిరోజే బాగా అర్థంచేసుకున్నారు కదూ, నా స్వభావం" అంది.

"మరి ఎందుకు మాట్లాడటంలేదు?" అన్నాను.

"ఏం మాట్లాడాలో తెలియక" అంది.

కాసేపు నిశబ్దం ఆవరించింది.

"పొద్దున వచ్చినవారంతా ఎవరు?" అన్నాను.



"'ఫ్రెండ్స్.''

"క్లబ్ ఫ్రెండ్సా,'' మళ్ళీ అనుకో కుండానే హేళన ధ్వనించింది నా కంఠంలో.

"అవును" అంది.

నా మనసులో గాలిమమారం చెల రేగుతోంది.

''నువ్వు నిజంగా మనసుపడే నన్ను చేసుకున్నావా? "

అనుమానం తీరటానికి అడిగాను.

"ఎందుకలా అడుగుతున్నావు?" కాస్త నిదానంగా అడిగింది.

''ఊరికేనే'' అన్నాను.

''మొదట కాసేపు సంశయించాను క్లర్క్‌వి కదా అని. కానీ నాన్నగారు అయిన సంబంధం నాకు మంచిదన్నారు. ఒప్పుకున్నాను'' అంది.

ఆమెనుండి నేనాశించింది ఒకటైతే ఆమె జవాబు మరొకటి.

"అదేం అలా ఉన్నావు?'' అని ప్రశ్నించింది.

''ఏంలేదు, ఎలా ఉన్నాను?" అన్నాను.

నా ముఖంలోకి వేడిరక్తం ఉప్పెనలా పొంగింది.

"అసలు నామీద నీకెలాంటి అభిప్రాయం ఉంది?"

"మంచి అభిప్రాయం ఉందికాబట్టే ఎంతోమంది క్లబ్ ఫ్రెండ్స్ చేసుకుంటామన్నా చేసుకోలేదు" అన్నది.

"సంపూర్ణా!" ఆమెని హృదయానికి హత్తుకున్నాను. సంపూర్ణని గెలుచుకున్నానన్న తృప్తి నా అణువణువులో చిందులు వేస్తోంది.

జీవితంలో కొన్ని అతి విలువైన వస్తువులు మన కంటబడ్డాక దీన్ని నిర్లక్ష్యంచేస్తూ ఇన్నాళ్లూ ఎలా ఉన్నామా అన్న భావన కలుగుతోంది. సంపూర్ణ సన్నిధిలో నాకూ అలాంటి భావనే కలిగింది.

ఆమె నాకోసం పవిత్రంగా దాచిన కన్నెత్వాన్ని అతి సున్నితంగా దోచుకున్నాను.

తీయని అనుభవంతో తెల్లవారింది.

* * *

హాల్లో ఫోన్ మ్రోగింది.

మ్రోగుతూనే ఉంది. నాలుగయిదుసార్లు మ్రోగాక పక్కకి తిరిగి చూశాను. సంపూర్ణ నిద్రపోతోంది.

వెళ్ళి రిసీవర్ అందుకున్నాను.

అవతలి వైపునుండి మగకంఠం. అంత చల్లటివేళలోనూ ఒళ్ళంతా చెమట పట్టింది.

"సంపూర్ణ ఉందా!" ఆ కంఠం తిరిగి అంది.

''ఎవరు మాట్లాడుతున్నారు?"

"ప్రకాశ్, క్లబ్ ప్రెసిడెంట్."

"సారీ, నిద్రపోతోంది."

టక్కున ఫోన్ పెట్టేశాను. ఇలా ఫోన్ రావటం ఇది మొదటిసారి కాదు, నాలుగోసారి. నాదీ అనుకున్న సంపూర్ణ ఇంతమందితో ... ఛీ ఛీ... పవిత్రత లేదు అనుకున్నాను.

వెర్రి ఆవేశం వస్తోంది.

''ఎవరు ఫోన్‌చేశారు?" మగత నిద్రలోనుండి లేచి అడిగింది సంపూర్ణ.

"నీ ఫ్రెండట. పనిలేదూ వాళ్ళకి నీతో తిరగటంకంటే..." విసుగ్గా అన్నాను.

"వాళ్ళు ఇంట్లో కూర్చునే రకాలు కారు. సరదాగా ఎన్నో రంగాల్లో ప్రవేశిస్తారు."

"అందుకా నీలాంటివారు తోడుంటే మరీ ఉత్సాహంగా..."

"మాట్లాడే ఓపిక నాకు లేదు కానీ ఎవరు ఫోన్ చేశారు?"

"ప్రకాశ్‌ట."

"ప్రకాశా?" ఉత్సహంగా ఆమె లేస్తూంటే చిర్రెక్కేంత కోపం వచ్చింది.

సంపూర్ణకి ఎలా నచ్చచెప్పాలి? ఆమె ఆంతర్యం నాకు బొత్తిగా అవగాహన కావటంలేదు. మనసు వేగిపోతోంది.

"నువ్విప్పుడు వెళ్ళొద్దు సంపూర్ణా!" కాస్త నిదానంగా అన్నాను.

"వెళ్ళాలి, తప్పదు. ఇంకో వారం రోజులలో ప్రోగ్రాం ఉంది'' అంది.

"ఎవరిది?" నివ్వెరపోతూ అడిగాను.

"నాదే" అంది.

"మళ్ళీ డాన్సర్‌గా స్టేజీ ఎక్కుతావా?'' అన్నాను.

''ఆఁ తప్పేముంది! ఏదో స్కూల్‌కి డొనేషన్ ఇస్తారట. అందుకే నన్ను అదేపనిగా ఆహ్వానించారు."

"నా కిష్టంలేదు సంపూర్ణా! నువ్వు డాన్స్ చేస్తే నేను సహించలేను.''

ఆమె అదోలా నా వైపు చూసింది. సూటిగా గుండెల్లోకి చొచ్చుకుపోయినట్లు చూసే చూపది.

"ఎందుకు? పెళ్ళప్పుడు నా కళారాధనకి అడ్డురానన్నావుగా!''

"అందుకని భర్త ఇచ్చిన స్వేచ్ఛని ఇలా దుర్వినియోగపరుస్తున్నావన్న మాట."

ఆమె నిర్లక్ష్యంగా చూసింది.

అంతే! నాలోని ఆవేశం ఒక్కసారిగా పైకి పొంగింది.

ఆమె చెయ్యిపట్టి గబుక్కున పక్కన కూర్చోపెట్టాను.

"నువ్వు వెళ్ళొద్దుసంపూర్ణా! ఎందుకో నాకు నువ్వలా తిరిగితే ఇష్టంలేదు" అన్నాను దగ్గరికి తీసుకుంటూ.

"అనుమానమయితేతమరూరావచ్చు"

సీరియస్‌గా ఉన్న నా ముఖం.లోకి చూసి నవ్వింది.

"జోక్స్‌కిది సమయంకాదు. నువ్వూ వెళ్ళద్దు. నేనూ రాను. అలా నైట్ షోకి వెళ్లాం." బ్రతిమాలుతూన్న ధోరణిలో అన్నాను.

"ఈ వేళ కుదరదులే? నేను బయటకు వెళ్ళాలి."

ఆమె లేచి వెళ్ళిపోయింది. 'భర్త అనే లక్ష్యంకూడా లేదు అసలు. ఆస్తి, కారు అన్నీ ఉన్నాయని గర్వం. ఈమెని చేసుకోవటం నాదే తప్పు.'

మధ్య తొమ్మిదిగంటల కోసారి లేచి వెళ్ళి చూశాను.

ఆమె రాకలేదు. ఇంకో గంట ఆగి మళ్ళీ లేచి చూశాను. లాభం లేక పోయింది.

ఈసారి పదకొండు గంటలకి కింది నుంచి మావయ్య తలుపు తెరిచినట్లున్నారు. మాటలు వినిపిస్తున్నాయి.

"ఏమిటమ్మా! ఇంత రాత్రివేళ! అబ్బాయి ఇంట్లో ఉన్నప్పుడు...అసలే ఒంట్లోకూడా బాగా లేదట."

'సంపూర్ణకి ఎంతమంది చెప్పినా నా సంగతి పట్టదు. క్లర్క్‌నని చిన్న చూపేమో!'

"ఎలా ఉంది ఒంట్లో" అప్పుడే వచ్చిన సంపూర్ణ అడిగింది.

మాట్లాడలేదు నేను. సంపూర్ణని మార్చాలని చూస్తున్న తరుణంలో తిరిగి నేను ఏ కాస్త చొరవ ఇచ్చినా తిరిగి యథాప్రకారం అవుతుందన్న భయంతో కళ్ళు మూసుకున్నాను.

''ఎలా ఉందంటే..." నా పక్కనే కూర్చుంటూ అడిగింది.

"తలనొప్పిగా ఉంది కానీ పోయి పడుకో" అన్నాను.

"అమృతాంజనం వ్రాయనా?"

ఏమీ అక్కరలేదు. ముందవతలికి వెళ్ళు." కోపంగా అన్నాను.

"నేను వెళ్ళేంతవరకూ ఏ అనారోగ్యమూ లేదు కదా, ఇప్పుడు..." అంది.

కాసేపు మౌనంగా ఉన్నాక-

"నా హృదయంలో నీ గురించి జరుగుతున్న సంఘర్షణ భరించలేకుండా ఉన్నాను. నువ్వెలా ఉన్నా నా కనవసరం. నీకు క్లర్క్ భార్యగా ఉండటం ఇష్టంలేక, ఆఫీసర్స్..." ఆపేశాను.

"మాట పూర్తి చెయ్యి" అంది.

"నేను నా నోటితో చెప్పలేను."

''చెప్పకపోతే తెలుసుకోలేనంత అమాయకురాలను కాను కానీ క్లర్క్ భార్యగా ఉన్నందుకు నాకేం తక్కువగా ఉన్నట్లు భావించటంలేదు. పెద్ద బంగళా, కారు అన్నీ ఉన్నాయి. నాకింకేం కావాలి?" అంది.

''ఈ ఆస్తితో, అంతస్తుతో నా ప్రేమను కొనలేవు సంపూర్ణా! నాకు కావలసింది నన్ను ప్రేమించే హృదయం. నీకవన్నీ అర్థంకావుగానీ దయచేసి వెళ్ళు."

సంపూర్ణ మౌనంగా వెళ్ళిపోయింది.

ఆ రోజు రాత్రంతా నాకు నిద్ర లేదు. మధ్య నాలుగు గంటలకి వచ్చి బాల్కనీలో కూర్చున్నాను. 'ఎలా, సంపూర్ణని ఎలా మార్చాలి' ఇదే నా మనసులో ప్రశ్న! దీనికి జవాబే మరునాటినుంచీ నేను అమలులో పెడుతున్న పనులు!

* * *

ప్రేమ అనేది మనసుకు సంబంధించిన విషయం. నేను ఇప్పుడు సంపూర్ణలో నా మీద ప్రేమబీజం నాటాలి. దానియొక్క ప్రభావం ఎలా ఉండాలీ అంటే సంపూర్ణ నా కోసం ఏం చెయ్యటానికైనా సిద్ధపడాలి.

అందుకే ఆ రోజు ఎంతో ఉత్సాహంగా ఇంటికి వచ్చాను. అద్దంలో తన ప్రతిబింబం తనివితీరా చూసుకుంటూ, మధ్యమధ్యలో పౌడర్ వ్రాసుకుంటోంది సంపూర్ణ.

అసలు సంపూర్ణకి ఎలా డ్రెస్ చేసుకోవాలో బాగా తెలుసు. అందుకే ఇంట్లో ఉన్నప్పుడు నైలెక్స్ చీరలు కట్టి ఒక




జడ వేసుకుని ఎంతో సాధారణంగా ఉంది. పెళ్ళిళ్ళ కెళ్ళేటప్పుడు పట్టు చీర, నగలు అన్నీ అలంకరించు కుంటుంది. ఇంక క్లబ్‌లకి వెళ్ళేటప్పుడు సన్నటి జార్జెట్ చీరనో, షిఫాన్ చీరనో కట్టేస్తుంది. అందుకే ఈ రోజు సంపూర్ణ డ్రెస్ చూస్తూనే తెలుసు కున్నాను — 'క్లబ్ కెళుతోంది' అని. అందుకే నాలోని ఉత్సాహం చల్లారి పోయింది.

"ఎక్కడికి?" నీరసంగా అడిగాను.

"క్లబ్‌కి. ఈ రోజు ఆటలపోటీ లున్నాయి. రాకూడదూ!" అంది.

"ఆటలపోటీకి నువ్వెందుకు? టికెట్స్ రిజర్వ్ చేయించాను. రవీంద్ర భారతిలో ఏదో తెలుగునాటకం ఉంది" అన్నాను.

"అరె చాలా ముఖ్యమైన పనిమీద వెళుతున్నాను. రాకపోతే వాళ్ళకి కోపం వస్తుంది."

"నువ్వు నాటకానికి రాకపోతే నాకూ కోపం వస్తుంది." అన్నానామె చెయ్యి పట్టుకుంటూ. సెంట్ వాసన గుప్పు మంది.

"సారీ ఈ రోజు రాలేను" చెప్ప లేసుకోవటానికి లేచింది. రోషం నా నరనరాల్లో మెలిక తిరిగి హృదయం భగ్గుమనేలా చేసింది.

ఆవేశంగా, బలంగా ఆమెని లాగాను. అనుకోని ఆ ప్రవర్తనకి బిత్తరపోయింది సంపూర్ణ. ఒక్క ఉదుటున నా దగ్గర కూర్చుండిపోయింది. సంపూర్ణని కదల నివ్వకుండా గట్టిగా అదిమిపట్టుకుని ఆమె ముఖాన్ని గుండెలకి ఆనించాను.

ఏదో తెలియని హాయి కలిగింది.

"మేకప్పు చెరిగిపోతుంది, వదలండి" అంది.

"ఉఁహుఁ." చేతులు మరింత బిగించాను.

సంపూర్ణ ఒక్కసారిగా తన బల మంతా ఉపయోగించి చేతులు దూరం జరిపి లేచి నిల్చుని అద్దంలో తన ప్రతి బింబం చూసుకుంది.

షర్ట్ మీద పడిన బొట్టు ముద్ర, కాటుక ముద్రలు, లిప్‌స్టిక్ అన్నీ చూసుకుని సంపూర్ణ వైపు తిరిగాను.

"హుఁ...భార్య అంటే ఇలా ఉండాలి కాబోలు" విసుగ్గా ముందుకు నడిచిందామె.

ఎందుకో ఆ క్షణంలో సంపూర్ణ అక్కడినుంచి ఎప్పుడు వెళ్ళిపోతుందా అనిపించింది.

సంపూర్ణ వెళ్ళాక అనుకున్నాను— 'నా మొదటి ప్రయత్నం వృథా అయింది. సంపూర్ణ నాకు లొంగలేదు.' అని.

* * *

"నా డాన్స్ ప్రోగ్రాం ఈ రోజే. నాతోపాటు రావాలి."

గిరుక్కున వెనక్కి తిరిగి చూశాను. ఎఱ్ఱటి డాన్స్ డ్రెస్‌లో సంపూర్ణ నిలబడి ఉంది.

"నేరు రాలేను" అన్నాను.

"రాకపోతే ఊరుకోను" అన్నది.

కాసేపు ఆలోచిస్తూండిపోయాను. సంపూర్ణదగ్గర పట్టుదలగా ప్రవర్తించకూడదు. 'నిలకడమీద మనసు మార్చాలి.'

అందుకే ఆమెతోపాటే బయలుదేరానుకా సేపటికి కారు క్లబ్‌ముందాగింది.

ఎంతోమంది జనంతో కిటకిటలాడుతోంది హాలు. ఈ క్లబ్‌కి రావటమనేది ఓ వ్యసనంలాంటిది. ఒకసారి దానికి అలవాటయిన మానవులు ఇంక జన్మలో దానిని మరచిపోలేరు. పంచరంగుల ప్రపంచం సృష్టిచేసి మాయలో పడేస్తుంది. అయితే ఒకసారి ఆలోచించి చూస్తే కళ్ళముందున్న మైకపు తెర తొలగక మానదు.

ఆశ్చర్యమేమిటంటే మా ఆఫీసరు గారూ, సుబ్రమణ్యం ఇంకా చాలామంది వచ్చారు.

"మీ ఆవిడట కదూ డాన్స్‌చేసేది. వండర్‌ఫుల్‌గా డాన్స్‌చేస్తోందట" లాంటివి వస్తున్నాయి అందరినోటినుంచి. తలవంచుకుని కూర్చున్నాను.

హావ భావాలూ, ఒంపు సొంపులు అన్నీ ఎలాంటి సంకోచం లేకుండా ప్రదర్శించి డాన్స్ చేస్తోందామె.

ఎందుకో పూర్తిగా చూడబుద్ధి కాలేదు. చటుక్కున లేచి ఇంటిదారి పట్టాను.

"అమ్మాయి ఏది చంద్రం?" రాగానే అడిగారు రావుగారు.

"అదక్కడేఉంది" అన్నాను అక్కడ నుండి వెళ్ళిపోతూ.

సంపూర్ణ ఓ గంట తరువాత వచ్చింది.

"ఎందుకు మధ్యలో వచ్చేశావు! అలా నన్ను ఒంటరిగా వదిలేసి వెళ్తే వాళ్ళేమనుకుంటారు?", అందామె ఎఱ్ఱబడ్డ ముఖంతో.

"నీ కలవాటేగా ఒంటరిగా వెళ్ళటం" వ్యంగ్యంగా అన్నాను.

"జంటగా వెళ్ళాక ఒంటరిగా రావటం అలవాటులేదు. ఇష్టంలేదు" అన్నదామె.

"ఒంటరిగా వెళ్ళి జంటగా రావటం నీ కలవాటని నాకు తెలుసు" అన్నాను.

ఆ రోజు రాత్రి నాకూ, సంపూర్ణకి అసలు ఎక్కువగా మాటలు జరగలేదు. అన్నీ పుల్లవిరుపు మాటలే.

మరునాడు నేను నిద్రలేచేసరికి సంపూర్ణ నిద్రపోతోంది. ఆమెని అలాగే ఒంటరిగా వొదిలేసి కిందికి వచ్చేశాను.

* * *

వారంరోజులు గడిచాయి. మా ఇద్దరి మధ్యా పూర్తిగా దూరం ఎక్కువైపోతోందేమోననిపించింది నాకు.

జీవితంలో స్త్రీ మనస్సు గెలిచిన నాడే నిజమైన ఆనందం లభ్యమవుతుంది మగవాడికి. కానీ నాకా ఆనందం ఈ జన్మలో లభ్యమయ్యేటట్లు లేదు.

రావుగారికి ఈ మధ్యే హార్ట్ ఎటాక్ వచ్చి హాస్పిటల్‌లో చేరారు.

రోజూ సంపూర్ణ ఒంటరిగా వెళ్ళి ఆయనదగ్గర కూర్చుంటున్నది.

ఓ రోజు నేను హాస్పిటల్‌లో ఉన్న సమయంలోనే వచ్చింది సంపూర్ణ.

కనీసం నా వంక కన్నెత్తైనా చూడక హార్లిక్స్ కలిపి ఆయన కిచ్చింది.

"చంద్రంకి కూడా ఇవ్వమ్మా!" నీరసంగా అన్నారు.

"నాకు వద్దు" అన్నాను.

"చంద్రం! మీ ఇద్దరికీ మధ్య సత్సంబంధం లేదని తెలుస్తోంది. ఎందుచేత ఇలా ఇద్దరూ దూరంగా ఉంటున్నారు?" ఆయన గొంతులో దుఃఖం ధ్వనించింది.

"తప్పంతా మీ అమ్మాయిదే!" అన్నాను.

"కాదు, ఆయనదే!" అన్నది సంపూర్ణ.

నేను తిరిగి జవాబు చెప్పలేదు.

జీవితంలో ఏ మాధుర్యం లేకుండా రోజులు గడుస్తున్నా యనిపించింది.

సంపూర్ణ నాకంటే ముందే ఇంటికి వచ్చేసింది.

భారంగా ఇంటికి వచ్చిన నాకు మంచంమీద పడుకుని సంపూర్ణ కనిపించింది.

ఆమె కనులలోనుండి నీరు కారుతోంది.

"సంపూర్ణా? నీకోసం ఏం తెచ్చానో చెప్పు" పక్కన కూర్చుంటూ అడిగాను.

"ఏమో తెలియదు" అన్నది పసి పిల్లలా.

సంపూర్ణతో మాటా మాటా వచ్చినా నేను ఇంకా సంపూర్ణని ప్రేమిస్తున్నాను. అయితే నాకు కావలసింది ఆమె ప్రేమ.

"నీ కోసం చీర తెచ్చాను."

సన్నటి నైలెక్స్ చీర. పసుపు రంగు మీద చిన్న ఎఱ్ఱని పూలు.

"బాగుందా?" అన్నాను.

"బాగానే ఉంది. కానీ నాకు నల్ల రంగు చీరలు బాగుంటాయని అందరూ అంటారు కదా!"...అంది.

అంతే! ఇంక నేను మాట్లాడలేక పోయాను.

"ఈసారి అలాంటిది తెస్తానులే!" అన్నాను కాసేపయ్యాక.

అలా మా ఇద్దరి మధ్యా తిరిగి మాటలు మొదలయ్యాయి. ఆమెపట్ల నా హృదయంలో అనురాగం మొలకెత్తింది. 'ఈ అనురాగం, ప్రేమ జీవితాంతంవరకూ ఉంటే ఎంత బాగుండును. అసలు మనుష్యులు జీవించేదీ, తపించేదీ ఇలా తోడుగా ఉంటూ, ప్రేమించే వ్యక్తుల కోసమేగా!'

ఆ క్షణంలో నాకు జీవితసత్యం తెలిసింది. ఆలోచిస్తూ ఆమెవైపు ఆరాధనగా చూస్తున్నాను.

"అన్నట్లు సంపూర్ణా! ఇందాక ఎందుకు అలా ఏడ్చావు..." అన్నాను.

"నువ్వు నన్ను అర్థంచేసుకోనందుకు" అంది.

మా ఇద్దరిలో విచిత్రం ఏమిటంటే నన్ను అర్థంచేసుకునే గుణం ఆమెకి లేదు. ఆమెని అర్థంచేసుకునే మనస్తత్వం నాకు లేదు.

"అన్నట్లు ఆ పత్రికలో మధ్య పేజీ తీసి చూడు" అన్నది.

"ఏముంది! నీ అభిమాన డాన్సర్ ఉందా!" అంటూనే తీశాను.

తీరం చేరిన కెరటం తిరిగి సముద్రంలోకి జేరుకున్నట్లు నాలోని ప్రేమ ఒక్కసారిగా మాసిపోయింది. బాధతో కృంగిపోయాను.

'ప్రఖ్యాత డాన్సర్ సంపూర్ణతో పరిచయం' అని ఉంది.

వివిధ భంగిమలలో సంపూర్ణ ఫోటోస్.

"సంపూర్ణా! ఎన్నిసార్లు చెప్పాలి. నా కిలాంటివి ఇష్టంలేదని. అందరికీ ఫలాన అతని భార్య డాన్సర్ అని తెలియాలా?"

"నాకు డాన్స్ అంటే ఇష్టం అని తెలుసుగా!"

"అయితే!"

"ఆ రోజు నా డాన్స్ ప్రోగ్రాం అయ్యాక పత్రికా విలేఖరి ఇంటర్వ్యూ జరిపించి ప్రచురించాడు."



"నీ అనుమతి మాత్రమే సరిపోతుందా!"

"ఇది నా వ్యక్తిగత విషయం కాబట్టి అనుమతి అక్కరలేదనుకున్నాను."

"అసలు నీకు ఏ విషయంలోనూ నా అనుమతి అక్కరలేదు" అని చటుక్కున నాలుగడుగులు ముందుకు వేసిన నాకు ఫోన్‌కాల్ వినిపించటంతో ఆగిపోయాను.

"తియ్యి, నీకే వచ్చి ఉంటుంది."

"ఊహుఁ! నువ్వే తీసి చూడు" అందామె ఎటో చూస్తూ.

వంకరగా ఓ నవ్వు నవ్వి ఫోన్ తీసిన నాకు ఒక్కసారిగా గుండె ఆగినంత పనైంది. ముఖం చెమటతో తడిసిపోయింది.

ఫోన్ పెట్టేశాను.

"ఎక్కడనుంచి" సంపూర్ణ అడిగింది.

"మీ నాన్న పోయారట" బాధగా అన్నాను.

వెక్కి వెక్కి ఏడ్చేసింది సంపూర్ణ. ఆ క్షణంలో ఆమెకి ఈ లోకంలో అండని నేనే అయ్యాను. నా హృదయంలో వాలిపోయింది పసిపాపలా.

ఆమెని లాలించటం తప్ప ఏమీ చేయలేకపోయాను.

* * *

రావుగారు పోయారు.

సంపూర్ణకి ఇప్పుడు పూర్తిగా విరక్తి వచ్చేసింది. మాట్లాడినా ముభావంగా మాట్లాడుతోంది.

ఓ రోజు......

"నాకు ఉద్యోగం వచ్చింది" అంది సంపూర్ణ.

"ఏ ఉద్యోగం?"

"డాన్స్ టీచరుగా గవర్నమెంట్ కాలేజీలో!" అంది.

"సంపూర్ణా! ఇప్పుడు నీకు ఉద్యోగం చేసే అవసర మేమొచ్చింది?"

"ఈ కాలంలో ఎవరు ఉద్యోగం చెయ్యడంలేదు."

"నువ్వు చెయ్యక్కరలేదు సంపూర్ణా!"

"వచ్చిన ఉద్యోగం పోగొట్టుకో లేను. డాన్స్ టీచర్‌గా ఉంటే నా కళని నలుగురికీ పంచినదాన్నయినా నన్న తృప్తి నాకు ఉంటుంది. అదీ గాక ఇంటికి సాయంగా ఉండవచ్చు."

''నీ సాయంకోసం ఎవ్వరూ వేచి ఉండటంలేదు. క్లర్క్ భార్యగా ఉండటం నీ కిష్టంలేకపోతే ఆ ఉద్యోగంలో చేరు."

సంపూర్ణలో చలనంలేదు.

"సరే! తమరు రేపటినుంచీ ఆఫీసర్ కాబోతున్నారు'' నవ్వుతూ అన్నది.

"ఏం ప్రమోషన్ వచ్చిందా?" అన్నాను.

"వచ్చినట్లే! ఈ రోజు జాన్స్, అదే మీ ఆఫీసర్ వాళ్ళింటికి రమ్మన్నాడు. నేను మాట్లాడేసి వస్తాను."

''నీకా శ్రమ అక్కరలేదు. నన్నిలా ఉండనియి చాలు" అన్నాను.

"లేదు, వెళ్తాను. ప్రమోషన్ ఇప్పిస్తాను."

"నువ్వు అతనింటికి వెళ్ళటం నా కిష్టంలేదు. అతను మంచివాడు కాదు" అన్నాను.

"నాకు తెలుసు ఎవరిదగ్గర ఎలా ఉండాలో" అంది.

సంపూర్ణకి ఏమి చెప్పినా లాభం ఉండదని తెలిసి మరి రెట్టించలేదు.

ఆ రోజు సాయంత్రం రోజూకంటే అందంగా కనిపించింది సంపూర్ణ.

గాద్రేజ్ తెరిచి అయిదువేల రూపాయలు తీసింది.

"ఎందుకా డబ్బు?" అన్నాను.

''ఆఫీసర్ హోదాకి ఈ మాత్రం కావద్దూ?" అన్నది.

"సంపూర్ణా! అతన్ని నమ్మి వెళుతున్నావు గానీ అతను నిన్నేమైనా చెయ్యొచ్చు." ఆమె భుజం గట్టిగా పట్టుకున్నాను.

నా చెయ్యి విసురుగా తోసిందామె.

"సరే నీ ఇష్టం వెళ్లు. అయితే, డబ్బు మాత్రం లోపల పెట్టు.''

''పెట్టను."

''అతను నీకేం చేశాడని ఇంత డబ్బు! నీ అందానికి ఇదో ఆకర్షణా?"

"ఏ వైఖా అనుకోవచ్చు" అనేసి ముందుకు నడిచి వెళ్ళిపోయిందామె.

'ఎంత నిర్లక్ష్యం! అస లిలాంటి కొంపలో కూరుకుపోవటం ఏనాడు చేసుకున్న పాపమో కదా!'

నా హృదయంలో రగులుకుంటోంది ఆర్తి. తీరని విషాదం. ఇంతలో 'పోస్ట్'అన్న పోస్ట్‌మాన్ కేక వినిపించింది.

వెళ్ళి అందుకున్నాను.

హైద్రాబాద్‌లో ఉండే ఫ్రెండ్ సుధాకర్ వ్రాశాడు

"చంద్రం,మా స్కూల్లో నీకు టీచరుగా ఉద్యోగం ఇప్పిస్తున్నాను. త్వరలో వచ్చెయ్యి..." అని వుంది.

మనసు ఆనందంతో ఎగిరి గంతేసింది. ఏదో ప్రశాంతత ఆవరించింది. 'వెళ్ళిపోవాలి' సంపూర్ణకి దూరంగా వెళ్ళిపోవాలి. నా లోటును ఆమెకు తెలియచెప్పాలి. అయినా అక్కడ జాన్స్, సంపూర్ణ ఒకే గదిలో... ఛీ ఛీ, 'సంపూర్ణ కెందుకు ఇలాంటి బుద్ధులు పుడుతున్నాయి. మారుతుందని కలలు కని చేసుకున్నాను. కానీ ఫలితం శూన్యం. మంచుతెరలలా కలలు కరిగిపోయాయి.'

'ఇంక అలా జరగటానికి వీలులేదు. వెళ్ళిపోవాలి. అప్పుడు సంపూర్ణ తనకి తానుగా నా నీడకి వస్తుంది. ఎడబాటును సహించగలదా ఆమె'

ఏదో నిశ్చయానికి వచ్చేసి సూట్‌కేస్ సర్దుకున్నాను. పేపరు, పెన్ తీసి వ్రాయసాగాను.

"సంపూర్ణా!

నిన్ను చేసుకుని పూర్తిగా మోసపోయాను. నాకు కావలసింది నన్ను ప్రేమించే హృదయం. నువ్వు నన్ను జీవితంలో ప్రేమించలేవు. నాకు టీచరుగా హైద్రాబాద్‌లో ఉద్యోగం వచ్చింది. నేను వెళితే నీకు పూర్తి స్వాతంత్ర్యం వస్తుంది కదూ! నీ ఇష్టం వచ్చినంతమందితో తిరుగు. నీకు అడ్డు చెప్పేవారుండరు

కానీ నేను నీకు చెబుతున్న ఈ విషయం మాత్రం మరచిపోవద్దు—"ఏది నిజమో, ఏది నటనో తెలుసుకోలేని మోసాలు అనేకం జరుగుతున్నాయి. నటనని చూసి నిజం అనుకుని మోసపోవద్దు సమాజం స్త్రీకి గీసిన గీతను దాటి ముందడుగు వెయ్యొద్దు."

ఇప్పటికీ మించిపోయింది లేదు. ఈ కింద అడ్రెస్ వ్రాస్తున్నాను. నువ్వు మనసు మార్చుకుని వస్తే రా!

ఉంటాను
చంద్రం"

అడ్రెస్ వ్రాసి పేపరు టేబిల్‌మీద పెట్టి, పనివాడితో, "అమ్మగారికి చెప్పు, నేను ఊరు వెళుతున్నట్లు" అని చెప్పి రైలెక్కాను

రైల్లో కూర్చున్నంత సేపూ

సంపూర్ణ ఆలోచనలే! ఉత్తరం చదువుకున్న ఆమె భావనలెలా ఉంటాయి?"

"వైవాహిక జీవితంలోకి అడుగు పెట్టినప్పటినుంచీ సంపూర్ణ నా కెలాంటి ఆనందం ఇవ్వలేదు

ఎన్నో రోజులు సంపూర్ణకోసం సుధాకర్‌వాళ్ళ ఇంట్లో వేచి చూశాను. లాభం లేకపోయింది

ఇప్పుడు వేరేగా ఇల్లు తీసుకుని ఉంటున్నాను."

చెప్పటం పూర్తిచేసి – "ఇప్పుడు చెప్పు రఘూ! నేను చేసినది తప్పా! నా భార్య సయాపైసల పతివ్రతగా ఉండక్కరలేదు. కానీ ఇలా పరాయి వాళ్ళతో తిరిగితే, ఏ భర్త సహించగలడు! నాకు హోదా అక్కరలేదు. మంచిపేరు చాలు!

'ఒకవేళ నేను ఆఫీసర్‌గా అడుగు పెట్టినా అందరిలో నాకెంత చెడ్డపేరు చెప్పు! నా భార్యవలస ఉద్యోగం వచ్చిందని తెలిస్తే నాకు అవమానం కాదా! చెప్పు రఘూ!" నా చెయ్యి పట్టుకున్నాడు.

ఏం చెప్పాలి, ఎలా చెప్పాలి.

"సంపూర్ణని కలిశాక చెబుతాను చంద్రం!" అన్నాను.

వాడు రెట్టించలేదు. ఓ రెండ్రోజులు చంద్రంతో గడిపి రైలెక్కాను.

విశాఖపట్నం మరునాటి ఉదయం కల్లా చేరుకున్నాను. అడ్రెస్ పట్టుకుని సంపూర్ణ ఇంటి ముందాగాను. ముందు వరండాలో ఎవ్వరూ కనిపించలేదు. వెళ్ళి కాలింగ్ బెల్ నొక్కాను. నొక్కిన అయిదు నిమిషాలకి సంపూర్ణ వచ్చి తలుపు తెరిచింది.

"నేను చంద్రం ఫ్రెండ్‌ని. మిమ్మల్ని కలవటానికి వచ్చాను" అన్నాను.

"నన్నా!" ఆశ్చర్యంగా ఓసారి నా వంక చూసింది. లోపలికి వచ్చి కూర్చున్నాను.

"కాఫీ తెస్తానుండండి" అన్నది.

కాసేపు పేపరు తిరగేస్తూ కూర్చున్నాను. కాఫీ ఇచ్చిందామె.

కాఫీ తాగటం మొదలుపెట్టాను.

''మీకు తెలుసో తెలియదో గానీ ఆయనిక్కడ లేరు" అంది సంపూర్ణ.

''తెలుసు. నేను చంద్రం దగ్గర నుంచే వస్తున్నాను.

సంపూర్ణ ముఖకవళికలు మారాయి.

"ఎలా ఉన్నారాయన?" అడిగింది.

"అంతా చెప్పాడు. తప్పు ఎవరిది?" అని అడిగాడు.

''ప్రాణస్నేహితుని మాటలు వింటే తప్పు అసలు అతనిది కాదనిపిస్తుంది. కానీ తప్పంతా అతనిదే!" అంది.

కాసేపు మౌనం రాజ్యంచేసింది.

"ఈ రోజు భోజన మిక్కడే చెయ్యాలి మీరు" అంది.

"అలాగేనండీ" అన్నాను.



బాత్‌రూం చూపించాక స్నానంచేసి వచ్చాను. పదింటికి అన్నం వడ్డించిందామె.

"అసలు ఏం జరిగి మీ ఇద్దరూ ఇలా విడిపోయారు?" అడిగాను.

"ఆయనకి నన్నర్థంచేసుకునే గుణంలేదు. అసలేం జరిగిందంటే...."

ఆమె చెప్పటం మొదలుపెట్టింది. ఇంకో పాత్ర నా ముందు నిలిచింది. డైరీలో వ్రాసుకున్నాను.

ఈ కిందిది సంపూర్ణ పాత్ర....

సంపూర్ణ: వైవాహిక జీవితంలోకి అడుగుపెట్టక ముందే చంద్రంకి అంతా చెప్పాను. కళారాధన నా జీవితంలో ఒక భాగమనీ, సంఘంలో నలుగురితో కలిసి తిరగటం నా సరదా అని. అతను అంతా ఆలోచించే నన్ను చేసుకుంటానని ఒప్పేసుకున్నాడనుకున్నాను.

కానీ పెళ్ళయిన మొదటిరోజే నేను క్లబ్ ఫ్రెండ్స్‌తో కలిసి తిరిగితే సహించలేకపోయాడు.

నాకు ఫోన్ వస్తే ఇష్టం లేదు. నేను

క్లబ్‌కి వెళ్ళితే అనుమానం. ఆడదాని మీద ఆ మాత్రం నమ్మకం లేకపోతే ఎలా?

క్లబ్‌లో డాన్స్ ప్రోగ్రాం నాడు నన్ను ఒంటరిగా వొదిలేసి వెళితే అంత మందిలో నా కెంత చిన్నచూపో ఆలోచించలేదు!

నిజం చెప్పాలంటే అతనెలా ఉన్నా సర్దుకుపోదామని ప్రయత్నించాను.

అతనికోసం, అతన్ని ఆఫీసర్‌ని చెయ్యటంకోసం జాన్స్ దగ్గరికి వెళితే అనుమానం. నేనంత తెలివితక్కువ దాన్ని కాదు. అయిదువేలు ఇచ్చి నట్లు వ్రాయించి అతని సంతకం కూడా తీసుకున్నాను. కానీ ఇతనిలో అంత ఆవేశం ఉంటుందనుకోలేదు. ఇంటికి వచ్చేసరికి వెళ్ళిపోయాడు ఆఫీసర్‌లాంటి హోదాగల ఉద్యోగం వదులుకుని టీచర్‌గా వెళ్ళాడు ఆ తరువాత క్లబ్‌కి వెళ్ళినప్పుడు ఎంతో మంది నన్ను చిన్నచూపు చూశారు. ముఖ్యంగా జాన్స్ ముందు అవమానమై పోయింది.

ఇంక కళ విషయం నేను స్టేజీ మీదికి వెళ్ళటం ఇష్టంలేదు. పత్రికలో నా ఫోటో పడితే ఇష్టంలేదు.

భార్యకి ఉన్న కోరికలు నెరవేర్చుకో కూడదు. అతని కోరికలకి తగ్గట్టుగా నన్ను మార్చాలని చూస్తాడు. ఒకళ్ల కోసం అభిరుచులను చంపుకుని బ్రతక లేను.

ఈ జీవితంలో నా ఆశయం డాన్సర్‌గా పైకి రావటం. దాన్ని ఎవ్వరూ ఆపలేరు.

ఇంకా నన్ను పరీక్షించటానికన్నట్లు అడ్రెస్ ఇచ్చి రమ్మన్నాడు. ఇక్కడ కళారాధనకి ఎంతో బాగుంది. పైకి వెళుతున్న ఈ తరుణంలో నా ఆశలని వదులుకోలేదు, అతను ఇంటినుండి వెళ్ళి పోవటమే నన్నెక్కువగా బాధించింది.

ఆ సంఘటనతో అతనిపట్ల ఓ రక మైన నిరసన కలిగింది. మనసుకు నచ్చని జంటతో అనుక్షణం బాధపడే కంటే జీవితాంతం ఇలాగే ఉండటం నయమనిపించింది.

ఇప్పుడు "నన్ను అమెరికావాళ్ళు ఆహ్వానించారు. ఇంకో రెండు నెలలలో అమెరికా వెళుతున్నాను. వీలైతే అక్కడే సెటిల్‌అయిపోతాను అంది.

"అంటే మీరింక చంద్రంతో... అనుమానంగా అడిగాను.

"ఉండలేను" అంది కృతనిశ్చయంతో.

కాసేపయ్యాక అందామె – "తప్పెవరిదో చెప్పండి" అని.

"వెళ్ళాక ఉత్తరం వ్రాస్తాను" అన్నాను.

ఆ రోజు నేనే కాదు, సంపూర్ణ కూడా అన్యమనస్కంగానే ఉంది.




ఆ రోజు రాత్రి ఆమె ఆతిధ్యం తీసుకుని నా స్వస్థలంకి ప్రయాణ మయ్యాను.

ఇప్పుడు వారిద్దరికీ ఉత్తరాలు వ్రాయాలి.

ఏమని?

తప్పు ఎవరిదో చెప్పటం నాకు సాధ్యం కాలేదు. ఉత్తరాలు వ్రాశాను.

"చంద్రం,

ఆలోచించాను. తప్పు నీదీ కాదు. ఆమెదీ కాదు. పరిస్థితులది. ఒకరి నొకరు అర్థంచేసుకుంటే ఇలాంటివి రావు కదా! సంపూర్ణని అర్థంచేసుకుని, ఆదరంగా నీ ఇంటికి తీసుకొచ్చుకో! త్వరపడు. ఆమె త్వరలో అమెరికా వెళ్ళిపోతోందిట. మీరిద్దరూ కలిసిఉండే మార్గం ఆలోచించుకోండి. ఉంటాను. నీ శ్రేయస్సు కోరేవారిలో నేనూ ఒకడిని – రఘు.

అలాగే సంపూర్ణకి వ్రాశాను.

"సంపూర్ణకి,

తప్పు ఎవరిదో నేను చెప్పలేనేమో ననిపిస్తోంది. చంద్రంని క్షమించేసుకుంటే మంచిది. మీరిద్దరూ జీవితాంతం కలిసి ఉండాలని ప్రార్థిస్తున్నాను – రఘు."

**ఇలా ఈ** రెండు **పాత్రలకి పరి**ష్కారమార్గం సూచించాను. నాకు కావలసింది వారిద్దరూ చిలకా గోరింకల్లా ఉండటమే.

ఇలా నా ముందు నిలిచిన పాత్రలని వ్రాసి కలాన్ని ఆపాను. ఇప్పుడు ముగించాలి. వీరిద్దరినీ కలపాలా, విడదీయాలా?

ఆలోచించాక ముగింపు ఇలా వ్రాశాను – నా ఉత్తరం చదువుకుని సంపూర్ణ భర్తకోసం అమెరికా వెళ్ళటం

మానుకుంటుంది. చంద్రం సంపూర్ణ కోసం విశాఖపట్నం వెళ్ళాడు. ఇద్దరూ తిరిగి కొత్తజీవితం ప్రారంభిస్తారు. ఇద్దరి జీవితాలలో భానూదయమైంది.

ఇలా పాత్రలకి రాజీ కుదిర్చాను. అంటే కథ ముగించాను.

కథ పత్రికలలో ప్రచురింపబడింది. నేను ఉత్తరాలు వాళ్ళకి డైరెక్ట్‌గా కాకుండా పత్రికా ముఖంగా వ్రాశాను. ఎందుకంటే రచయితగా నేను చెబితే మారతారన్న నమ్మకం నాకుంది. 'ఈ కథ చదివి వాళ్ళు మారితే నాకంతే చాలు' అనుకున్నాను.

ఇంతలో పోస్ట్‌మాన్ వచ్చి రెండు ఉత్తరాలు ఇచ్చి వెళ్ళాడు. ఆత్రంగా అందుకున్నాను.

ఒకటి చంద్రం దగ్గరనుంచీ, ఇంకోటి సంపూర్ణ దగ్గరనుంచీ వచ్చాయి. ఎంతోమంది పాఠకులు అభినందనలు తెలుపుతూ వ్రాశారు. కానీ ఏ ఉత్తరాలూ ఇంత ఉత్సాహంగా అందుకోలేదు. ముందు చంద్రం ఉత్తరం చింపాను.

"రఘూ!

నీ కథద్వారా మమ్మల్ని మారుద్దామని అనుకుంటే అది వ్యర్థ ప్రయత్నం. నేను సంపూర్ణకోసం మారలేను. నాకూ మనసుంది. నలుగురితో కలిసి సంపూర్ణ తిరిగితే నేను సహించలేను. అనవసరంగా అర్థంలేని పరిష్కారమార్గం సూచించావు. నేను సంపూర్ణతో కాపురం చెయ్యలేను. తప్పు పరిస్థితులదీ కాదు. నాదీ కాదు. సంపూర్ణది. ఉంటాను – చంద్రం."

విసురుగా ఉత్తరం పడేశాను పక్కకి.

'సంపూర్ణ అయినా మారి ఉంటుందా!'

సంపూర్ణ ఉత్తరం చింపాను.

"రచయితగారికి,

మీ కథ అంతా నచ్చింది. పాత్రలని బాగా నడిపించారు నేను చెప్పిన ప్రతి వాక్యం వ్రాశారు. కానీ మీరు వ్రాసినట్లుగా నేను మారలేను. నాది మొదటినుంచీ తలవంచని వ్యక్తిత్వం. అన్నట్లు రేపే నా అమెరికా ప్రయాణం. తప్పు నాది కాదని మీకు తెలుసుగా! మీరు ఫ్రెండ్ కోసమని తప్పు అతనిది కాదన్నారు కదూ! ఏదేమైనా పరవాలేదు. నాకు తెలుసు తప్పు నాది కాదని. ఉంటాను – సంపూర్ణ"

విరక్తిగా ఆ రెండు ఉత్తరాల వైపు చూస్తూండిపోయాను. కథలో జీవితం సుఖాంతం చేశాను. కానీ నిజజీవితంలో దుఃఖాంతమే!

తప్పు ఎవరిదో నిర్ణయించలేకపోయాను. పరిష్కారమార్గం సూచించినా రాజీ కుదర్చలేకపోయాను.

పాఠకులారా! మీరు చెప్పండి, 'తప్పు ఎవరిది?' ఇలాంటి పాత్రలు మీ ముందుకు వస్తే మీరేం నిర్ణయిస్తారు?

---



# పోటీ

## తులసీకృష్ణ

“‘పక్కింటి పిల్లలు చూడు, యెంత శుభ్రంగా వుంటారో! వీడో... రోజుకు మూడుసార్లు స్నానాలు చేయించినా మురికి మురికే... ఛీ! పాడు పిల్లోడు” అన్నది అమ్మ విసుగ్గా.

“పో! వెధవా ...పోయి, కాళ్ళు, ముఖం కడుక్కో పో” అని కసురుకున్నాడు నాన్న. ఆ ‘వెధవ’ కప్పటికి పదేళ్లొచ్చినాయి. తను స్నానంచేసి, తల దువ్వుకుని, శుభ్రంగా వుండి

పక్కింటి పిల్లల్తో ఆడుకుంటున్నప్పుడు చూస్తూవున్న అమ్మ, అదివరకూ అట్లానే అన్నది. 'శుభ్రం' అంటే యింకేమిటోనని ఆలోచించినాడు వాడు. తనకేసీ, వాళ్ళకేసీ చూసుకున్నాడు. నిజమే, వాళ్లు తనకంటే బాగున్నారు. ఖరీదైన బట్టతో కుట్టిన అందమైన చొక్కా, నిక్కర్లతో, కాళ్ళకు నిగనిగ మెరిసే చెప్పుల్తో వున్నారు. తన నిక్కరూ, చొక్కా, యెక్కడో వీధిలో పరుచుకున్న వాడిదగ్గర కొనుక్కొచ్చినాడు నాన్న. పండుగ మర్నాడేననీ, అందరూ పిల్లలకూ, పెద్దలకూ అన్నన్ని బట్టలు తెచ్చుకుంటుంటే, ఆ యేడెడు పిల్లవాడి కింకా బట్టలు తేలేదని అమ్మ గొడవపెడితే, టైలర్‌కు, కుట్టడానిక్కూడా టైంలేదు గనుక కుట్టినవే తెచ్చినాడు. అవీ తనకంటే పెద్ద సైజువి. పెరిగేవాడు కనుక, కొంచెం పెద్దవైతేనే మంచిదనీ డబ్బు దండుగ కాదనీ అన్నాడు. ఆ నిక్కరు నడుము దగ్గర నిల్చోకుండా జారిపోతోంది. నడుముకు పెట్టుకోడానికి బెల్టుకావాలన్నాడు వాడు. వాళ్ళ నాన్న, నల్లని తోలుబెల్టు కొని తెచ్చినట్లూ, అది పెట్టుకుని అందరికీ చూపినట్లూ యెన్నోసార్లు వూహించుకున్నాడు. ఒకరాత్రి నిద్రలో, అదే కల గూడా వచ్చింది. అయినా ... నాన్న డబ్బుపెట్టి కొని బెల్టు తేలేదు డబ్బుతో అవసరం లేకుండా నిక్కరు సమస్య తేల్చేసినాడు.

"వాడి కెట్లాగూ మొలతాడుంది కదా, అదే నిక్కరుపైన వేసుకుంటే సరి పాయె ... మళ్ళీ బెల్టుకు రూపాయ దండగ." అంతటితో వూరుకోలేదు. 'రూపాయపెట్టి తెచ్చినా ఆ ముండా బెల్టు లుండవనీ, వూరికే పుటుక్కున తెగిపోతాయనీ అన్నాడు. బెల్టు తేక పోవడమేగాక, ఆ పిల్లవాడి బెల్టు కలల్ని గూడా పుటుక్కున తెంచేసిన వాడాయెను. నిక్కరు జారినప్పుడల్లా, మొల్తాడు పైనవేసుకోరా వెధవా !' అనరిచేవాడు పైన.

పక్కింటి పిల్లలు శుభ్రంగా వుండడాని క్కారణం, వాళ్ళకు సరిపడిన అందమైన బట్టల్లో వుండటం అని, ఆలోచిస్తే... అప్పటికే తట్టింది వాడికి. చెప్పులు కూడా లేవు తనకు. వీధిలోకి దిగితే దుమ్ము అవుతుంది మరి! శుభ్రంగా వుండట మెట్లా ?

"ఒరే ... మొద్దువెధవా ' రవిని చూడు. ప్రతీ సబ్జెక్టులో యెనభై, తొంభై మార్కులు తెచ్చుకున్నాడు. నీకు దేంట్లోనూ ముప్ఫయి దాటలేదు. వాడిని చూసన్నా తెలివి తెచ్చుకోకూడదూ !" అన్నాడు మున్సిపల్ హైస్కూల్ టీచర్ కనకరాజు. అప్పటికి 'మొద్దు వెధవ'కు పదిహేనేళ్ళు వచ్చినయి. ఎంత మొద్దు వెధవయినా, వాడికి, రవికన్ని మార్కు లెట్లా వస్తున్నాయో అది తెలుసును. అతను,




కనకరాజుసార్ కాడికి ప్రైవేటుకు పోతాడు. తను, నెలకు పదిరూపాయ లిచ్చి పోలేడు."

"యూజ్ లెస్ ఫెలో ... యీ అప్లి కేషన్‌లో యిన్ని తప్పులేమిటి ? ఆ పక్కసీటు మూర్తినన్నా చూసి నీట్‌నెస్ నేర్చుకోకూడదూ!" అంటున్నాడు భారత్ ఫర్టిలైజర్స్ కంపెనీ డైరెక్టర్ పద్మనాభం, 'ఫ్యూన్'తో ఫలానా అతన్ని పిలపమని చెప్పి. ఆ 'యూజ్ లెస్ ఫెలో' కప్పటికి ముప్ఫయ్యేళ్లు దాటి నాయి. సమాజం, జీవితం, చాలాభాగం అర్థమైపోయింది. పక్క సీటు మూర్తికి, డైరెక్టర్ పద్మనాభంకి చాలాసార్లు డిన్నర్లు యివ్వగల స్థోమతవుంది. 'ఆ యెదురింటాయన జీతం మూడొంద లట ! అయితేనేం వాళ్లెంత దర్జాగా వున్నారో ! మనమున్నాం...కడుపుకూ లేక, కట్టుకోనూలేక. పెండ్లాం, పిల్లల్ని సాకలేకపోతే, యెందుకొచ్చిన పిల్లలు? యెందుకొచ్చిన మొగుడు ?'—దాంపత్యం రాపిడికి అప్పటికే చాలా అరిగిపోయిన పెండ్లామంటున్నది.

* * *

నారాయణ చేత్తో యేదో పత్రిక పట్టుకుని కూర్చున్నాడు. అతని కళ్ళు పత్రికను చదవడం లేదు. అందులో కథల పోటీ, ప్రకటన పైనించి కిందిదాకా చూస్తోన్నాయి. ఇతర నిబంధనలన్నీ మామూలుగానే వున్నాయి. ఆ పోటీ కూడా యెప్పుడూ జరిగేదే. అయినా... యెప్పటికప్పుడు ఆ ప్రకటన చూసి నప్పుడల్లా యేదో సంచలనం. ఒక్క... చిన్న కథకు రెండువేల రూపాయలు !

రెండువేల రూపాయలు యెన్ని వందల చిన్న అవసరాల్ని (తన పాలిటికి బ్రహ్మాండమైన) తీరుస్తాయో! ఆ రెండు వేలరూపాయల బహుమతొచ్చే కథ రాయగలిగితే! తనిప్పుడు మంచి కథ రాయడంకన్నా, ఆ బహుమతొచ్చే కథ రాయడం ముఖ్యమన్నది, పదే పదే మనస్సును కొరుకుతున్నది. కానీ రాయ లేడు. రెండువేలరూపాయల ఖరీదుచేసే కథ, లేకపోతే అంతకన్నా విలువైన కథ రాయగలడేమో కానీ, ఆ రెండు వేల బహుమతొచ్చే కథ రాయలేడు. తన అనుభవంలో, అవగాహనలో యెక్కడా అందని, 'ఆ కథను వెతికి పట్టుకోలేడు.

చిన్నప్పుడు ... పక్కింటి పిల్లలకు తెచ్చినట్లు మనం మన పిల్లలకు బట్టలు తేలేమని తెలిసినా, అది దాచిపెట్టుకుని, తనను పక్కింటి పిల్లల్తో పోటీకి తోసి నారు తల్లీ దండ్రి! ఈ కథల పోటీ వాళ్లు, యెందరు పోటీలో పాల్గొన్నా, యెవరెంత మంచికథ రాసినా, తమకు నచ్చిన కథకుమాత్రమే బహుమతిస్తా మన్న సంగతి అడుగు నుంచేసి, డబ్బు క్రవీపునపెట్టి 'పోటీ'లోకి తోస్తు న్నారు. ఎంత గొప్ప బహుమతైతే, అంత పొడుగాటి, బలమైన కర్ర అన్న మాట. తన దగ్గరికి ప్రైవేటుకు రాలేదన్న అక్కసుతో, ఆ 'రవి'తో పోటీకి రమ్మని సవాల్ చేసినాడు కనకరాజు టీచర్. అట్లానే డైరెక్టర్ పద్మనాభం... పెండ్లాం... అంతా పోటీ పెట్టి పొడిచేవాళ్లే! నిజానికి ... పోటీ బాధ పోటీల్లో పాల్గొనడంలో లేదు, పోటీలో పాల్గొనలేకపోవడంలో వుందేమో! ఆ బాధ చెప్పుకుందామని యీ రచనని ఆధారంచేసుకుంటే యిక్కడా పోటీ బాధ. తనకులేని అవ కాశాలన్నిటిని యెత్తిచూపుతూ, వున్న ఒక్క అవకాశాన్నీ నొక్కిపెడుతూ... యిక్కడా పోటీ! తనకున్న అవ కాశాల్నీ, అభిరుచుల్నీ, యెవరూ లెక్క లోకి తీసుకోడంలేదు. నారాయణకు నవ్వొచ్చింది. నవ్వులోనే కళ్లు చెమ్మ గిల్లినాయి. కథల పోటీ ప్రకటన కాగి తాన్ని, నలిపి పక్కకు విసిరికొట్టి కళ్ళు మూసుకున్నాడు. అయినా... కథల పోటీ ప్రకటన రెండంకె, మూడుసున్నాలతో చుట్టూ తిరుగుతూ నారాయణ మెదడును నలుపుతూనేవుంది.






"మీ పేరు?"

"వాహినీ."

"మీ వారి పేరు."

"నిరంజన్రావు."

"చనిపోయి ఎన్నాళ్ళయింది?"

"మూడు సంవత్సరాలు."

"పిల్లలా?"

"ఊహూఁ...లేరు."

"ప్రస్తుతం ఎక్కడుంటున్నారు?"

"రాజమండ్రి. మా పుట్టింట్లో ఉంటున్నాను."

"మీ నాన్నగారేం చేస్తుంటారు."

"ఆయన లేరు. బ్రతికున్నప్పుడు బ్రతకటంకోసం, మమ్మల్నందర్నీ బ్రతికించటంకోసం ఏదో చేసేవారు. ఓ ఉద్యోగం అంటూ స్థిరంగా ఏదీ చేయలేదు. కొన్నాళ్ళు పత్రికల్లో బొమ్మలు గీసేవారు. తర్వాత కొద్ది రోజులు జ్యోతిష్యం చెప్పారు. మరి కొన్నాళ్ళ ప్రింటింగ్ ప్రెస్‌లో కాంపోజిటర్‌గా చేశారు. అడపాదడపా కథలు వ్రాసేవారు."

"మరి... మీ అమ్మగారు."

"మున్సిపల్ స్కూల్లో టీచర్‌గా చేస్తుండేది. నాన్నగారు పోయాక గుండె జబ్బు వచ్చింది. డాక్టర్లు 'రెస్టు' తీసుకోవాలన్నారు. 'రెస్టు' తీసుకోవాలంటే అంచరం పస్తులుండాలి. అందుకనే, అమ్మ డాక్టర్ మాటని పెడచెవిని పెట్టింది. ఫలితంగా గుండెజబ్బు ఎక్కువైంది. తప్పనిసరిగా ఉద్యోగం మానేసింది. అప్పటికి నేను ఎస్సెల్సీ పూర్తిచేసి ప్రైవేట్ పరీక్షలు పాసయ్యాను. ఉద్యోగమైతే దొరలేకదు కానీ కొన్ని 'ట్యూషన్లు' కుదిరాయి. పి.యు.సి.తో చదువాపేసిన తమ్ముడు పేపర్లిచ్చి పాలసీసా లిచ్చి ఏదో కొంత సంపాదిస్తుంటాడు. ముగ్గురు చెల్లెళ్ళు, నేను, తమ్ముడు...అమ్మ...గుండె జబ్బు... మందులు... వీటన్నిటికీ సంపాదన సరిపోయేది కాదు. బలమైన తిండి...సరైన మందులు లేక అమ్మ గుండె జబ్బుని జయించలేకపోయింది. ఆమె కూడా పోయి సంవత్సరం అవుతోంది." చెప్పటం ముగించి చేతిరుమాలతో కళ్ళు వత్తుకుంది వాహిని. వింటున్న మాధవరావుగారి కళ్ళు చెమర్చాయి. మనసు ఆర్ద్రమైంది.

"ఇవన్నీ ఇంటర్వ్యూకి సంబంధించిన ప్రశ్నలు కాకపోయినా అడిగి నీ మనసుకి బాధ కల్గించినట్లున్నాను. ఏమీ అనుకోకు తల్లీ. నాకూ నీలాటి ఓ అభాగ్యురాలు...కూతురు ఉంది. పోతే నీకంటె కొంచెం అదృష్టవంతురాలు. ఆమెకి పుట్టింటి బాధ్యతల్లేవు. పెళ్ళయిన మూడవనాడు ... స్నానానికి కృష్ణకి వెళ్ళిన అల్లుడు కాలుజారి మునిగి పోయాడు. ఏమీ రుచిచూడకముందే ఆమె వివాహజీవితం ముగిసింది. తీసుకువచ్చి కాలేజీలో జాయిన్ చేశాను. ఎమ్.ఏ. చేసి ఇప్పుడు వైజాగ్‌లో లెక్చరర్ చేస్తోంది. మళ్ళీ పెళ్ళి చేయాలని ప్రయత్నించాను. కాని... అమ్మాయే ససేమిరా అంటోంది. వీరేశలింగంగారి శిష్యుడుగా ఒకప్పుడు ...ఎన్నో వితంతు వివాహాలకి పెద్దగా నిలిచాను. వేదిక లెక్కి ఉపన్యాసాలిచ్చాను. కాని ... అవన్నీ ఆచరణలో పెట్టలేని అసమర్థుణ్ణయిపోయాను. ఇంట్లో వయసులో ఉన్న విధవరాల్ని పెట్టుకుని 'ఆదర్శం, అభ్యుదయం' అంటూ నేను సభల్లో గొంతు చించుకుంటే ఏం ప్రయోజనం తల్లీ ... అందుకే అన్నీ మానేశాను.

'.........'

"అయినా అలవాటయిన ప్రాణం... మీలాటివాళ్ళని చూడగానే కరిగిపోతూ ఉంటుంది. ఏదో ... నాకు అధికారం ఉండబట్టి మీకింత నీడ చూపించి తృప్తిపడ్తుంటాను", కళ్ళజోడు తీసి కనుకొలకుల్లో నిలిచిన నీటిని పంచె

చివర్లతో తుడుచుకుని 'కాలింగ్ బజర్' నొక్కాడు మాధవరావు.

''ఏమిటో నా గొడవతో నిన్ను చాలా సేపు కూర్చోబెట్టేశాను'' అంటూ లోపలికి వచ్చిన ప్యూనువైపు తిరిగాడు.

"ఇంకెంతమంది ఉన్నారు బయట?"

''ఇంకెవరూ లేరండీ!''

"సరే, ... సాయంత్రంలోపల 'రిజల్ట్' చెప్పుతామని కాండిడేట్స్ నందర్నీ పంపించేసి, రెండు కాఫీలు పట్రా."

''అలాగే సర్". వినయంగా సలాం చేసి బయటకు వెళ్ళిపోయాడు శేషయ్య.

''నేను శెలవు తీసుకుంటానండీ!''

"ఉండమ్మా, కాఫీ త్రాగి వెళ్దువు గానీ."

''ఇప్పుడెందుకు సార్.'' ఇబ్బందిగా మళ్ళీ కుర్చీలో కూర్చుంది వాహిని.

''నా కూతుర్లాటిదానివి. కాఫీ త్రాగితే తప్పేముందమ్మా ! అన్నట్లు ఇప్పుడు రాజమండ్రి వెళ్ళిపోతావా ? లేక బంధువులున్నారా ఈ ఊళ్లో."

"ఎవరూ లేరండీ. 'సర్కార్'కి వెళ్ళిపోతాను," అంది కదుల్తున్న స్వింగ్ డోర్ కేసి చూస్తూ. కాఫీలు తీసుకుని శేషయ్య వచ్చాడు.

కాఫీల్తోపాటు రెండు గ్లాసుల మంచి నీళ్ళు కూడా పెట్టి బయటి కెళ్ళి పోయాడు.

''ఎప్పుడు జాయినవుతావు మరి !'' ఆమెకో కప్పు అందిస్తూ ప్రశ్నించాడు మాధవరావు.

"కొంచెం టైమ్ కావాలి సార్. రూమ్ - అదీ చూసుకుని..."

"అలాగే, ఈ నాలుగురోజులు ఆగి ఏకంగా ఫస్టునుండి జాయినవచ్చు.''

కాఫీ రెండు గుటకల్లో త్రాగేసి ఖాళీ కప్పు టేబుల్ మీదుంచాడు. ఆయన కెదురుగా ఎంగిలి కప్పు ఉంచటం బావుండదని తన కప్పు కిటికీలో పెట్టింది వాహిని.

''థాంక్స్ సార్' హృదయంలో నిండుకున్న కృతజ్ఞతని చూపుల్లో నింపి మరోసారి నమస్కరించింది.

''వెళ్ళిరామ్మా, రైలుకి టైమవుతున్నట్లుంది" వాచ్ చూసుకుంటూ అన్నాడు మాధవరావు. వాత్సల్యం కురుస్తున్న ఆయన కళ్ళలోకి ఓసారి చూసి మెల్లగా బయటికి నడిచింది వాహిని.

* * *

''అక్కయ్యగారికి సుస్వాగతం.''

గడపలోనే ఎదుర్కొని స్వాగతం పలికిన తమ్ముడివైపు నవ్వుతూ చూసింది వాహిని.

"ఎందుకో... ?''

''అది నీ నోటిద్వారా వింటేనే అందంగా ఉంటుంది..."

"వాడి మాటలకేంగాని, నువ్వు రా అక్కా. కాఫీ పెట్టివ్వనా ?'' రాజు మాటలకి అడ్డుతగిలింది రజని.

''ఇవ్వనా, ఏమిటి. అర్జంట్‌గా ఓ రెండు కప్పులు పట్రా. ముందు నువ్విలా కూర్చోవే అక్కా'', అంటూ హడావుడిగా కుర్చీలో బట్టలవీ తీసి ఖాళీచేశాడు రాజు.

"పాపం ... నీవేం శ్రమపడ్డావు నాయనా?' అంది కావేరి కాళ్ళు కడుక్కోటానికి నీళ్ళు తీసుకొస్తూ.

"శ్రమపడకుండానే చెప్పేశాను. అక్కయ్య ఇంటర్‌వ్యూకి వెళ్ళకపోయినా ఉద్యోగం వచ్చేది ఖాయమని !''

"అక్కయ్య ఇంటర్‌వ్యూకి వెళ్ళిన ప్రతిసారీ 'ఇది గ్యారంటీ' అంటూనే ఉంటావు. దీంట్లో నీ గొప్పేముంది?"

అన్నా, చెల్లెళ్ళ సంభాషణ వింటూ కాళ్లు, ముఖం కడుక్కుని వాలుకుర్చీలో చేరగిలబడింది వాహిని.

''వసంతేది రజనీ !'' చెల్లెలి చేతి కాఫీ గ్లాసందుకుంటూ అడిగింది.

''ఫ్రెండ్‌తో పిక్చర్‌కి చెక్కేసింది. అదో...సినిమా పిచ్చిది. కరువు కాటకాలతో దేశం అల్లాడిపోతున్నా దానికి రోజుకో సినిమా చూడనిస్తే చాలు. అసలు వసంతకి ఏ డైరక్టర్నో, యాక్టర్నో ఇచ్చి చేస్తే సరిపోతుంది. ఇకపోతే కావేరికి కలెక్టరు మొగుడు, రజనికి డాక్టరు మొగుడు ... మరి నీకెలాటివాడు కావాలక్కా...'' అన్నాడు తాను కూడా కాఫీ తెచ్చుకుంటూ రాజు.

''ఏరా...మొగుళ్ళని కూడా రేషను కార్డు మీదిస్తున్నా రేమిటి ? నవ్వుతూ అంది వాహిని. కాఫీగ్లాసు ప్రక్కన పెట్టి పగలబడి నవ్వాడు రాజు "

"భలే జోక్ 'కట్' చేశావక్కా" అంటూ మళ్ళీ మళ్ళీ నవ్వసాగాడు. కావేరి, రజనికూడా అన్నగారితోపాటు పకపక నవ్వారు. షుమారు మూడున్నర సంవత్సరాల తర్వాత అనుకోకుండా ఆ యింట్లో వాతావరణం ఆహ్లాదకరంగా మారిపోయింది.

''కబుర్లు చాలుగానీ సామాను సర్దటం మొదలుపెట్టండి. అన్నీ రెండురోజుల్లో సర్దుబాటుచేసుకోవాలి, రాజూ... నువ్వు రేపక్కడికి వెళ్ళి ఓ రెండు గదుల పోర్షను చూసిరా''. తర్వాత జరగబోయే కార్యక్రమానికి నాంది పలికింది వాహిని.

''ఓ.కే. అవన్నీ నా కొదిలేయ్. మరి నా కాలేజీ..."

"చూద్దాం. సీటు దొరకాలి కదా ! లేకపోతే నెక్స్ట్ ఇయర్ చదువుదువు గాని ''

''మరి నేను' అంది కావేరి. ఓణీ కొసల్ని మెలిపెడ్తూ చదువుపైన ఆసక్తి ఉన్నా పరిస్థితుల్నిబట్టి ఎనిమిదవ తరగతితో చదువుకి ఫుల్‌స్టాప్‌పెట్టి రెండేళ్లుగా ఇంట్లోనే ఉంటోంది కావేరి. అప్పటికే పదవ తరగతి రెండుసార్లు ఢింకీలు కొట్టిన వసంతని పరీక్ష ఫీజులు




మళ్ళీ మళ్ళీ కట్టలేక మానిపించేశారు. ఇక రజనికి చదువు ఏడవతరగతి దగ్గరే ఆగిపోయింది. వంట పని, ఇంటి పని బుద్ధిగా చేసుకుపోతుంది.

"భగవాన్! ఇకనైనా ఈ జీవితాల్ని ఒక గాడిలో పడనీ. అమ్మా నాన్నా నామీద పెట్టుకున్న ఆశల్ని నెరవేర్చ గలిగే శక్తిని, మనస్థైర్యాన్ని ప్రసాదించు నాకు. బంధాలు తెంచుకుని వాళ్ళు వెళ్ళిపోయినా నాపైన ఉన్న బాధ్యతలు తప్పించుకోవాలనుకున్నా తప్పనివి. నేను వేయబోయే ప్రతి అడుగుకీ, చేయబోయే ప్రతి కార్యానికీ నీ చేయూత నివ్వు. నీతి ఏదో అవినీతి ఏదో నాకు తెల్సు. తెల్సి చేసిన తప్పు మహా పాపమంటారు. అలాటి తప్పు నేనేదైనా చేసి ఉంటే ఆ పాపం నన్ను పుట్టించిన నీకే చెందుతుంది. లేదా నా రాతనిలా వ్రాసిన బ్రహ్మదేవుడిదవుతుంది. అదీకాదంటే మమ్మల్నిలా ఏకాకిగా వదిలిపోయిన అమ్మా, నాన్న లదే...'

"అక్కా కాఫీ తాగు. చల్లారిపోతున్నాయి" తన గ్లాసు లోపలకి తీసుకువెళ్తూ అలసటగా కళ్లుమూసుకుని వరధ్యానంగా పడుకున్న వాహినిని వాస్తవానికి తెచ్చాడు రాజు. చటుక్కున లేచి కూర్చుని సగం చల్లబడిపోయిన మిగిలిన కాఫీ నోట్లో పోసుకుంది వాహిని.

* * *

"గుడ్ మార్నింగ్ సార్ !"

"రామ్మా. నీకోసమే చూస్తున్నాను. యిల్లదీ కుదిరిందా ?"

''ఆఫీసుకి దగ్గర్లోనే దొరికింది సార్. సదుపాయంగానే ఉంది. నిన్న సాయంత్రమే వచ్చాం.''

"మంచిదమ్మా. ప్యూను, నారాయణ మూర్తిని చూపిస్తాడు. ఆయన దగ్గర జాయినింగ్ రిపోర్టిచ్చాక రిజిష్టర్లో సంతకంపెట్టి నీ సీట్లోకి వెళ్ళు.''

''అలాగే సార్!'' వెనక్కి తిరిగింది వాహిని.

"చూడమ్మా..." ఏదో జ్ఞాపకం వచ్చినట్లు మళ్ళీ పిలిచాడు మాధవరావు. ముందుకేసిన రెండడుగులు వెనక్కి తీసుకుని ప్రశ్నార్థకంగా ఆయనకేసి చూసింది వాహిని.

''నీవేమీ అనుకోనంటే...'' సందిగ్ధంగా ఆగి ఆమె ముఖంలోకి చూశాడు.

"చెప్పండి సార్... మీ అమ్మాయి లాటి దాన్ని. ఏమనుకోటాని కేముంది?" చిన్నగా నవ్వింది.

"చూడు తల్లీ ... నీకీ ఉద్యోగం హైఫెఫ్ లేట్ నిరంజన్‌రావులా కాక డాటరాఫ్ రాజగోపాలంగానే భావించి యిచ్చాను. నేను ఫలానా మరణించిన వ్యక్తి భార్యను, అనే సంగతి పదే పదే పదిమందికీ జ్ఞాపకం చేసేలాగా ఎందుకుండాలి? మూన్నాళ్ళ ముచ్చటయి, ముక్కలైపోయిన గతాన్ని విస్మరించి ఈ రోజునుంచి నూతన జీవితాన్ని ప్రారంభించు. మూడువంతుల జీవితం ముందు ఉండగా గతించిపోయిన ఒక పంతు గురించి బాధపడటం అవివేకం.

''సార్...''

"అవును తల్లీ. అందుకే అల్లుడు పోయాక అమ్మాయి నుదుట కుంకుమ చెరపనీలేదు. కళ్యాణ తిలకం అరక ముందే వైధవ్యం చోటుచేసుకున్న ఆ ముఖం చూడాలంటే కన్న హృదయాల కెంతటి రంపపుకోతో ... అనుభవిస్తే గానీ తెలీదు. నిన్ను చూసినా నాకలాగే అనిపిస్తుంది. ఈ 'సిటీ' లో నీ గురించి పట్టించుకునే వాళ్ళుండరు. అలాంటప్పుడు భయపడాల్సిన పనేముంది. నీ కెలాటి అభ్యంతరం లేకపోతే! ...అదుగో...ఆ దేవుడి పటం దగ్గర కుంకుమ ఉంది. తీసిబొట్టుపెట్టుకో..."

''సార్...నేను ...నే...ను" ఆశ్చర్యంతో నోటమాటరాక తడబడింది వాహిని.

"నాకేం చెప్పద్దు తల్లీ. ముందు నే చెప్పినట్లు చేయి... కేవలం నామీదున్న గౌరవంతో! అంతే కానీ, ఉద్యోగానికి ఇది ఓ షరతు అని మాత్రం అనుకోవద్దు" మరి మాట్లాడడానికి అవకాశం యివ్వలేదు మాధవరావు. ప్యూనుకోసం కాలింగ్ బజర్ నొక్కాడు. వణుకుతున్న చేతుల్తో దేవుడికి నమస్కరించి కుంకుమ తీసి బొట్టు దిద్దుకుంది వాహిని.

''సార్'' అంటూ లోపలకి వచ్చాడు శేషయ్య.

"ఈమెని నారాయణమూర్తి దగ్గరకు తీసుకెళ్ళు", అంటూ వాహిని ముఖం లోకి నిశితంగా చూసి తృప్తిగా నిశ్వసించాడు మాధవరావు. తడబడుతున్న అడుగులతో శేషయ్యని అనుసరించింది వాహిని.

కాలప్రవాహం వేగాన్ని పుంజుకుని ఎత్తుపల్లాల్ని దాటుకుంటూ గలగల సాగిపోయింది. వాహిని మాధవరావు దగ్గర చేరి అప్పుడే నాలుగు సంవత్సరాలైంది.

"ఈ నాలుగు సంవత్సరాల్లో...నీ బాధ్యతల్ని ఎంతవరకు నెరవేర్చగలిగావమ్మాయ్ ?" ఓ రోజు వాహినితో తీరిగ్గా ప్రసంగంలోకి దిగాడు మాధవరావు.

"మీకు తెలియని దేముందిసార్ !" సిగ్గుపడ్తూ నవ్వింది వాహిని.

"ప్రశ్నకి ప్రశ్నతోనే జవాబు చెప్పి తప్పించుకుంటావు. మా రాగిణి కూడా అంతే" నవ్వుతూ టేబుల్ సొరుగు లాగి 'స్వీట్సు' బాక్సు బయటకు తీశాడు.

"అప్పట్లు నీకి విషయం చెప్పలేదు కదూ ? మా రాగిణి మళ్ళీ పెళ్ళిచేసుకోబోతోంది. కో-లెక్చరర్‌కి అన్నగారట. మూడేళ్ళనుంచి అమ్మాయి అంగీకారంకోసం వెయిట్‌చేస్తూ అలాగే ఉండిపోయాడట.

ఇన్నాళ్ళకి మనసు మార్చుకుని అతడి కోరికని మన్నించిందట. ఇద్దరం రెండు మూడురోజుల్లో వస్తున్నాం మీ దీవెనలకోసం అంటూ వ్రాసింది. సంతోషంతో నిన్నటినుంచి నాకు ఊపిరే ఆడటం లేదనుకో ! ఈ స్వీటు తీసుకో తల్లీ...ఇంద !" ఆమె చేతిలో స్వీట్సు పెట్టి కండువాతో కళ్లు తుడుచుకున్నాడు మాధవరావు.

"శుభవార్త చెప్పారు సార్. ప్రతిగా నేను కూడా మరో శుభవార్త చెప్తున్నాను." స్వీటు నోట్లో వేసుకుని హాండ్ బాగ్‌లోంచి కవర్లు తీసింది.

"ఏమిటమ్మా...అవి" కుతూహలంగా ప్రశ్నించాడు.

"మా చెల్లెళ్ళిద్దరి పెళ్ళిళ్ళు సార్. ఈ రెండూ శుభలేఖలు. ఇదేమో నా శెలవు చీటీ." ఓ పదిరోజులు లీవు కావాలి సార్, రేపట్నించి ! ఇంకా ఒక్కపనీ మొదలుపెట్టలేదు.

"తప్పకుండా తల్లీ. చల్లని వార్త చెప్పావు. మరి రాజు విషయం ఏమయింది ? బి.ఎ. రిజల్ట్సు వచ్చినట్లు ఎవరో అనుకుంటుంటే విన్నాను."

"అవును సార్. రాజు సెకండ్ క్లాసులో పాసయాడు. వాడికి కూడా మీరే ఏదో ఒక దారి చూడాలి."

"అలాగే చూద్దాం - నా సర్వీసు ఇంకా ఆరునెలలే ఉందన్న విషయం నీకు తెల్సిందే. ఈ లోపల ఇక్కడ

వేకెన్సీలు వచ్చే అవకాశంలేదు. మరో చోట ప్రయత్నిద్దాం."

''మీరెలా చెబితే అలా చేస్తాను. ఇంక వెళ్తాను సార్. పెళ్ళికి మీ అమ్మాయిని కూడా తీసుకురావాలి."

"తప్పకుండా. మరి...రెండు పెళ్ళిళ్ళంటున్నావు. కట్నాలెంతెంత ? డబ్బు ఎలా తెచ్చావు ?"

''మూడేసివేలు కట్నం ప్లస్ రెండు వేల లాంఛనాలు సార్. అన్నీ అందులోనే. రాజమండ్రిలో మా యిల్లు అమ్మేసాం సార్. ఎలాగూ మళ్ళీ అక్కడికి వెళ్ళేది లేదుకదా అని. పన్నెండు వేలు వచ్చాయి."

"మంచిపని చేశావు తల్లీ" అంటూ సొరుగులోంచి చెక్ బుక్ తీసి రెండు వేలకి చెక్కు వ్రాసి ఆమె చేతికిచ్చాడు.

"ఇవి ఉంచమ్మా. పెళ్ళంటే ఘాటలా. బోలెడు ఖర్చు ఉంటుంది. చిన్నదానివైనా పెద్ద బాధ్యతలు నెరవేరుస్తున్నావు. కన్నవాళ్లుంటే ఎంత సంతోషించేవారో !"

చెమర్చిన కళ్లు కర్చీఫ్‌తో వత్తుకుని మాధవరావుకి నమస్కరించి బయటికి వెళ్ళిపోయింది వాహిని.

రెండురోజుల తర్వాత ఓ సాయంత్రం వాకిట్లో నిలబడిన మనిషిని చూసి చేస్తున్న పని వదిలేసి బయటకు వచ్చింది వాహిని.

''మీరా...రండి సార్ లోపలకి."

''వద్దులేమ్మా...ఆఫీసునుంచి వెళ్తూ నీకో మాట చెప్పి పోదామని వచ్చాను."

"మీరెందుకు సార్, శ్రమపడి రావటం. కబురుచేస్తే నేనే వచ్చేదాన్నిగా."

ముందిలా కూర్చోండి సార్ ! కుర్చీ దులిపి తెచ్చి అరుగుమీద వేసింది.

ఆఫీసు విషయం కాదు. "అమ్మాయి ప్రయాణం ఆగిపోయిందట. నన్నే రమ్మని వ్రాసింది. కొన్నాళ్లు విశ్రాంతిగా కూడా ఉంటుంది. రేపు ఎక్స్‌ప్రెస్‌కి బయల్దేరి రండి. స్టేషనుకి వస్తాను అని వ్రాసింది."

"మా యింట్లో పెళ్ళికి లేకుండా వెళ్ళిపోతారా సార్ ?"

"పరిస్థితి అలా వచ్చింది తల్లీ. అమ్మాయి ఎదురు చూస్తూంటుంది. వెళ్ళక తప్పదు. నీ పెళ్ళి నేను దగ్గరుండి చేస్తాను. సరేనా ?"

"పోండి సార్. నాకు పెళ్లేమిటి ?"

"ఒకప్పుడు మా అమ్మాయి కూడా ఇలా అన్నదే ! నవ్వి కుర్చీలోంచి లేచాడు. మరి వెళ్ళిరానా తల్లీ. చెప్పకుండా వెళ్ళిపోతే బాధపడ్తావని ఇలా వచ్చాను ''

''మంచిది సార్. మీరు వెళ్ళేదికూడా శుభకార్యానికే గదా ! వెళ్ళి రండి.''

గేటువరకు వెళ్ళి వీడ్కోలిచ్చింది వాహిని. అరుగువరకు వచ్చి రిక్షా ఆగిన శబ్దం విని తిరిగి చూసింది. రిక్షాలోంచి



ఊగిన యువతిని చూడగానే మనసులో ఆనందలహరులు ఎగసిపడ్డాయి.

"హాయ్ ... నీలూ! ఎన్నాళ్ళకి చూశానే..." ఒక్క పరుగున ఎదురేగి నీలవేణిని రెండుచేతుల్తో చుట్టేసింది.

"రైల్లో చచ్చీ చెడీ వచ్చాను. నీ ఘాటు ప్రేమకి తట్టుకోలేనే చెలీ. ముందు ఓ కప్పు కాఫీ నా ముఖాన పోసి స్నానానికి నీళ్ళు పెట్టు."

"కట్టుకున్న మొగుడిలా ఏంపోజు... ఆ పని నాదికాదు కాఫీ కలపటం రజని వంతు. అందించటం కావేరివంతు. మిగిలిన అతిథి మర్యాదలు వసంత చూసుకుంటుంది."

"మరి ... తమరివంతు. బాగా తిని లావెక్కటమా ? కొంటెగా చూసింది స్నేహితురాలివైపు.''

''ఊఁ ... చాల్లే. అక్కడి కబుర్లేమిటి ?''

"ఏం లేవు. పెళ్ళి పెద్దవి... నువ్వు చెప్పు. అన్నట్లుగా మీ 'వీరేశలింగం' గారేమంటున్నారు.''

"పోవే ... ఆయన చాలా మంచి వారు."

''కాదని ఎవరన్నారు దేవీ ... చెప్పుము తక్షణమే వాని తల..."

"ఆపు తల్లీ. రైల్లో కూర్చుని జానపద కథలు చదివావేమిటి ! ముందీ కాఫీ సేవించి స్నానానికి పద!'' రజనీ బాత్‌రూమ్‌లో నీళ్ళున్నాయేయో చూడు. అబ్బ ... ఏమిటో ఇంతవరకూ ఒక్క పని పూర్తవలేదు. ఏది చేయాలో, ఎలా చేయాలో అంతా అయోమయంగా ఉంచనుకో !''

''ఆఁ...ఆదీ...అసలైన పెళ్ళి పెద్ద ఫోజు ఇప్పుడు పెట్టావు." నవ్వుతూ స్నానానికి లేచింది నీలవేణి."

*    *    *

పదిహేనురోజులుగా పడిన హడావుడి సవ్యంగా ముగిసింది. బంధువులు, ఎక్కడి వారక్కడ సర్దుకున్నాక విశ్రాంతికోసం, స్నేహితురాలితో తీరిగ్గా కబుర్లు చెప్పుకోవటం కోసమని రెండు రోజులపాటు శెలవు పొడిగించింది వాహిని. రజని, వసంత ఒక్కసారే వెళ్ళిపోవటంతో బోసిపోయినట్టున్న ఇంట్లో నీలవేణి ఉనికి ఆ లోటును కొంతవరకు కప్పిపుచ్చుతోంది. స్నేహితురాళ్ళిద్దరూ కొసరి కొసరి వడ్డించుకుంటూ తీరిగ్గా భోజనాలు ముగించి వరండాలో చాపలు పరుచుకున్నారు. కబుర్లలో మునిగిపోయి పోస్టుమాన్ గేటు తీసుకుని వచ్చిన సంగతే గమనించలేదు.

'టెలిగ్రాం' - అరుగుదగ్గర నిలబడి కేకవేశాడు పోస్టుమాన్. ఒక్క అంగలో వెళ్ళి సంతకంచేసి అతడి చేతిలో కాగితం అందుకుంది వాహిని.

"మాధవరావు సీరియస్. స్టార్ట్ యిమ్మిడియట్లీ."

''ఏమిటే అది'' అంటూ వచ్చిన నీలవేణి చేతిలో కాగితం పెట్టి నేలమీద కూలబడిపోయింది వాహిని. ఆ రోజే యిద్దరూ విశాఖ చేరుకున్నారు. అప్పటికే అంతిమ క్షణాల్లో ఉన్న మాధవరావు వాహినిని గుర్తించలేకపోయాడు. తర్వాత కొద్దిక్షణాలకే ఆయన ప్రాణం అనంతంలో కెగసిపోయింది. తండ్రి శవంమీదపడి రోదిస్తున్న రాగిణి భుజం మీద ఓదార్పుగా చెయివేసింది నీలవేణి. ఆ యిద్దరికీ కో-లెక్చరర్స్‌గా మంచి స్నేహం ఉంది. నీలవేణిద్వారానే మాధవరావు గురించి వాహిని ఉద్యోగానికి ముందే తెల్సుకుంది !"

"చాలాకాలంగా ఆయనకి హృద్రోగం ఉంది. కూతుర్ని నవవధువుగా చూశాక ఆ సంతోషంలో 'హార్ట్‌ఎటాక్'వచ్చింది.

ఉధృతంగా రావటంతో తట్టుకోలేక పోయారు." ఇది డాక్టరుద్వారా మాధవ రావు మరణం గురించి సేకరించిన సమాచారం. తడిసిన కళ్ళు తుడుచుకుని తిరుగు ప్రయాణమైంది వాహిని. అప్పటికే రెండురోజు లుండిపోయింది. బయల్దేరే ముందు రాగిణి గదిలోకి వెళ్ళింది."

"చూడండి, మిమ్మల్నిదే మొదటిసారి చూడటం. నాలుగు సంవత్సరాల క్రితం కాబోలు...మా నాన్నగారు మీ గురించి వ్రాశారు. ఆయన మీకు చేసిన సహాయానికి సంతోషించాను. మీ గురించి ఓ వాక్యం వ్రాయనిదే ఉత్తరం పూర్తి చేసేవారు కాదాయన. స్పృహ వచ్చిన కాసేపట్లో మిమ్మల్ని పదిసార్లయినా అడిగారు. ఇదుగో ఈ పదివేలు... నాన్నగారి అంతిమ కోరిక ... కాదన కుండా తీసుకోండి" దుఃఖంనుంచి తెప్పరిల్లి అంది రాగిణి.

"వద్దండీ... ఇప్పటికే మీ నాన్నగారి కెంతో ఋణపడి ఉన్నాను."

"ప్లీజ్ ... నాన్నగారి తృప్తికోసం తీసుకోండి." విచారంలో ఉన్న ఆమెని మరి విసిగించటం భావ్యంకాదని చెక్కు అందుకుని బాగ్‌లో పెట్టుకుంది వాహిని. స్టేషనువరకు వెళ్ళి స్నేహితురాలికి వీడ్కోలిచ్చింది నీలవేణి.

* * *

మాధవరావు కర్మకాండలన్నీ యధావిధిగా నెరవేర్చింది రాగిణి. వచ్చిన బంధువులందరూ ఎక్కడి వారక్కడ సర్దుకున్నాక రస వెలో కూర్చుని తండ్రి స్మృతుల్లో మునిగి పోయింది రాగిణి. పనిపిల్ల తెచ్చిన కవర్ని అన్యమనస్కంగానే అందుకుని చింపింది.

"రాగిణిగార్కి,

కుటుంబ పరిస్థితులకి, దారిద్ర్యానికి తలవొగ్గి మీ నాన్నగార్ని ఘోరంగా వంచించాను. నీలవేణిద్వారా ఆయన వితంతువుల్ని ఆదరిస్తారని తెల్సి... ఇంతవరకు ఏ కన్నెపిల్లా చెప్పని అబద్ధం చెప్పాను. నాకు పెళ్ళయిందనీ ...భర్త చనిపోయాడనీ..."

అప్పట్లో నేనున్న పరిస్థితుల్లో... బ్రతుకుతెరువుకోసం ... ఆ వేషంవేసి ఆయన్ని వంచించాను. నేను చేసింది పాపం అని తెల్సు. ఈ పదివేలతో ఆ పాపభారాన్ని మరింత పెంచలేను ! మీ రిచ్చిన చెక్కును ఈ కవర్లోనే పంపి స్తున్నాను. నేను చేసిన తప్పుని భగ వంతుడే కాదు...స్వర్గాన ఉన్న మాధవ రావుగారు కూడా క్షమించరు. కనీసం మీరైనా మన్నించగలిగితే ధన్యురాల్ని! కోటి విద్యలూ, కూటి కొరకేనని రెండో తరగతిలో కాపీ వ్రాసే ఉంటారు. అంతకుమించి ఏ దురుద్దేశం నాలో లేదు. ఈ విషయం నలుగురికీ చెప్పి నా బ్రతుకుని నవ్వులపాలు చేయవద్దని అడిగే అధికారం నాకు లేదు. మీరేం చేసినా శిక్షార్హురాలినే !

ఇంక సెలవు,
వాహిని.



# [illegible]ళ్ళలో తీయనిది

కప్పగంతుల మల్లికార్జునరావు

తన మెళ్లో తాళికట్టేనాటికే రంగనాధానికి మరో పెళ్ళయిందని విశాలాక్షికి తెల్సు. అయితే ఆ మొదటిభార్య అంటే రంగనాధానికి 'అంత ప్రేమని మాత్రం తెలీదు. యిద్దర్నీ సమానంగా మాచుకొంటాడనుకొంది.

రంగనాధం రోజులో ఎక్కువ భాగం పెద్దభార్యదగ్గరే గడిపేవాడు. పొద్దున తొమ్మిదిన్నరకు వెళ్తే మళ్ళీ రాత్రి తొమ్మిదిన్నరకే అక్కడినుంచి వచ్చేవాడు.

యింతకీ ఆ పెద్దభార్య పేరు ఆఫీసు!

అదేంచిత్రమో వుద్యోగంలో చేరిన మర్నాటినుంచే రంగనాధానికి ఆఫీసుతో గొప్ప అనుబంధం ఏర్పడింది. క్రమంగా రంగనాథం లేకపోతే యిక ఆ ఆఫీసు నడవదా అన్నంత స్థాయికి పోయింది.

ఆఫీసర్లు ఎందరన్నా మారనియ్యిగాక అందరూ రంగనాధాన్ని గౌరవించాల్సిందె. ఆయన సలహా లేనిదే ఎవరూ ఏ పనీ చేసేవారు కాదు.

అందుకు మొదటికారణం, ఆయనకు పనిమీద వున్న శ్రద్ధ. అందరి పనుల్నీ నెత్తినేసుకు చేస్తాడు. కిందివాళ్ళకి ఏంచేయాలో తెలీకపోయినా, రాసే రీతిక లేకపోయినా, ఫైలు బల్లమీద పెడితే చాలు దాన్ని కూలంకషంగా చదివి సారం పిండి ఔషధంగా తయారుచేసేవాడు.

అంతేకాదు. రంగనాధానికి రూల్సు అన్నీ నాలికమీద వుంటాయి. ఏ రూలు ఎలా యింటర్‌ప్రెట్ చేయాలో ఆయనకి తెల్సినట్టు మరెవరికీ తెలీదు.

మూడోదీ ముఖ్యమైనదీ—రంగనాథం నమ్మకస్తుడు. యింటా ఆఫీసులో బయటాకూడా నికార్సయిన మనిషిగా పేరుపొందేడు. జీతంరాళ్ళు తప్ప 'మంత్రపుష్పా'ల రుచి ఆయనకి తెలీదు. మరొకరి సంగతి పట్టించుకునే స్వభావం కాదు ఆయనది. అందుకే ఆయనకు 'అజాతశత్రువు' అన్న బిరుదుకూడా యిచ్చారు.

పోనీ ఆయన ఎప్పుడూ డబ్బుకు కటకట లాడుతూ వుండేవాడా అంటే అదీలేదు. ఆయనకు అప్పుచేసే అలవాటు లేదు. ఆఫీసులో ఎప్పుడూ ఎవరితోనూ తన ఆర్థికస్థితినిగురించి మాట్లాడేవాడే కాదు. నిజానికి ఆయన డబ్బు కోసం ఏనాడూ బాధపడలేదు. అదే అందరికీ ఆశ్చర్యం! అయితే ఆ కిటుకు ఆయనకే తెల్సు. ఆయన చిన్నతనం నుంచీ తన అవసరాలని, కోర్కెల్ని అవధుల మేరకు సరిపుచ్చుకోటం నేర్చుకొన్నాడు. లేనిపోని ఆశల్ని పెంచుకోడు. ఆడంబరాలకు ఆయన ఆమడ దూరం. అందుకే ఆయన నైతికంగా దిగజారకుండానే వున్నంతలో సుఖంగా గుట్టుగా సంసారాన్ని నెట్టుకు రాగలిగేడు

**విశాలాక్షి**, పెళ్ళయిన కొత్తల్లో ఆయన పద్ధతులకి కాస్తంత బాధపడ్డమాట నిజం. సాధింపులతో ఆయన్ని మార్చాలని ప్రయత్నించిందికూడా.

"ఎప్పుడూ ఆఫీసూ, ఫైళ్ళు యిదేనా లోకం? అలాంటివారు నన్నెందుకు పెళ్ళిచేసుకొన్నారు? లోకంలో ఎందరు ఉద్యోగాలు చేయటంలేదు. అందరూ మీలాగా ఆఫీసులకు అతుక్కు-పోయారా?"

"ఆ పక్కింటి పద్మావతికి వాళ్లాయన సంవత్సరానికి మూడు చీరెలు కొంటాడుట. మొన్న నెక్లెస్‌కూడా చేయించాడుట. మీరూ వున్నారు.

ఎందుకూ? వొక్క అచ్చటాముచ్చటా లేదుకదా? యివాళంటే యిద్దరమే కనుక జీతంరాళ్లు తిండికన్నా సరిపోతున్నాయి. రేపు నలుగురు పిల్లలు పుడ్తే..."

నలుగురు కాదుకాని రంగనాథం ముగ్గురు పిల్లలతండ్రి అయ్యాడు. యిద్దరు కొడుకులు, వాళ్ళమధ్య వో కూతురు.

అయినా రంగనాథం పద్ధతిలో యిసుమంతైనా మార్పులేదు. కాగా ఆయన వ్యక్తిత్వంలో మహత్తేమిటో విశాలాక్షి క్రమంగా ఆయన్ని అనుసరించిన దవటం నేర్చుకొంది. యిద్దరూ కలసి పిల్లల్ని అలాగే పెంచి పెద్దచేసారు.

పెద్దకొడుకు రవిశంకర్ యిప్పుడు ఆ వూళ్లోనే మ్యునిసిపాలిటీలో హెల్తు యిన్స్పెక్టర్. అతనికి యిద్దరు పిల్లలు. గుణంలో అచ్చం రంగనాధానికి నకలు రవిశంకర్.

కూతురికి 'గంతకు తగ్గ బొంతను' చూచి పెళ్ళిచేసి అత్తగారింటికి పంపేడు. చిన్నకొడుక్కి యీ మధ్యే హైదరాబాదులో గుమాస్తా వుద్యోగం వచ్చింది.

దాదాపు ముప్ఫైమూడేళ్లు కాపురం చేసిన పెద్దభార్యకు రంగనాథం విడాకులివ్వాల్సిన రోజు అది. రంగనాథం ఆ విడాకుల్ని కావాలనలేదు. పెద్దభార్యే యిచ్చేస్తోంది

రంగనాథం కుర్చీలోనుంచి లేచి అటూ యిటూ పచారుచేశాడు పదోసారి చేతింగడియారాన్ని చూచుకున్నాడు. ఎనిమిదిన్నర!

తన పెళ్ళినాటి గడియారం. తప్పు నడవటం లేదుకదా?

యిన్నేళ్ళుగా ఆయనకి యిలాంటి ఆలోచన ఎప్పుడూ రాలేదు. యింటా బయటా అన్నిపనులూ టంఛన్‌గా ఆ గడియారాన్ననుసరించే చేసేడు

లోపల అంతా హడావుడిగావుంది. పిల్లలు దేనికోసమో కోడలిదగ్గర మారాం చేస్తున్నారు. రవిశంకర్ అప్పుడే డ్యూటీలోకి వెళ్ళినట్లుంది. విశాలాక్షి సరేసరి. వంటింట్లో సతమత మవ్వటం మామూలే!

ఎటొచ్చీ రంగనాథం స్థితే మామూలుకన్నా ఆ రోజు భిన్నంగా వుంది రోజూ యీపాటికి ఆయన ఫైళ్ళు ముందేసుకుని కూర్చునేవాడు. 'సవతిపోరు యింట్లోకూడా తప్పదా?' అని విశాలాక్షి ఎప్పుడో అనుకొంది కాని యిప్పుడు ఆమెకంత తీరికకూడా లేదు. మిగతావాళ్ళకి ఆయన గదిలోకి వెళ్ళాలంటేనే భయం.

యింట్లో ఆయన పనులన్నీ టంఛన్‌గా జరిగిపోవాలి.

తొమ్మిదింటికల్లా కెళ్ళి పీటమీద కూర్చుంటాడు. తొమ్మిదింబావుకు చెయ్యికడుక్కొంటాడు సైకిలెక్కి తొమ్మిదిన్నరకల్లా ఆఫీసుచేరుకుంటాడు.

యివాళ ఆ కార్యక్రమాలకి చివరి

రోజు. ఆ మాటకొస్తే నిన్ననే కొంత వరకు స్వ స్తివాచకం అయింది.

అలవాటు ప్రకారం సాయంకాలం తీసికెళ్ళాల్సిన ఫైళ్ళ కట్టల్ని సంచీలో పెట్టుంటే ఆఫీసరు చూచాడు.

"యింకా ఎందుకండీ రంగనాథం గారూ మీకీ బరువు? మీస్థానంలో వచ్చే అతను చూచుకొంటాడు లెండి. చివరిరోజు — యీ రోజైనా విశ్రాంతి తీసుకోండి."

యిన్నేళ్ళ ఉద్యోగ జీవితంలో ఆయన మనస్సు చివుక్కుమంది ఆ క్షణంలో. చివరిరోజు నేనేదో వ్రాసేసి పోతానని అనుమానం కాదుకదా? అన్న సందేహంకూడా వచ్చింది. ఆ రాత్రి మరి ఆయనకు నిద్రపట్టలేదు.

విశ్రాంతి!

తెల్లవారిన కొద్ది గంటల్లోనే విశ్రాంతి ఎంత భయంకరమైనదో తెల్సివచ్చింది రంగనాథానికి! యిక రేపటినుంచి కాలాన్ని గడిపేదెలా? భయంపట్టుకొంది.

మనవరాలి ఏడుపుతో రంగనాథం ఆలోచనల్నుంచి బయటపడ్డాడు. ఆదుర్దాగా లేచి గదిబయట కొచ్చాడు.

"చిన్నగా ఏడవ్వే. తాతయ్య వింటే కోప్పడ్తాడు." ఏడ్చే కూతుర్ని మందలిస్తోంది కోడలు

"ఏమ్మా? పిల్ల ఎందుకేడుస్తున్నది?"

"చూడు తాతయ్యా. నా పుట్టిన రోజుకు పరికిణీ కొనమంటే అమ్మ కోప్పడుతోంది." కోడలు బదులు మనవరాలే జవాబిచ్చింది.

"నేను కొనిస్తాగా ? అమ్మ కలా చిరాకు తెప్పించవచ్చా? తప్పుకదూ? స్కూలుకు టైం అవటంలేదూ? తయారు కావాలి మరి!"

"యివాళే కొనిస్తావా మరి?"

"యివాళే కొనితెస్తా".

"మా తాతయ్య మంచివాడు."

ఎవరి దోవన వాళ్లు వెళ్ళేరు. మళ్ళీ వొంటరితనం!

* * *

రేపటినుంచి కాలాన్ని గడపటమెలాగా అని ఆలోచిస్తుంటే రంగనాథానికి భార్య గుర్తుకొచ్చింది.

పెళ్ళిచేసుకొన్నా డన్న మాటేకాని భార్య అచ్చటాముచ్చటా వొక్కటీ తీర్చలేదు. కాదు అసలు వాటినిగురించి ఏనాడూ ఆలోచించలేదు.

పెళ్ళయిన కొత్తల్లోనన్నా విశాలాక్షిని వొక్కసారి సినిమాకు తీసికెళ్ళేడా? వొక్క చీరె కొనిచ్చాడా? కనీసం తన చేతుల్తో మల్లెపూలైనా తీసుకొచ్చాడా?

ఒక్కమనిషి వంటింట్లో యిన్నేళ్లూ సతమతమయిపోయింది. ఎలా చేసిందో, ఏంబాధలుపడిందో — తనకి మాత్రం అన్నీ టంచనుగా జరిగిపోయాయి. ఏనాడైనా తాను యీ చెంబుతీసి ఆ చెంబు అటు పెట్టేడా? పిల్లలు పుట్టేరు, పెరి

యువ

గేరు, పెద్దవారయ్యారు—యింత సంసారాన్ని భార్య ఎలా యీదిందో తనకు తెలీదు. తను చేసింది—జీతంరాగానే ఆ డబ్బు విశాలాక్షి చేతిలో పోయటం!

రేపటినుంచి భార్యకు వంటపనిలో సాయంచేస్తే? యిన్నేళ్లూ చెప్పని కబుర్లన్నీ భార్యముందు కూర్చొని చెప్తే?

యీ ఆలోచనలతో రంగనాథం మనసు అస్థిరమయింది. ఆ క్షణంలో భార్యను చూడాలన్న కోరిక పుట్టింది. తన మనస్సులో ఆలోచనల్ని ఆమెకు చెప్పుకోవాలనిపించింది.

చేతి గడియారం చూచుకొన్నాడు. తొమ్మిదికి యింకా పావుగంటవుంది.

కాస్త సందేహించినా, దాన్ని మూలకునెట్టి దివాలున లేచి వంటయింటి వైపు నడిచేడు.

వంటయింట్లోనే వోమూలగా దేవుడి మందిరంవుంది. వుందని రంగనాథానికి లీలగా తెల్సుకాని ఆ మందిరాన్నికాని, అందులోని దేవుళ్ళనికాని రంగనాథం ఎప్పుడూ పరిశీలనగా చూడలేదు. ఆయనకు యిన్నాళ్ళూ ఆఫీసే దేవాలయం, ఫైళ్ళే దేముళ్ళాయె.

భార్యకోసం వెళ్ళిన రంగనాథం, దేముడి మందిరంముందు కూర్చున్న భార్యనుచూచి గుమ్మందగ్గరే ఆగిపోయాడు. ముందు అలంకరించివున్న మందిరాన్ని, అందులోని విగ్రహాలని చూచాడు. ఆ తర్వాత ఆతనిదృష్టి భార్యమీద పడింది.

విశాలాక్షి తలస్నానం చేసినట్లుంది. ఆరీ ఆరని శిరోజాలని వదులుగా ముడి వేసింది. పలితకేశాలు అక్కడక్కడా తెల్లగా తళుక్కుమంటున్నాయి.

సంప్రదాయంగా, అందంగావున్న ఆమె మొహానికి అర్థరూపాయ వెడల్పున పెట్టుకొన్న కుంకమ వింతశోభనిస్తోంది. భక్తిభావంతో, అలసిపోయిన ఆమె కళ్ళు వింతగా ప్రకాశిస్తున్నాయి. పాతచీరలోనుంచి పసిమిచాయగల ఆమె శరీరంలోని వంపుసొంపులు చాలా భాగం ప్రకాశిస్తూ కన్పిస్తున్నాయి.

యిన్నేళ్లొచ్చినా భార్య యింత అందంగా వుంటుందని రంగనాథానికి తెలియదు. భార్యను అంత పరిశీలనగా చూచే వ్యవధే ఆయనకులేదు. ఆ యిచ్ఛ ఆయనకు కలిగినట్లు గుర్తురాలేదు.

"జీవితమంతా యాంత్రికంగా గడిచిపోయింది," అనుకొని వొక్క క్షణం బాధపడ్డాడు.

యింతలో విశాలాక్షి మంగళహారతి యిచ్చింది. యిస్తూ ఏదో పాటపాడింది. ఎంత మాధుర్యంగా వుందా కంఠం?

తను ఎంత దురదృష్టవంతుడు? తనని చేసుకొన్న భార్య ఎంత దురదృష్టవంతురాలు?

విశాలాక్షి పూజ ముగించి లేచింది. భర్తను చూచి సిగ్గుపడింది. చాలీచాలని చిరుగుల చీరె కట్టుకొని వుందేమో



పమిట జారింది. ఎంత పైకి లాక్కొన్నా చినుగులు శరీరాన్ని కప్పలేకపోయాయి.

"ఛీ, వెళ్ళండి. తొమ్మిదయిందా అప్పుడే! ఎన్నడూ లేనిది యివాళ ఎందుకొచ్చారు?" అంటూ శరీరాన్ని ఆ చినుగులచీరెతోనే కప్పుకోటానికి వృథా ప్రయత్నంచేసింది.

రంగనాథం ఆ క్షణంలో భార్య పడ్తున్న అవస్థను చూడలేదు. ఆమె మాటల్ని వినలేదు.

ఆయన కళ్ళముందు పట్టుచీర కట్టుకొని పూజచేసుకొంటున్న భార్య నిలిచింది. పట్టుచీరె రెపరెపలాడు తుండగా ఆమె తన పాలదాకు నమస్క

రిస్తోంది. తను ఆమెను ఆశీర్వదిస్తూ రెండు భుజాలు పట్టుకొని లేపనెత్తేడు. ఆ తర్వాత ఆమె తన రెండు చేతుల మధ్య యిరుక్కుపోయింది. హృదయానికి హత్తుకొనిపోయింది. వెచ్చటి ఆమె వుచ్ఛ్వాస నిశ్వాసాలు తన హృదయాన్ని గిలిగింతలు పెడ్తున్నాయి.

"ఏమిటండీ ఆలోచన. యిన్నాళ్ళకన్నా పూజామందిరం చూడటానికి చిక్కింది. నా అదృష్టం. శుక్రవారం యివాళ. దీర్ఘ సుమంగళిగా వుండాలని దీవించండి."

రంగనాథం భార్యని ఆశీర్వదించాడు. రెండుభుజాలు పట్టుకొని లేపనెత్తబోయాడు.

"తాకకండి. శుక్రవారం. అమ్మవారిపూజ చేసుకొన్నాను" అంటూ తప్పుకొంది.

శుక్రవారం! శుక్రవారం!

ఎప్పుడో భార్య అడిగి అడిగి నోరునొప్పిపుట్టి అడగటం మానుకొన్న కోరిక గుర్తుకొచ్చింది.

"శ్రావణమాసం. పేరంటాలకి పోవాలన్నా, పూజచేసుకోవాలన్నా చచ్చేసిగ్గుగా వుందండీ. మీకు పుణ్యం వుంటుంది వొక్క పట్టుచీరె కొని పెట్టండి."

ఆ క్షణంలో భార్యకు పట్టుచీరె తీసుకురావాలని నిర్ణయించుకున్నాడు. కాని భార్యతో అనలేదు. అంటే ఆమె ఎక్కడ అభ్యంతరం చెప్తుందోనని భయం.

భోజనం వడ్డిస్తున్నంతసేపూ భర్త చూపులు విశాలాక్షి శరీరాన్ని చురుక్కుమనిపిస్తూనే వున్నాయి. ఆ కొత్త చూపులకి వొకవైపు ఏదో కొత్త అనుభూతి! మరోవైపు సిగ్గు! కొత్తపెళ్ళికూతురిలా మెలికలు తిరిగిపోయింది విశాలాక్షి!

* * *

ఆఫీసరు దగ్గర్నుంచి, ప్యూనుదాకా ప్రతివొక్కరు రంగనాథానికి పూలదండలేసేరు. పొగిడేరు. పూలగుభాళింపులు వొకవైపు – పొగడ్తల సుభాళింపులు మరోవైపు–రంగనాథం వుక్కిరిబిక్కిరయ్యాడు.

కార్యక్రమం చివర్లో రంగనాథం వూహించనిది వొకటి జరిగింది. ఆఫీసు అంతటి తరపున ఆఫీసరుగారు ఆయనకో పర్సు ప్రెజెంటు చేసేరు. రంగనాథం అభ్యంతరాలను అంతా తోసి పుచ్చారు.

"యిది మీ కార్యదక్షతకు, మంచితనానికి మేమిస్తున్న చిరుకానుక. ప్రేమ కానుక. దీనితో మీకిష్టమైన వస్తువును కొని మా గుర్తుగా జీవితాంతం వుంచుకోవాలని మా కోరిక."

చప్పట్లు మ్రోగేయి. రంగనాథం హృదయంలో సప్తస్వరాలు మ్రోగేయి.

యింటికి వస్తూ దారిలోనే వో బట్టల

షాపుకు వెళ్ళేడు, మంచి పట్టుచీరె కొనానల. అప్పుడు మనవరాలికిచ్చిన మాట గుర్తుకొచ్చింది.

పట్టు పరికిణీ గుడ్డ బేరమాడితే మిగిలినడబ్బు చాల్లే.

భార్యకు పట్టుచీరెకొంటే మనవరాలు పరికిణీ. మనవరాలికి పట్టు పరికిణీ కొంటే భార్యకు నూలుచీరె.

కాసేపు ఎటూ తోచలేదు. యిద్దరూ రెండుకళ్ళల్లో మెదిలేరు.

చివరికి భార్యకు పట్టుచీరె కొని, మనవరాలికి మిగతాడబ్బుతో మంచి పరికిణీగుడ్డ తీసుకొన్నాడు. కుర్రాడిలా యీలవేసుకొంటూ హుషారుగా యింటివైపు నడిచేడు.

* * *

రంగనాథం గదిలో అటూ ఇటూ కాలుకాలిన పిల్లిలా తిరుగుతున్నాడు. మధ్యమధ్య ద్వారంవైపు ఆత్రుతగా చూస్తున్నాడు. మాటిమాటికీ గడియారం చూచుకొంటున్నాడు.

"అప్పుడే పదిగంటలు దాటిందే" అనుకొన్నాడు ద్వారంవైపు చూస్తూ.

మనవరాలు పరికిణీగుడ్డ చూస్తూనే సంతోషంతో గంతులేసింది. అదిచూచి లాగూ చొక్కా కావాలని మనవడు ఏడుపు. అల్లరి చేసిచేసి పిల్లలు పడుకొన్నట్లున్నారు.

యిల్లంతా వానవెలిసినట్లుంది. కొడుకు గదిలో ఏవో గుసగుసలు విన్పిస్తున్నాయి. అయినా వంటింట్లో శబ్దాలు యింకా ఆగవేం?

"రంగనాథం దిండు కిందినుంచి పేకెట్టును తీసి కొద్దిగా చింపి లోపలి చీరెను చూచాడు. నెమలికంఠం రంగుపైబంగారు రంగు జరీకి ఎర్రటి బార్డరు.

అంతవరకు ఆ చీరెను ఎవరికీ చూపలేదు. రిటైరయినరోజు భార్యకు జీవితంలో మొదటిసారి పట్టుచీరె కొనుక్కురావటం - కొడుకు కోడలు ఏమనుకొంటారోనన్న సిగ్గుతో ఒకవైపు, మరోవైపు భార్యకు అకస్మాత్తుగా ఆ చీరె చూపి ఆశ్చర్యంలో ముంచేసి, ఆ ఆశ్చర్యంలోనుంచి భార్య తనవైపు ఆరాధనగా చూస్తుంటే ఆనందించాలన్న కోరిక!

రంగనాధానికి ముప్పైఏళ్ళకు పైన ఏనాడో గడిచిపోయిన మొదటి రాత్రి గుర్తుకొచ్చింది. ఆనాడుకూడా అతను బాధ్యతల్ని గుర్తుచేసుకొంటూనే వున్నాడు. ఆ క్షణంలోకూడా ఉద్యోగ ధర్మాన్ని గూర్చే ఆలోచించాడు.

కానీ యీనాడు, యీ రాత్రి? బాధ్యతల బంధాలనుంచి విముక్తుడయ్యాడు. శేషజీవితాన్ని ఏ బాధ్యతలు, భయాలు లేకుండా హాయిగా ... అందంగా... ఆనందంగా...

వాకిట్లో అడుగులచప్పుడు విన్పించింది. అడుగులచప్పుడుకు లయగా విశాలాక్షి కాలి మెట్టెల చప్పుడు.

. రోజూ యీ వేళకి రంగనాథం నిద్రపోయేవాడు. ఆ స్థితిలో తనని చూచి భార్య ఏమనుకునేదో? ఏం చేసేదో?...తెలుసుకోవాలన్న వెర్రికోరిక రంగనాథానికి అకస్మాత్తుగా పుట్టింది. నిద్రపోతున్నట్లు నటిస్తూ పడుకొన్నాడు.

విశాలాక్షి లోపలి కొచ్చింది. మర చెంబు రంగనాథం తలాపిగా పెట్టింది. భర్త పాదాలకు నమస్కరించి, మంగళ సూత్రాన్ని కళ్ళకద్దుకొంది. లైటు ఆర్పి పక్కనే వున్న తన మంచంమీద పడుకోబోతోంది.

"విశాలా" ప్రేమగా పిల్చాడు రంగనాథం.

"మీరింకా నిద్రపోలేదూ యివాళ?"

"చెప్తాగాని ముందా లైటువెయ్యి."

"రిటైరయిపోయినందుకు దిగులు పడ్తున్నారా ఏమిటి?"

లైటు వెలిగింది. మంచంమీద లేచి కూర్చొని తనవైపే చూస్తున్న భర్తను చూచి ఆశ్చర్యపోయింది. ఆయన కళ్ళు ఏంలగా ప్రకాశిస్తున్నాయి. ప్రొద్దున సరిగ్గా అలాగే చూచాడు. సిగ్గు ముంచు కొచ్చి తలవంచేసింది విశాలాక్షి.

"పిచ్చి విశాలా, కొత్తనీళ్ళకు పాత నీళ్లుస్థానంయిచ్చి ముందుకు పోవాలి. కదలకుండా నిల్చిపోతే ఆ నీటిలో నాచు మొలుస్తుంది. మురికి పడ్తాయి. రిటై రయినందుకు నాకు బాధగాలేదు. ఆనం దంగావుంది. ఎందుకో తెల్సా? యిక నుంచి రోజూ పగలస్తమానం నిన్నిలా చూస్తూ కూర్చోవచ్చుకదా అని!'' ఆమె రెండుచేతుల్ని తన చేతుల్లోకి తీసు కొంటూ అన్నాడు.

"ఛీ, ఏమిటండీ యిది. ముసలి తనానికి..."

"వయసులో వున్నప్పుడు మనసు ముసలిదయింది విశాలా. వయసు వాలేక మనసుకు యవ్వనం వచ్చింది.తప్పా?"

విశాల మాట్లాడలేదు. బహుశా ఆ కొత్త అనుభూతిలోని సుఖం ఆమె మాటల్ని కట్టేసి వుండవచ్చు.

''నన్ను నువ్వు క్షమించాలి విశాలా. యిన్నాళ్లు నీ కోరికల్ని వేటినీ తీర్చలేక పోయాను. యివాళ... యివాళ..."

ఏమిటన్నట్టు చూచిందామె!

"నీ కోటి తీసుకొచ్చాను. ఏమిటో చెప్పుకో చూద్దాం."

"కనపడ్తూనే వుందిగా" విశా లాక్షి అదోవిధంగా నవ్వింది. "సినిమా వేషాలు. సినిమాలో హీరోలా ఆ చూపులేందబ్బా! నాకు సిగ్గేస్తోంది."

"అందుకే యింత అందంగా వున్నావు...యింతకీ ఏం తీసుకొచ్చానో చెప్పుకోలేదు."

"చెప్పటం ఎందుకు. మీ కళ్ళల్లో కన్పిస్తూనే వుందిగా! ప్రేమ-"

ప్రేమ! ప్రేమ!!

ఆ పదాన్నే మర్చిపోయాడు తను.

కానీ విశాల . యిన్నాళ్ళూ ఆ పదాన్ని మనసులోనే రహస్యంగా దాచుకొందన్న మాట!

"అవును ప్రేమకానుక. యిదిగో..."

పట్టుచీరె చూస్తూనే విశాలాక్షి కళ్ళు తళుక్కుమన్నాయి. ఒక్కసారిగా చేతిలోకి తీసుకొని గుండెల కద్దుకొంది. అంతలోనే ఆమె మొహంలో భావం మారింది.

"ఎందుకండీ యిప్పుడింత డబ్బు ఖర్చుపెట్టి కొన్నారు. రిటైరుకూడా అయ్యారు. యిక వాడొక్కడి రెక్కల మీద బతకాలి. పైగా కోడలేమను కొంటుంది? యింతకీ యిప్పుడింత డబ్బెక్కడిది?"

అన్న రంగనాథం ఆలోచించని మాట వాస్తవమే. యిప్పుడు భార్య ఆ ధోరణిలో ఆలోచించటమూ యిష్టం లేకపోయింది.భార్యమీద కోపంవచ్చింది. అలిగినట్టు మూతి పెట్టేడు.

"అందుకే అందరిలో యిందాకా చెప్పలేదు! ఎన్నాళ్ళబట్టో అడుగుతున్నావని తీసుకొస్తే... బీరకూతలు కూస్తావ్? కోడలు ఏమనుకొంటుంది? మా అత్తగారికి యిన్నాళ్ళకైనా పట్టు చీరె వచ్చిందే అని సంతోషిస్తుంది."

"ఎంత పిచ్చివారండీ...?"

"అవును పిచ్చివాడినే. కనుకే..." వెళ్ళి మంచంమీద పడుకొని ముసుగు తన్నేడు.

వెంటనే వచ్చి విశాలం తన అలక తీరుస్తుందని ఆశించాడు. కానీ నిముషం ... రెండు ... మూడు ... ఐదు ... పదినిముషాలు కావస్తున్నా యింకా రాదేం? పట్టుచీరె కోడలికిద్దామని మడత పెట్టి తనూ ముసుగుతన్ని పడుకోలేదుకదా?

"కోపం వచ్చిందా?"

ముసుగు తొలిగిద్దామనుకొంటున్న రంగనాథం భార్య చెయ్యి బట్టతలమీద పడగానే ముసుగును గట్టిగా బిగించాడు.

"రాదెంటి ? ఆఫీసువాళ్ళు బహుమానంగా యిచ్చిన చీరెను ప్రేమతో నీకిస్తే..."

"ఆఫీసువాళ్ళిచ్చారా?" విశాలాక్షి విరగబడి నవ్వసాగింది. ఆ నవ్వు ఎంత కమ్మగావుంది? రంగనాథానికి భార్య నవ్వును మరికొంతసేపు వినాలని బుద్ధిపుట్టింది.

"యిన్నాళ్ళ మీ కృషికి మంచి బహుమానం యిచ్చిందండీ మీ పెద్ద భార్య? యిన్నేళ్లు తన కొంగుకు కట్టేసుకొని యివాళ ముసలితనం వచ్చిందని వదిలేస్తూ సవితికివ్వమని పట్టుచీరె యిచ్చిందా? భలే...భలే..." తెరలు తెరలుగా నవ్వసాగింది. పాపికొండల మధ్య పాడుతూ గోదావరి చేసే శబ్దంలా గుంది, ఆ నవ్వు. అయినా భార్య ఎద్దేవను భరించలేకపోయాడు రంగనాథం. కోపంవచ్చింది. భార్యను పట్టుకొని...

"ఆ పా నవ్వు" ముసుగు విసిరి పారేసి చివాలున లేచాడు రంగనాధం.

ఎదురుగా పట్టుచీరె కట్టుకొని మహాలక్ష్మిలా, పార్వతిలా, అప్సరసలా, మేనకలా, వీళ్ళందరి జేజమ్మలా వయ్యారంగా నిల్చొనివున్నది విశాలాక్షి. కంటిగుడ్లు అలసిపోయిందాకా అలాగే చూస్తుండిపోయాడు.

అయినాకూడా కొట్టడానికి ఎత్తిన చేతిని దించలేదు రంగనాధం.

"నిన్నూ .. నిన్నూ ... నిన్నిక వూరుకోను" అంటూ రెండుచేతుల్తో ఆమె భుజాలుపట్టుకొని అమాంతంగా లాక్కొన్నాడు.

*   *   *

మూడురోజులు ఎలా గడిచిపోయాయో రంగనాధానికి తెలీదు. భార్య పైటకొంగుకు అతుక్కుపోయాడు. విశాలాక్షిమాత్రం తన పనుల్ని తాను యధాప్రకారం చేసుకొంది.

ఎదురుగా వుంటే భార్య ఎన్నో పనులు చేయిస్తుందనుకొన్నాడు రంగనాధం. కాని ఏ పని చేయబోయినా "మీరూరుకోండి నేను చేసుకొంటాగా? పెద్దవాడికి పనికి పోయే టయిమయింది. పిల్లలకి భోజనాలుపెట్టాలి. అన్నిటికీ అడ్డంవచ్చి ఆలస్యం చేయకండి. పైగా కోడలు చూస్తే బాగుండదు-"

అప్పటికీ బుజ్జిగాడు-కాలాంతకుడు-అననే అన్నాడు "ఏమిటి తాతయ్యా. నానమ్మను ఎప్పుడూ అలా చూస్తావేం?" అని.

విశాలాక్షి సిగ్గుతో చచ్చిపోయింది. కాని రంగనాధం పడిపోయిన మీసాన్ని గర్వంగా మెలివేసేడు.

నాలుగోనాడు సాయంకాలం రంగనాధం నెత్తిన పిడుగుపడింది.

అర్జంటుగా రమ్మని అల్లుడిదగ్గరనుంచి టెలిగ్రాం. కారణం తెలీదు.

"పోనీ నువ్వూ రారాదుటే. యిద్దరం నాలుగురోజులు అక్కడే వుండిపద్దాం."

"సిగ్గులేదుటండీ - మరీ చిన్నపిల్లలైపోతున్నారు. అల్లుడు మిమ్మల్ని రమ్మంటే నన్నూ తీసుకపోతారా? ఫర్వాలేదు వెళ్ళిరండి."

వెళ్ళేటప్పుడన్నా భార్య 'త్వరగా రండి' అని రహస్యంగా చెప్తుందని ఆశించాడు రంగనాధం. ఊహు... ఎంతకీ కూతురు కబుర్లే. అప్పడాలు... ఆవకాయలు...

వెళ్ళబోతుంటే దానిల్లు చల్లగా మనవరాలు అంది "తాతయ్యా, నా పుట్టిన రోజు నాలుగురోజులే వుంది. వచ్చేస్తావు కదూ?" అని

అమ్మయ్య! నాలుగోనాటికైనా ఏదో మిష పైన వచ్చేయచ్చు.

"వస్తానమ్మా, నా బుజ్జితల్లి పుట్టిన రోజుకు రాకుండా వుంటానా? రాకపోతే మీ నాయనమ్మ వూరుకుంటుందా?"

*   *   *




కూతురు యింటికి వెళ్ళేదన్నమాటే గాని రంగనాథం ప్రాణం అంతా యింటి మీదేవుంది. వెళ్ళినపనికూడా అయిపోవటంతో, కూతురూ, అల్లుడూ ఎంత బతిమాలినా వినకుండా మూడోరోజు రాత్రికి యిల్లు చేరుకొన్నాడు.

పిల్లలంతా నిద్రపోతున్నట్లుంది. కొడుకుగదిలో బెడ్‌లైటు మాత్రమే వెలుగుతోంది.

తలుపుచప్పుడు వింటూనే వంటయింట్లో పనిచేసుకొంటున్న విశాలాక్షి వచ్చి తలుపు తెరిచింది. భర్తనుచూచి ఆశ్చర్యపోయింది.

"మీరా! అప్పుడే వచ్చారేం?"

రంగనాథం కుదేలయ్యాడు "వచ్చారా? నాకు తెల్సు మీరు వస్తారని కళ్ళు కాయకాచేలా మీకోసమే ఎదురు చూస్తున్నాను" అని భార్య చాటంత ముఖంచేసుకొని అని వున్నట్లయితే ఏనుగెక్కి వుండేవాడు.

"ఏం? రాకూడదా?"

"అహ – అబ్బాయికూడా రేపొద్దున వస్తారనే అన్నాడులెండి. యీ రాత్రికే వస్తారని అనుకోలేదు. అందుకని అన్నా. సరే, కాళ్ళు కడుక్కోండి, యీ లోగా..."

"చేసిన మర్యాద చాల్లే, ఫలహారం దోవలో ముగించే వచ్చాను. తమరు త్వరగా పని తెముల్చుకొని వో గ్లాసు పాలో మజ్జిగో నా మొహాన పోస్తే పడుంటాం–" కాళ్లూ చేతులూ కడుక్కొని గదిలోకి విసురుగా వెళ్ళేడు.

ఎంతో సేవ నిరీక్షణ లేకుండానే

మెట్లచప్పుడు వినిపించింది. ఆ చప్పుడు వింటూనే రంగనాథం కోపం, అలక మాయమయ్యాయి. గుండెల్లో ఏదో ఆనందం...

విశాలాక్షి ఆకారాన్ని చూడగానే మళ్ళీ కోపం కట్టలు తెంచుకుంది. యీ తడవ కోపం నిజం. "పట్టుచీరెకట్టుకొనే తీరిగ్గూడా లేదన్నమాట!"

కొత్తపెళ్ళికూతురిలా విశాలాక్షి మనోహరంగా నవ్వింది. మంచంమీద ఆయన పక్కన కూర్చొని భుజంమీద చెయ్యివేసింది.

"ముందీ పాలు తాగండి. నరసింహస్వామి శాంతిస్తాడు."

భుజంమీద చెయ్యిపడగానే శాంతించాడు రంగనాథం. అయినా అలకను ప్రదర్శించాడు. "యిక వెళ్ళి పట్టుచీరె కట్టుకురా. నేను నిన్ను యీ పిచ్చి చీరెలో చూడలేను."

"పట్టుచీరెలో వుందిటండీ ప్రేమ? యిదిగో యిక్కడవుంది" అంటూ విశాలాక్షి భర్త గుండెలకు చెంపను ఆనించింది. రంగనాథం చేతుల్ని తన గుండెలకు హత్తుకొంది.

"అవును, నిజమే కానీ..."

"పట్టుచీరె సంగతి మర్చిపోండి. రేపు మాట్లాడుకొందాం. అలసిపోయి వచ్చారు, హాయిగా పడుకోండి."

పట్టుచీరె ప్రసక్తి మరి ఎత్తలేకపోయాడు రంగనాథం!

* * *

తెల్లవారింది. యిల్లంతా సందడిగా వుంది. అసలే ఆదివారం. దానికితోడు మనవరాలి పుట్టినరోజు.

నిద్రలేచి గడియారం చూచుకొని గతుక్కుమన్నాడు రంగనాథం. రిటైరయిన దగ్గర్నుంచి తాపీగానే నిద్ర లేస్తున్నాడు. అయినా తొమ్మిదిన్నర!

పెరట్లోకి పోవాలంటే సిగ్గువేసింది. అలాగే వెళ్ళి కాలకృత్యాలు ముగించుకొచ్చాడు.

"తాతయ్యా... తాతయ్యా... నా పరికిణీ ఎలావుంది?" అంటూ అమాంతం మెడచుట్టేసుకొన్న మనవరాలి సంతోషాన్ని చూచి వుక్కిరిబిక్కిరి అయ్యాడు రంగనాథం.

రంగనాథం జీవితంలో సంతోషించిన ఘడియలు లేకపోలేదు. ఒక విధంగా ఆయన అల్పసంతోషి. ఇంక్రిమెంటు యిచ్చినప్పుడు, తనకు రావల్సిన డబ్బు బకాయిపడి ఎప్పటికో చేతికో పడ్డప్పుడూ సంతోషించాడు. ప్రమోషన్ చాలా ఆలస్యంగా వచ్చినా సంతోషించాడు. తనచేత గాడిద చాకిరీ చేయించుకొని, కేవలం ఒక మెచ్చుకోలు మాటంటే బ్రహ్మానందపడిపోయాడు.

అవన్నీ ఒక ఎత్తు, భార్యకు పట్టుచీరె కొన్నక్షణంలో పొందిన సంతోషం ఒకఎత్తు.



అయితే యిప్పుడు ఆ చిన్నపిల్ల కళ్ళల్లో సంబరాన్ని సంతోషాన్ని చూస్తూ పొందిన అనుభూతి వాటన్నిటినీ మించింది. ఆ పిల్ల కళ్ళల్లో వెయ్యి దీపాల వెలుగు—కోటి దివ్వెల కాంతి!

జీవిత పరమార్థాన్ని తెల్సుకొన్న తృప్తికలిగింది. ఆ క్షణంలో మనవ రాలిని ముద్దుపెట్టుకొన్నాడు. మనసారా ఆశీర్వదించాడు.

"తాతయ్యా! యిది నువ్వు తెచ్చిన పరికిణీకాదు. పట్టుపరికిణీ."

అప్పటికిగాని రంగనాథం మనవ రాలు కట్టుకొన్న పరికిణీని పరీక్షగా చూడలేదు. చూచి గతుక్కుమన్నాడు.

"నువ్వు మంచోడివి కాదు తాతయ్యా. నాయనమ్మే మంచిది."

"ఏం?"

"నాయనమ్మకు పట్టుచీరె కొను

కొ్కచ్చావ్? నాకేమో పిచ్చి పరికిణీ గుడ్డ తెచ్చావ్."

"నాయనమ్మ పెద్దదికదా మరి!"

"నీకేంతెలీదు తాతయ్యా. పిచ్చోడివి. పెద్దవాళ్ళకి పట్టుచీరె లెందుకు? నేనైతే యించక్కా బడికి వెళ్తాను. స్నేహితులకి చూపిస్తాను. నాయనమ్మ ఎక్కడికెళ్తుంది? ఎప్పుడూ వంటింట్లోనే వుంటుందిగా?"

రంగనాథానికి ఏంమాట్లాడాలో తోచలేదు. తను యిన్నాళ్ళుగా చూడలేని సత్యాలు అతనికి దృగ్గోచరమౌతున్నాయి

"మీ తాతయ్యకు నువ్వైనా అలా బుద్ధి చెప్పమ్మా. మరీ చిన్నపిల్లాడయి పోతున్నారు."

రంగనాథం భార్యవైపు ప్రేమగా చూచాడు.

"మా నాయనమ్మ మంచిది పట్టు పరికిణీలు రెండు కుట్టించింది" అనేసి గంతులేస్తూ వెళ్ళిపోయింది, మనవరాలు.

ముసలి దంపతులు ఒకర్నొకరు మార్చి మార్చి చూసుకొన్నారు. మెచ్చుకోలు, సిగ్గు, ఆనందం, ఆరాధన.... మౌనంగానే మాట్లాడుకొన్నారిద్దరూ.

"నన్ను క్షమించండి. మీరు ప్రేమగా తెచ్చిన పట్టుచీరెను..."

"నా తప్పును నువ్వు సరిదిద్దేవు విశాలా. అందుకే ఆడవాళ్ళు ఎక్కువ వివేకవంతులంటారు. అందులోనూ సంసార సంబంధంగా, పిల్లల విషయంలో, పట్టుచీరె నువ్వు కట్టుకొంటే ఆ ఆనందం నా ఒక్కడికే. ఆ పిల్ల కట్టుకొంటే యీ యింటికే ఆనందం. యీ జగత్తుకే ఆరోగ్యం. యిది ప్రేమ స్వరూపం. సృష్టిరహస్యం! సృష్టిలో తీయనిది..."

"ఊం! తెల్సుకొన్నారే? యిక పూర్వం లాగా నన్ను మర్చిపోతారు కాబోలు."

రంగనాథం భార్యని కొన్నిక్షణాలు పరిశీలించాడు. నవ్వేడు. "ఊహు. నిజానికి నా మనవరాలి నాయనమ్మా— నువ్వు పట్టుచీరలో కన్నా, యీ పాత చీరలోనే ఎంతో హుందాగా, స్వభావ సిద్ధంగా, అందంగా వుంటావు, విశాలాక్షమ్మా."

విశాలాక్షి సిగ్గుతో తలవంచక తప్పలేదు!



# ఇది మామూలు కథే

పి.యస్. నారాయణ

"టెంపరేచర్ ?"

"వన్‌నాట్‌ఫైవ్ పాయింట్ ఫైవ్ !"

"ఐసుందా ?"

"దొరుకుతుంది ... తెప్పించమంటారా డాక్టర్ !"

తలుపుదగ్గర తల్లి ఏడుస్తున్నది. "పొద్దున వచ్చాడు ... పదిరోజుల తరువాత పొద్దున వచ్చాడు ... వచ్చాడు గదా అని సంతోషించాను ... సంతోషించినంత సేపు పట్టలేదు జ్వరం ముంచుకు రావటానికి...మూసిన కన్ను తెరవకుండా ఎలా పడివున్నాడో చూడండి !?"

తల్లి పెద్దకొడుక్కు భయపడుతూ నోరు నొక్కుకుంటున్నా బెక్కు ఆగటంలేదు. "డాక్టరు ఏమన్నాడురా?"

"వాడు గనుక త్రాగుడు మానక పోతే చస్తాడన్నాడు !"

పెద్దకొడుకు మాటలు ఆవిడకు అపశకునంలా వినిపించినాయి. కళ్ళల్లో

నీళ్లు ఉప్పెనలా ఉబుకుతుండగా 'అలా అనబోకురా' అన్నట్లుగా చేయూప సాగింది.

"వాడు బాగుపడాలంటే ఒక్కటే నమ్మా—వాడు చచ్చినా శవాన్నిగూడా ఈ గడపముందు పడవేయనీయనను–నేను చేయాల్సిందేదో చేసి చూస్తాను !" అన్నాడు కోపంగా. తల్లి భోరుమన్నది– ఆ మాటలు వినలేనట్లుగా !

* * *

"అమ్మా !" తల్లిని అర్ధరాత్రప్పుడు ఊపుతూ పెద్దగా పిలిచాడు– 'తమ్ముడు పలవరిస్తున్నాడే !' అతడి గొంతు భయంతో బొంగురుపోతుంది.

యిద్దరూ చిన్నకొడుకు పడుకున్న మంచం దగ్గరకు వెళ్ళారు. అతడి నోటినుండి కారుతున్న చొంగ అతడి చేతిలోలేని జీవితంలా జారిపోతుంది. వేడికి పణికిపోతున్న శరీరం బలవంతానైనా మార్చలేని అతడి దురలవాట్లలా పేట్రేగిపోతున్నది.

ఆ శరీరంమీద చేయివేసి అదుముతున్న కన్నతల్లి కళ్ళల్లో ప్రాణాలు గిలగిల లాడుతున్నయి. ఆమె చిన్న కొడుకును చూడలేనట్లుగా కళ్ళు మూసుకుంటే...కళ్ళు తిరిగి ఆమె ఎక్కడ పడిపోతుందోనన్నట్లుగా ఆమె భుజాలు పట్టుకున్నాడు పెద్దకొడుకు. అతడి ముదురు పెదాలు లేత ఆకుల్లా వణుకుతున్నయి... కరుకు చూపులను కన్నీటి తెరలు అడ్డుపడుతున్నయి. బండ రాయిగుండె మైనంలా కరిగిపోతుంది.

"చూస్తే చిన్న వెధవ చచ్చేటట్లే వున్నాడు !" గొణుక్కుంటున్నాడు వుండి వుండి.

"దేవుడికి ముడుపు కట్టుకో ... వాడు బ్రతికి బట్టగట్టితే కొండకొస్తానని !" చెవి దగ్గర రహస్యం చెప్పినట్లుగా అన్నాడు. "నేనూ వస్తాను !"

"అలాగే" నన్నట్లుగా తల ఊపింది తల్లి.

ఆమె అటు వెళ్ళగానే తమ్ముడి పొట్టమీద భయం భయంగా చేయి వేశాడు.

"నీవు బ్రతకరా తమ్ముడూ ! నీ వెలాంటివాడివైనా నీవు నాకు తమ్ముడివేరా బాబూ !" అన్నట్లుగా కళ్ళు మూసుకున్న అతడి కళ్ళవైపే చూస్తున్నాడు. "నీవు ఆ పేకాట మానేయ్... త్రాగుడు మానేయ్...సిగిరెట్లు మానేయ్ ... శుభ్రంగా ఉద్యోగం చేసుకో ... పెళ్ళి చేసుకో ... అమ్మకు పుట్టిన ఆరుగురిలో ఈనాడు మనమిద్దరమేరా మిగిలింది...నీకు నేనూ...నాకు నీవూ తప్ప మరెవ్వరూ లేరురా !"

* * *

"బ్రెడ్ కావాలని నీకు తెలియదా ! ...లేకపోతే తిండే తింటాడులే ... కాకపోతే చస్తాడులే అనుకుంటున్నావా !" తల్లిమీద గయ్యిన లేచాడు మూడురోజుల




తరువాత — జ్వరం తగ్గి పథ్యంతిన్న చిన్నకొడుకు.

తల్లి భయం భయంగా చిన్న కొడుకు ముఖంలోకి చూచింది.

"చెయ్యటం చేతగాకపోతే ఇంట్లో నుంచి వెళ్ళగొడితే సరిపోలా... ఉంచు కోవటమెందుకు ... కడుపు మాడ్చట మెందుకు !"

అరగంటబట్టీ అన్నీ వింటున్న పెద్దకొడుకు తన గదిలోనుంచి విసురుగా బయటకు వచ్చాడు. "ఏంవి టోయ్... నీ గోడి అరుపులు ... బోడి ముండా వేషాలూ అని ... ఇష్టమయితే నోరుమూసుకు పడివుండు ... లేదా బయటకు నడు...నీవు చేసే అజా కానీ బోడి ఉద్యోగానికి ఆఫీసర్ననుకుంటు న్నావేమో ... ఒళ్లు దగ్గిర పెట్టుకు మాట్లాడు ... అమ్మనేమైనా అంటే పళ్లు వాయగొడతాను !" అంటూ అరచ సాగాడు.

"ఎవ్వడూ ఇక్కడ చేవ చచ్చి లేడు — మళ్ళీ వాయగొడతారు !" అన్నాడు కర్రపుల్లలా లేస్తూ తమ్ముడు.

"ఏరా కొట్టు చూద్దాం !"

"ఛత్...నిన్ను కొట్టాలిగూడానా... నేను చస్తే నా శవం కాకులూ, గద్దలైనా పొడుచుకు తినాల్సిందేగాని నీవు ముట్టు కోపడానికి వీల్లేదు !" రోడ్డెక్కాడు తమ్ముడు.

"మళ్ళీ చస్తే నా యింట్లో కాలు పెట్టనీయన్నా నిన్ను — అరేయ్ ... నిన్ను కాకులూ, గద్దలూ ముట్టుకున్నా వాటికే పాపం చుట్టుకుంటుందిరా !"

తల్లి ఆ యింట్లోనే శవం లేచినట్టుగా ఘొల్లుమన్నది.

ఇంత గందరగోళంలోనూ నిమ్మకు నీరెత్తినట్లు ఏ ఉద్వేగమూ లేకుండా కూర్చున్నది ఒకర్తే — ఆ యింటి పెద్దకోడలు !

"ఇలా తెగతెంపులు చేసుకోవటం వాళ్ళకు ఇది నూటొక్కటోసారి !" అనుకున్నది !

# స్వాతంత్ర్యం ఖరీదు

(గల్పిక)

"శ్రీపతి" — కలంపేరు — తన భార్యతో అన్నాడు: "లక్ష్మీ, స్త్రీల విమోచనం గురించి వరసగా వ్యాసాలు రాద్దామనుకుంటున్నాను. వాటిని నీ పేర పంపించి, పత్రికలో అచ్చేయిస్తాను, ఏం ?"

"మీ పేరే పంపరాదూ ?"

"ఇంకా నయం. ఇప్పటికే నా కలం పేరు మా ఆఫీసులో కొందరికి తెలిసిపోయింది. మా బాస్‌కు తెలిస్తే ఉద్యోగం ఊడుతుంది."

"ఇంకో కలంపేరు పెట్టుకోండి."

''మగపేరుతో రాస్తే ఆడాళ్ళపత్రిక అచ్చెయ్యదు."

"ఆడపేరు పెట్టుకోండి.''

అందుకేగదా నీ పేరు పెడతానంటున్నాను."

"నా పేరుతప్ప ఇంకో ఆడపేరే దొరకలేదా ?" నా పేరు నేను అరువియ్యను."

"అది కాదే, వెర్రిమొహమా ! ఎవరన్నా ఇంటర్‌వ్యూ చేస్తామని వస్తే? ఉత్తరాలు రాస్తే ?"

"అదా సంగతి ? మీ దారిన మీరు ఏదో గాలికి పారేస్తే ఆ తరవాత తిట్లూ, దీవనలూ నేను భరించాలా ? ఎంతమాత్రం వీల్లేదు !''

"నీ వరస ఏమీ బాగాలేదు. నేనైనా మీ ఆడవాళ్ళ ఉద్ధరింపులేగదా చెబుతున్నాను ? ఆడవాళ్ళ స్వేచ్ఛకోసం లోకమంతా ఘోషిస్తూంటే నువు కాస్త సహకరించనంటావే ! ఆడదానివికాదూ? సిగ్గులేదూ ?"

"ఆ మాట అన్నారు గనక నా స్వాతంత్ర్యాన్ని అమ్ముకుంటాను. దానికి ఏమిస్తారు ? అయిదు తులాల బంగారం నగలూ, మూడు పట్టుచీరలూ ఇస్తారా ? టి.వి. సెట్టు కొంటారా ?''

"ఏమాశ్చర్యం ! నీ స్వాతంత్ర్యాన్ని అమ్ముకుంటావా ?''

''జీతం డబ్బులకు మీ స్వాతంత్ర్యాన్ని అమ్ముకున్నట్టు మీరు ఎన్నిసార్లు అనలేదూ ? పెట్టుబడిదారీలో ఎవరికీ స్వాతంత్ర్యం ఉండదని లక్షసార్లు అన్నారే. ఆడవాళ్ళ స్వాతంత్ర్యానికి పెట్టుబడిదారీ అడ్డంరాదా ? "

---

కొడవటిగంటి కుటుంబరావు

---



# వ్యక్తిత్వం వేసే మనిషి

పి.వి.బి. శ్రీరామమూర్తి

ట్రెయిన్ కదిలి, వేగాన్ని పుంజుకో బోతున్నా, తను తీసుకోవాల్సిన జాగ్రత్తలని ఏకరువుపెట్టే బామ్మ జ్ఞాపకానికి వచ్చిన సుశీల తనలో నవ్వుకుంది.

'ఆవకాయ జాడీలో తడిచేతులు పెట్టకు- చెంచాతో తీసుకో. ఉదయం పూట పెరుగు వేసుకో- రాత్రిపూట మాత్రం వేడిపాలు వేసుకుంటూండు; ఏపూటకాపూటే చారెడు బియ్యం కడిగి స్టవ్‌మీద పడేసుకో. నువ్వు నీ పని చూసుకునే లోపల అదే ఉడికిపోతుంది; పడుకోబోయేముందు ఆ భగవంతుణ్ణి తలచుకుని పడుకో- మరే పాడు కలలూ రావు; ఒంట్లో నలతగా ఉంటే ఓ కార్డు ముక్క వ్రాసి పడేసెయ్- అశ్రద్ధ చెయ్యకు. ఫస్టుపోయాక నే వస్తాలే. ఉద్యోగంలో చేరిన వెంటనే ఓ కారూడు ముక్క రాసి పడెయ్యవే అమ్మలూ! ఎప్పుడూ ఒఖ్ఖర్తివే ఉండలేదు. ఎలా

ఉంటావో ఏమో. ఎవరితోనూ పేచీలు పెట్టుకోకమ్మీ. ఎందుకొచ్చినవుజ్జోగమో, ఖర్మ..... దిగినప్పుడు సామాన్లన్నీ జాగ్రత్తగా చూస్కో...మరి ఉంటా...'' ట్రెయిన్ ఫర్లాంగుదూరం దాటిపోతున్నా బామ్మ ఇంకా ఏదో హెచ్చరిస్తూనే ఉంది. 'బామ్మ దృష్టిలో ఇంకా తను చిన్న పిల్ల. తనకింకా ఏం తెలియదు.' నవ్వొచ్చింది సుశీలకు. ఇంతవరకూ నిజానికి ఇంతదూరం ఒంటరిగా వెళ్ళలేదెప్పుడూ. తను పుట్టిందీ పెరిగిందీ ఈ ఊళ్లోనే. ఇంట్లో తనొక్కర్తే ఆడపిల్లవటంచేత తల్లికీ, తండ్రికీ, అన్నదమ్ములకీ అందరికీ తనంటే ముద్దే. అందుకే తనకేమాత్రం బాగులేకపోయినా, ఒళ్ళువేడిచేసినా ఇంటిల్లిపాదీ బెంబేలెత్తిపోతుంటారు. బామ్మసంగతి వేరే చెప్పనే అక్కర్లేదు. అలాటి వాతావరణానికి దూరమై ఇప్పుడు కొత్త వాతావరణంలో ప్రవేశించబోతోంది. అందులో ఓ బాధ్యతగల ఉపాధ్యాయినిగా భవిష్యజ్జీవితం! మగపిల్లలూ- ఆడపిల్లలూ తెలిసీ తెలియని వయసులో గిల్లికజ్జాలు తెచ్చుకుని అమాయికంగా అప్పుడే కొట్లాడుకోవటం మళ్ళీ వెంటనే కలిసిపోవటం, వాళ్ళ తగవుల్ని తను తీర్చబోవటం- ఇవంతా తలచుకుంటే అదోరకమైన వింత అనుభూతి కలిగింది సుశీలకి. ఇన్నాళ్లూ తను మాష్టారు క్లాసులో పాఠం చెప్తోంటే సీరియస్‌గా పాఠం వింటున్న ఆ ప్రక్క అమ్మాయిని మెల్లగా గిల్లటం మళ్ళీ ఏమీ ఎరగనట్లు పాఠం వింటున్నట్లు నటించటం- అల్లరిచేసే అబ్బాయిల్ని ఏడిపించటం, వాళ్ళకి ఆంజనేయరావ్ అనీ, మిష్టర్ సుగ్రీవ్ అనీ టైటిల్సు తగిలించటం- ఇవన్నీ సుశీలకి ఒకొక్కటొక్కటీ జ్ఞాపకం రాసాగాయి. ఇకపై తనా పనులు మాని, అలా ప్రవర్తించేవాళ్ళని హెచ్చరిస్తూ 'బుద్ధిగా చదువుకోండి' అని నీతులు బోధించటం- ఇంతలోనే ఎంత పెరిగిపోతోంది తను?

మరోసారి నవ్వుకుంది సుశీల.

ట్రెయిన్ జోరుగా పోతోంది!

కిటికీలోంచి కనిపించే పచ్చని పైరుల్ని... అక్కడక్కడ కనిపించే అందమైన చెరువుల్ని... ఆ చెరువుల నిండా కనిపించే తెల్లతామరల్ని చూస్తోంది. చల్లనిగాలి వచ్చి చెంపలని తాకుతోంది. గాలికి ఫాలభాగంపై ముంగురులు అలవోకగా నాట్యం చేస్తున్నై. వాటిని సర్దుకుంటూ అలానే చూస్తున్న సుశీలకి నెలరోజులక్రితం జరిగిన సంఘటన గుర్తుకొచ్చి మనసును వికలం చేసింది. ఎంత మరచిపోదామనుకున్నా ఆ విషయం మరచిపోలేకుండా ఉంది.

నెలరోజుల క్రితం ఓ రోజు——

"కంగ్రాట్యులేషన్స్ సుశీలాదేవి

గారూ !" అనుకుంటూ హడావుడిగా పేపరుపట్టుకుని సుకుమారూ, అతని చెల్లెలు సువర్చల వచ్చారు.

''రిజల్ట్స్ వచ్చేశాయా?'' గాభరాగా పరుగెత్తి సుకుమార్ చేతిలో పేపరందు కుంది సుశీల.

"మరెందుకండీ చూడటం? మీ నంబరు ఫస్టుక్లాసులో ఉంటుంటే... ఇదిగో... ఈవిడ నంబరు థర్డుక్లాసులో ఏడుస్తోంది. ఈవిడిక్కడ ఏడుస్తోంది.'' అంటూ చెల్లెలి బుర్రమీద చిన్న మొట్టి కాయ పెట్టాడు సుకుమార్.

''నేనేం ఏడవలేదోయ్. సుశీ, అన్నయ్యవన్నీ అబద్ధాలే. ఆఁ...మరి నీ ఫస్ట్క్లాసు పార్టీ ఎప్పుడోయ్?" అని అంది సువర్చల. సుశీల సంతోషంతో బామ్మకీ, తల్లికీ తను ఫస్టుక్లాసులో పాసయినట్టు చెప్పి, ఇంకా నిలబడే ఉన్న సుకుమార్నీ, సువర్చలనీ చూసి, ''సారీ ఫ్రెండ్స్... క్షమించండి. మీరు నిల్చునే ఉండిపోయారు,'' అంటూ రెండు కుర్చీలు వేసి యిద్దర్నీ కూర్చో మని ఎదురుగా ఉన్న స్టూల్మీద తనూ కూర్చుంది.

''అమ్మాయిగార్లూ, తమరింక చిలిపి చేష్టలు మాని పిల్లల్ని కొంచెం మంచి వాళ్లని తయారు చెయ్యండి.'' ఇద్దర్నీ చూస్తూ అన్నాడు సుకుమార్. సుశీల కొంటెగా వెక్కిరించింది.

సుశీల తల్లి ఆపిల్పండు ముక్కల్ని ప్లేటుతో తెచ్చి ప్లేటును టేబిలుమీద పెట్టింది. ఆ తరువాత డ్రింక్సు తెచ్చి అందించింది. అప్పుడే మరో ముగ్గురు స్నేహితులు వికసించిన మల్లెపువ్వుల్లా వచ్చారక్కడికి. తమ వర్గంలో వారంతా మంచి రేంకులో పాసయినందుకు సంతో షిస్తూ,మధ మధ్య లెక్చరర్లని ఏడిపించే సంఘటనలు, సరదాకి చేసిన వాకౌట్లు, చిరు సమ్మెలు అందులో వాళ్ల నాయ కత్వాలూ... వాటిగురించి తల్చుకుంటూ నవ్వుకుని ఆ జీవితం మరి రాదని, జీవితం ఇకపై మరో క్రొత్త మలుపు తిరగబోతోందని మాటాడుకుని మరో అరగంట తరువాత అందరూ వెళ్ళి పోయారు. తరువాత గదిలో పుస్తకం చదువుకుంటున్న సురేష్ దగ్గరకి వచ్చి సంతోషంగా "మామయ్యా! నేను ఫస్ట్ క్లాసులో పాసయాను తెలుసా!" అని గర్వంగా చెప్పుకుంది.

"ఆ... అంతా చూస్తున్నాగా!' అని అదోలా చూశాడు. 'కంగ్రాట్యు లేషన్స్' అని చాల సంతోషంగా చెప్తా డనుకుని సురేష్నుంచి అలాటి సమా ధానం విన్న సుశీలకు పొంగే పాలమీద నీళ్ళు చిల్లినట్లుగా అయిపోయింది.

కోపంతో ముఖం ముడుచుకుని, ''ఛీ, కంగ్రాట్స్ చెయ్యటం కనీస సభ్యత అని కూడా తెలియని నీలాటి వాళ్లకి చెప్పటం నాదే పొరపాటు"అంది.

"నే చెప్పకపోతేనేం? కంగ్రాట్స్

చెయ్యటానికి, వ్యభిచారం చెయ్యటానికి సిద్ధంగా ఎంతమంది ఉన్నారుగా'' అన్నాడు.

"అంటే వాళ్ళంతా పోకిరీవాళ్ళనేనా నీ ఉద్దేశ్యం?''

''అని నేననలేదుగా!''

"అలాగని వేరే చెప్పనక్కరలేదు. నీ మాటలు చెప్తున్నాయి."

''మనసులో భావాలనిబట్టే అనుమానాలు వస్తుంటాయ్. నన్నేం చెయ్యమంటావ్."

"మామయ్యా! నీ అభిప్రాయం సూటిగా చెప్పరాదూ?'' అప్పటికే అతడి మాటలు శూలాల్లా గుచ్చుకుంటున్న సుశీల అంది.

"పదిమంది మగాళ్ళముందు పగలబడి నవ్వే ఆడవాళ్ళంటే నాకసహ్యం!"

సుశీలకు సంతోషంగా ఉన్న మనసంతా వికలమై ఒక్కసారిగా చెప్పరాని కోపం వచ్చింది.

''అలాగనుకునే మగమహారాజులంటే నాకు పరమ అసహ్యం,'' అని జోరుగా వెనక్కి తిరిగిపోతుండగా "అదే నీ గర్వం... అహంకారం... ఒకనాటికి అదే నిన్ను నాశనం చేస్తుంది!''

"అదేదైనా అది నా వ్యక్తిత్వం... అదొకరికోసం మాత్రం చంపుకోను," అంది.

"నీకో వ్యక్తిత్వంకూడా ఏడిసింది?" ఛీత్కారంగా క్షుద్రజంతువును చూసిన మృగరాజులా చూసాడు సురేష్. సురేష్ అన్న ఒక్కొక్కమాట సుశీలను ముక్కలు ముక్కలుగా కోస్తున్నట్లుగ బాధించింది. పిండారబోసినట్లు వెండిలాగా మెరిసిపోయే వెన్నెలనిండా దట్టమైన మేఘాలు ఆవరించి కుంభవృష్టిగా కురిసినట్లు సుశీల ముఖంలో సంతోషం అంతా పటాపంచలైపోయి కళ్లనుండి ఏకధారగా కన్నీళ్ళు వరవ సాగాయి. మనసును ముద్దగా చేసి దానిమీద ఎవరో గుద్దుతున్నట్లుగా అనిపించింది సుశీలకి. దిండులో తల దూర్చుకొని వెక్కి వెక్కి ఏడ్చింది. తల ఎగిరిపోయేటంతగా తలపోటు ప్రారంభమయి, అలాగే ప్రక్కపై ఒరిగిపోయింది రెక్కలుకోసి పడేసిన పక్షిలా. ఆ రోజు రాత్రి భోజనం కూడా చెయ్యాలనిపించలేదు సుశీలకి.

ఆవేళనుంచి ఆ సంఘటన జ్ఞాపకం వచ్చినపుడల్లా హృదయంలోంచి అదో విధమైన బాధ, ఆవేదన, ఆందోళన. ఇప్పుడు మళ్ళీ అదే విషయం జ్ఞాపకం వచ్చి మనసును కలవరపరిచింది." నిజమేనేమో! మామయ్య అన్న మాటలో కూడా యదార్థం లేకపోలేదేమో... వయసు పెరుగుతున్నా... వయసుతో మనిషి పెరుగుతున్నా తనింకా చిన్నపిల్లలా అల్లరిచేస్తూ... పదిమందితో ఆడా-మగా భేదం లేకుండా నవ్వటం... ఇదంతా తన తప్పేనేమో!" అనిపించిన సుశీలకి ఆ అభిప్రాయాలనూ, ఆలోచన



లనూ నెట్టుకుంటూ మళ్ళీ యిలా అనిపించింది. "అయినా తనేం కాని పనిచేసింది? మామయ్య దృష్టిలో ఆడపిల్లలు చదువుకోవటం ... హాయిగా ఆనందంగా గడపటం కూడా నేరాలేనేమో! అలా గనుకున్న వాళ్లంతా వ్యక్తిత్వం లేని వాళ్లే అవుతారేమో మామయ్య దృష్టికి.'' ఆలోచిస్తుంటే సుశీలకి సురేష్‌పై మరింత అసహ్యం కలుగుతోంది. అలాగ సుశీలచుట్టూ ఈగల్లా ముసురుకున్న అర్థం లేని ఆలోచనలు బ్రెయిన్ కుదుపుతో చెల్లాచెదురయ్యాయ్.

* * *

సుజాతతో ఆరు మాసాలుగా కలసి ఉన్నా...ఆమె మనస్తత్వం మాత్రం అంతుబట్టలేదు సుశీలకి. ఏదో పుస్తకం చదువుకుంటున్న సుజాతనే తదేకంగా చూస్తూ ఆలోచించసాగింది సుశీల. తన మిత్రుల్లో ఎవరేనా మానసికంగా బాధపడుతున్నపుడు తన మాటల్తో

వాళ్ళ వాళ్ల బాధలని మరచిపొయేట్టు చేయటం సుశీలకి అలవాటు. అలాటిది ఎన్నిసార్లు ప్రయత్నించినా సుజాత మాత్రం పర్వతంలాగా చలనం లేకుండా కనిపిస్తుంది. 'ఇవేశెలాగైనా సుజాతని పూర్తిగా తెలుసుకోవాలని' ప్రక్కమీది నుంచి లేచి వెళ్ళి, సుజాత చదువుతున్న పుస్తకాన్ని చేతుల్లోంచి లాక్కొని ఆమె మెడచుట్టూ చేతులు వేసి కళ్ల లోకి తొంగిచూసింది సుశీల.

"ప్చ్. సుశీ... ప్లీజ్ ... డోంట్ డిస్టర్బ్ మీ."

"నువ్వు కొట్టు, తిట్టు – ఏమైనా చేసుకో. కాని – నా ప్రశ్నలకి మాత్రం ఇవాళ సమాధానం చెప్పి తీరాలి?" అని లేచి సుజాత ముందున్న టేబిల్ మీద కూర్చుంది సుశీల. సుజాత సుశీలవేపు సీరియస్‌గా చూసి "నువ్వేం ప్రశ్నించనక్కర్లేదు ... నేనేం సమాధానాలు చెప్పనవసరం లేదు. అనవసరంగా నన్ను బాధపెట్టక, నా పుస్తకం నా కిచ్చేయ్. ఇలాగయితే నేను వేరే గది చూసుకోక తప్పదు," అంది. ఆ మాటలు చాలా పరుషంగానే అన్నా వాటిని లెక్కచెయ్యలేదు సుశీల.

"సుజా! నేను ముందే చెప్పా. నువ్వేం చేసినా నేనడిగిన వాటికి సమాధానం చెప్పిందాకా నిన్ను విడిచి పెట్టను," అంది.

"నాకు కోపం తెప్పించకు సుశీలా! నన్ను విసుగెత్తించక ఆ పుస్తకం ఇలా పడేయ్." ఆ మాటలకి సుశీలకి ఆత్మాభిమానం దెబ్బతిన్నట్లయింది. ప్రతి మాలుతున్నకొద్దీ సుజాత మరీ మొండికెత్తటం సుశీలకి చిరాకనిపించింది.

"అంతేనా?" సూటిగా కళ్లల్లోకి చూస్తూ అంది.

"అంతే." ముఖం దించుకుని అంది సుజాత. విసురుగా పుస్తకం ఇచ్చేసింది సుశీల. సుశీల చేతిలోంచి పుస్తకం అందుకున్న సుజాతకి సుశీల ముఖం అవమానంతో ఎర్రబారటం...కళ్ళపై సన్నని నీటితెరలు నాట్యం చెయ్యటం కనిపించి మనసు కొంచెం చలించింది. అయినా ఖాతరు చెయ్యక పుస్తకం చదువుకోవటంలో లీనమయిపోయింది. పేజీలు తిరగబడిపోతున్నా.. దానిలో అక్షరాలు కనిపించక ... సుశీలతో పరిచయం ...... సుశీల చలాకీతనం...తనని అనేకసార్లు నవ్వించటానికి ప్రయత్నించటం ... ఇదంతా ఒక్కొక్కటి కళ్లముందు కనిపిస్తుంటే ఒక్కసారిగా సుశీలపై అనుకోని అభిమానం ఆవరించుకుని, సుశీల మనసుకి కష్టం కలిగించినందుకు తననోసారి తిట్టుకుని, పుస్తకాన్ని మూసి టేబిల్ మీద విసిరేసి భారంగా కళ్ళు మూసుకుంది.

సుశీల వేయబోయే ప్రశ్నలేమిటో సుజాతకు తెలుసు. అయితే వాటికి

సమాధానం 'ఎలా చెప్పాల్తో' ఆలో చిస్తోంది సుజాత. సుజాత ఉద్యో గంలో చేరి అప్పుడే నాలుగు సంవత్స రాలు గడిచిపోయాయి.

ఈ నాలుగు సంవత్సరాలూ తను ఒంటరిగానే గడిపింది. జీవితమంతా ఎడారిలా కనిపిస్తోంది. ఇంతకాలం తనని అర్థంచేసుకోలేని మగ టీచర్ల ముందు పనిచేస్తూ ... వాళ్ల కట్‌చేసే జోకులూ...వేసే విసుర్లూ విసీ విననట్లు ఊరుకుంటున్నా...ఒక్కోసారి చెప్ప రాని నిరాశ...నిస్పృహ..తన నావరించి 'తనెందు కింకా బ్రతుకుతున్నది?' అనే ప్రశ్న జనించి జీవితంమీద పూర్తిగా రోత కలుగుతున్న సమయంలో సుశీల పరిచయంకావటం, సుశీల చలాకీతనంతో ... బయటకు కనిపించకపోయినా, తనలో ఎంతగానో మార్పు రావటం జరిగినా, ఇంకా సుశీలని దూరంగా ఉంచటం సమంజసంగా కనిపించలేదు సుజాతకి. మంటలు రేకెత్తే తన మనో గాయానికి చల్లని ఔషధంలా సుజాతకి కన్పించింది సుశీల. ఆలో చిస్తుండగానే రాత్రి తొమ్మిదయి పోయింది. సుజాత కుర్చీలోంచి లేచి మంచంమీద పడుకున్న సుశీల ప్రక్కగా కూర్చుని "సుశీలా, తొమ్మి దయిపోయింది. లే భోజనానికి," అంది.

"నేను భోజనం చేయను. నాకు ఆకలిలేదు." విసురుగా ప్రక్కకి తిరిగిపోయింది సుశీల.

"లేచి కొంచెం మజ్జిగ అన్నం తిను. లేకపోతే వొంటి కనారోగ్యం."

"నా సంగతి నాకు తెలుసు. నువ్వు భోజనం చెయ్."

"ప్లీజ్. కొంచెం తిని పడుకో." సుజాత మరికొంచెం బ్రతిమాలింది.

"నన్ను నిద్రపోనీ...అనవసరంగా డిస్టర్బ్‌చేసి విసుగెత్తించకు" అంది సుశీల.

"నా మాటలు నాకే అప్ప గిస్తున్నావని తెలుసు సుశీ. క్షమించు. నీ మనసుకి కష్టం కలిగించాను."

"నువ్వేం నాకు కష్టం కలిగించలేదు. వయసు పెరుగుతున్నా, ఆరేళ్ల పిల్లలా ఆట్లాడి మాటలు పడటం నా కల వాటేలే." అని బోర్లా పడుకుంది సుశీల.

"పిచ్చి సుశీ, నీలో ఎంత కొంటె తనం ఉందో అంత కోమలత్వం ఉంది. నీకుకూడా కష్టం కలిగించిన నేను నిజంగా ఫూల్నే. లే. నువ్వేమడిగినా సమాధానం చెప్తా. నువ్వడగని వాటి గురించి కూడా చెప్తాను. లేచి భోజనం చెయ్ ముందు," అని సుశీ లని లేపి కూర్చుండబెట్టింది.

"నాకోసం నువు కష్టపడ నవసరం లేదు. నాచేత భోజనం చేయించటంకోసం చెప్పదలచుకో నవసరంలేదు," అని







అయిష్టంగా లేవబోయింది. సుశీల భుజాలని రెండు చేతుల్లో పట్టుకుని ఆమె కళ్ళలోకి చూసి ''లేదు సుశీ, నువ్వు వినకపోయినా చెప్పదలచుకున్నాను. ఇన్నాళ్లూ నీలా దగ్గరచేరి అడిగే ఆత్మీయులకోసం అలమటించిపోయాను. నేను కోరుకునే ఆత్మీయత నీలో ఉన్నా నిన్నర్థంచేసుకోలేకపోయాను. ఇవాళ నీ దగ్గరేదీ దాచను" అంటూ కళ్లొత్తుకుంది సుజాత. సూర్యరశ్మికి కరిగిపోయిన మంచులా సుశీల మనసు కరిగిపోయింది. తరువాత ఇద్దరూ మౌనంగా భోజనం ముగించి లేచారు.

"సుశీ, ఇలా కూర్చో." మంచం మీద మఠం వేసుకుని చెంపకు చెయ్యి ఆనించుకుని కూర్చుంది సుజాత. సుశీల ముందు కుర్చీలో కూర్చుంది. అయిదు నిమిషాలు వారిముందు మౌనం నాట్యం చేసింది.

"సుశీ, నాది పాత కథే. నా కథ విన్నాక నన్నసహ్యించుకోవు కదూ?" కళ్ళలోకి చూసి అడిగింది సుశీలని.

అసహ్యించుకునేటంత సంకుచితత్వం నాకు లేదని తెలియదా?" ఎదురు ప్రశ్న వేసింది సుశీల.

''తెలుసు. అందుకే నీకు చెప్పదలచుకున్నాను. కోరికలు వెర్రితలలు వేస్తున్న యౌవ్వనపు తొలిరోజుల్లో నేనో అబ్బాయిని ప్రేమించాను. అతన్ని నేను పూర్తిగా అర్థంచేసుకున్నాననే భ్రమలోపడి అతణ్ణే నా సర్వస్వంగా భావించి...స్త్రీకి యేది ముఖ్యమో అది పోగొట్టుకున్నాను, అతని మాటల గారడీలో పడి. అదంతా కాలేజీలో చదువుతుండగా జరిగిన కథ. కాలేజీ చదువులు ముగియటంతో అతను నాకు దూరమయాడు. తరువాత ఓ రోజు పిడుగులాంటి ఉత్తరం. 'తన ఇష్టాయిష్టాలతో ప్రమేయం లేకుండా తన పెళ్ళి తన మేనకోడలుతో కుదిరిపోయినట్లు...తప్పని పరిస్థితులలో తన వివాహం జరగనున్నట్టు, తనను పూర్తిగా మరిచిపోయి ఇంకొకరితో నన్ను సుఖంగా బ్రతకమనటం' – ఇదీ ఆ ఉత్తరంలో సారాంశం. ఆ రోజే జీవితంమీదా, నామీద నాకు అసహ్యంవేసింది. అయినా-ప్రాణం మీద తీపిచేత ఇంకా ఇలా అందరిచేతా మాటలు పడుతూ బ్రతుకుతున్నాను." అంటున్న సుజాత కళ్లు వర్షించాయి.



"సుజా! నన్ను క్షమించు సుజా. నీ కనవసరంగా కష్టం కలిగించాను" అని తల దించుకుంది సుశీల.

"లేదు సుశీ. నా మనసు కిప్పుడు నిజంగా తృప్తి లభించింది. ఇన్నా ళ్ళకు నీలాటి స్నేహితురాలు దొరికి నందుకు, నన్నర్థం చేసుకున్నందుకు," అంది సుజాత. అక్కణ్ణించి లేచి వెళ్ళి సూట్ కేస్ తెరిచి డైరీ తీసుకొచ్చింది. అందులోంచి ఓ ఫోటోని తీసి సుశీల కందించింది చూడమని. సుజాత చేతు ల్లోంచి ఫోటోని అందుకుని చూస్తున్న సుశీలకి తల తిరిగినట్లయింది.

"ఎంత దగా! ఎంత మోసం!" నోరు దాటి వస్తున్న మాటలను ఆపి మునిపంటితో క్రింది పెదవిని గట్టిగా నొక్కింది.

"నువ్వు 'విజయవాడ'లో చదువు కున్నావా సుజా!" సంశయంగా అంది సుశీల.

"అవును,ఏం? ఇతను నీకు తెలుసా?" ఆత్రుతగా అడిగింది సుజాత. తెలుసు అని చెప్పటానికి సిగ్గనిపించి సుశీల మౌనంగా ఊరుకుంది. తరువాత కొంచెంసేపు గడిచాక "సుజా! నీ కన్యాయం జరగకుండా చేసే పూచీ నాది. ఆ బాధ్యత నామీద వేసుకుం టున్నాను." అది తనకు సాధ్యమో, అసాధ్యమో అనికూడా ఆలోచించ కుండా అనేసింది సుశీల.

"సుశీ ఏమిటి నువ్వు చేసేది? అంతా ఏనాడో జరిగిపోయింది. ఇతనిని గురించి నీకు తెలిసినా సాటి స్త్రీ సంసారంలో చిచ్చుపెట్టడం ధర్మం గాదు." గాభరాగా అంది సుజాత.

"ఎలా చెయ్యాలో నాకు తెలుసు సుజాతా. నువ్వేం భయపడనవసరం లేదు" అంది.

ఆ రాత్రి సుశీలకి నిద్రపట్టలేదు. సుజాతకి కూడా ఎంతోసేపు నిద్ర పట్టలేదు. కాని...తన కాలేజీ విష యాలు...ఆవేశంతో చేసుకున్న నిర్ణ యాలు సుశీలతో చెపుతూ అలా నిద్రలోకి ఒరిగిపోయింది. సుజాత పడుకుందని గమనించి సుశీల లేచి కూర్చుని ప్రక్కగదిలోనికి వెళ్లి టేబిల్ లైట్ వేసింది. పుస్తకంలోంచి

తెల్లకాగితాన్ని చించి ఉత్తరం వ్రాయటం ప్రారంభించింది.

"మామయ్యా!

నానుంచి ఉత్తరం వచ్చిందంటే నీ కాశ్చర్యంగా ఉంది కదూ? నువ్వు నాకు చాలసార్లు కాలేజీ చదువుకునే రోజుల్లో ఉత్తరాలు వ్రాసినా వాటికి జవాబు లివ్వాలని అనిపించలేదు. కాని—ఇవాళ నీనుండి ఉత్తరం లేకుండానే నేను నీకు ఉత్తరం వ్రాయటం ఆశ్చర్యం కలిగించ వచ్చు. చూడు మామయ్యా! నే నుద్యోగంలో చేరి ఆరు మాసాలు దాటి పోతున్నా పరిస్థితులు...సంఘటనలు నిన్ను మరిపింపచేస్తాయనుకున్నాను. నువ్వన్న మాటలని మరిచిపోవా లను కున్నాను. కాని - నేనెంత మరిచిపోవా లనుకుంటున్నానో నువ్వంత జ్ఞాపకం వస్తున్నావ్. ఇన్నాళ్లూ నా పెళ్ళి విషయం నాకో సమస్యగా కనిపించేది. అభిప్రాయాలు కుదరని నీతో అమ్మా నాన్నా నా పెళ్ళి నిర్ణయిస్తుంటే నిన్ను పెళ్ళిచేసుకోవటం నా కిష్టంలేదని చెప్పటం ఎలాగో తెలియక ఇంతకాలం సతమతమయాను. ఇప్పుడు నా సమ స్యకి పరిష్కారమార్గం కనిపించింది. మామయ్యా! గాభరాపడుతున్నావు కదూ? ఫరవాలేదు చదువు ... నువ్వు కాలేజీ చదువుతున్న రోజుల్లో 'సుజాత' అని నీకో మంచి స్నేహితురాలుండటం, నీవు మరిచిపోలేవనుకుంటాను. ఆ అమాయకురాలికి ఆశలు రేపి, అర చేతిలో స్వర్గం చూపి నరకకూపంలో తొయ్యటం కూడా గుర్తుందనుకుంటాను. ఇప్పుడు 'నేను, ఆమె ఒకే దగ్గర పని చేస్తూ ఒకే గదిలో ఉంటున్నాం' — అని చదువుతున్నపుడు నీకు తల తిరిగి పోతుందనుకుంటాను. నీవల్ల తన జీవితం నాశనం అయినందుకు మాన సికంగా చనిపోయి బ్రతుకుతోందిక్కడ. ఒక్కసారి నిండు మనసుతో నువ్వాలో చించలేదా మామయ్యా!...నువ్వు చేసిన పని ఎంత మోసమైనదో ఒక్కసారి ఆలోచించలేకపోయావా? ఎదుటి వ్యక్తిని గూర్చి అనవసరంగా అన్ని మాటలన గలిగిన నువ్వు ... నీ గురించి ... నీ చరిత్ర గురించి ఒక్కసారి కూడా ఆలోచించనే లేదా? ఒక ఆడదాన్ని హింసించి ఆ ఉసురు పోసుకుని నువ్వేం సుఖపడగలవు? నాకు వ్యక్తిత్వం లేదని...మగరాయళ్ళతో వెర్రి వెర్రి వేషాలు వేస్తున్నానని...ఆ రోజు అన్ని మాటలన్నావు కదా? నేనే మగవాణ్ణి మోసగించలేదే? మభ్యపెట్టి మోహ పాశంతో బంధించి నాతో తిప్పుకోలేదే? ఇప్పుడు చెప్పు మామయ్యా 'వ్యక్తిత్వం లేని మనిషి ఎవరో?' ఎదుటి మనిషిని అనబోయేముందు మన గురించి కూడా మనం ఆలోచించుకోవటం మంచిది మామయ్యా?




సరే, ఆ విషయాల్ని వదిలిపెట్టు. మనసంగతులెలా ఉన్నా... యిప్పటికైనా ...పశ్చాత్తాపంతో సుజాతకి న్యాయం చేకూర్చగలనని నమ్ముతున్నాను. ఈ ఉత్తరంతోపాటే అమ్మమ్మకి, తాతయ్యకీ, అమ్మా నాన్నలకీ ఈ విషయంలో ఉత్తరాలు వ్రాసి పోస్టు చేస్తున్నాను. నాకు వేరే సంబంధం చూడవలసిందిగా కూడా నాన్నగారికి వ్రాస్తున్నాను. సంబంధం కుదిరితే నా పెళ్ళి... దైవవశాత్తు నాకు దగ్గరయిన సుజాతతో నీ పెళ్ళి ఒకే చోట జరిగే ఏర్పాట్లు కూడా చేస్తే చాల సంతోషం...

టాటా మామయ్యా!

వెంటనే నీనుంచి మంచి ఉత్తరం కోసం నిరీక్షిస్తున్న

నీ మేనకోడలు

సుశీల."

ఉత్తరం వ్రాయటం ముగించి సంతృప్తిగా నిట్టూర్చింది సుశీల.



# సంగీత లుబ్ధుడు

(అరేబియన్ రాత్రుల కథ)

ఒకనాడు ఇషాక్ ఇబన్ ఇబ్రాహీమ్ అనే ప్రసిద్ధ గాయకుడు ఖలీఫా హారూన్ అల్ రషీద్ దర్శనార్థం వెళ్లేసరికి, ఖలీఫా వెంట ఆయన వజీరు అల్ ఫదల్, అల్ హిజాజ్‌కు చెందిన పెద్ద మనిషీ ఉన్నారు. ఆ పెద్దమనిషి ముఖం అందంగానూ, గంభీరంగానూ ఉన్నది. ఇషాక్ ఆయనను ఎన్నడూ చూసి ఉండలేదు.

"వారి నామధేయం ఏమిటి ?" అని ఇషాక్ అడిగాడు.

"సుప్రసిద్ధ కవీ, గాయకుడూ అయిన మాబద్ వీరి తాతగారు. వారి పేరు మీరు వినే ఉండాలి", అన్నాడు అల్ ఫదల్, ఇషాక్ ముఖం వికసించటం చూసి.

ఇషాక్ తన చిన్నతనంలో ఆ కవి గాయకుడంటే పడి చచ్చేవాడు. ఈ పెద్దమనిషిని మంచిచేసుకుంటే తన తాతగారి రచనలన్నీ పాడి వినిపిస్తాడనీ, ఇతని గొంతు శ్రావ్యమైనదనీ అల్ ఫదల్ ఇషాక్‌కు రహస్యంగా చెప్పాడు.

ఆ ప్రకారమే ఇషాక్ ఆ అల్ హిజాజ్ పెద్దమనిషితో గౌరవంగా మాట్లాడి, చిట్టచివరకు, "అయ్యా, తమ తాతగారు ఎన్ని కృతులు రచించారో చెప్పగలరా ?" అని అడిగాడు.

"అరవై మాత్రమే", అన్నాడాయన.

"వాటిలో మీకు హెచ్చు ప్రియమైనదేదని అడిగితే తమరు అన్యథా భావించరు గద ?"

"సంభై మూడో రచన నిస్సందేహంగా అన్నిటినీ మించినది. దాని పల్లవి 'ముత్తైకా గళము సొంపు' అని ప్రారంభమవుతుంది."

ఇలా అంటూనే ఆయన ఇషాక్ చేతినుంచి తంత్రీవాద్యం తీసుకుని, అక్కడక్కడా స్వరస్థానాలు పలికిస్తూ, ఆ పాట సాంతం పాడేశాడు. ఆయన శారీరం నిండుగానూ, నిర్దుష్టంగానూ ఉన్నది. ఆ పాటలోని భావం సంగీతంలో ఎంత బాగా వ్యక్తమయిందంటే ఇషాక్ పూర్తిగా పరవశుడై పోయాడు.

ఇషాక్ ఏకసంథాగ్రాహి. ఎంత క్లిష్టమైన స్వర రచన అయినా ఒక్కసారి వింటే అతనికి జ్ఞాపకం ఉంటుంది. అందుచేత అతను ఆ పాటను తన మనసులో మళ్లీ అనుకోలేదు.




తరవాత త్వరలోనే ఆ పెద్దమనిషి సెలవు పుచ్చుకుని, మదీనాకు బయలు దేరాడు. ఇషాక్ సంగీతం మత్తుతోనే తన ఇంటికి వెళ్ళాడు.

ఇంటికి చేరుతూనే అతను తన తంత్రీవాద్యం తీగలు నిర్దుష్టంగా శ్రుతి చేసి, తాను విన్న పాటను వాయించ టానికి ప్రయత్నంచేస్తే, అదేం చిత్రమో, కొంచెం కూడా జ్ఞాపకం రాలేదు. ఆఖరుకు రాగ లక్షణం కూడా స్మరణకు రాలేదు. యధాలాపంగా విన్నా కూడా అతను మామూలుగా నూరు పాటలు ఒక్కసారి విని జ్ఞాపకం పెట్టుకోగలడు. కాని ఈసారి అతని మెదడుకూ, పాటకూ మధ్య పెద్దగోడ అడ్డంవచ్చినట్టయింది.

అతను ఆ పాటను జ్ఞాపకం తెచ్చు కోవాలని అహోరాత్రాలు బుర్రబద్దలు కొట్టుకున్నాడు. కాని ప్రయోజనం లేక పోయింది. చిట్టచివరకు నిరాశచెంది, మాబద్ రచించిన సలభై మూడో వాగ్గేయం ఎవరికైనా తెలుసునా అని వాకబుచేస్తూ, ఇషాక్ బాగ్దాదులోనూ, మోసుల్‌లోనూ, బస్రాలోనూ, చివరకు ఇరాక్ అంతటా కాలుకాలిన పిల్లిలాగా తిరిగాడు. కాని అతనికి కావలసినది చెప్పినవారు లేరు.

శాశ్వతంగా ఇలా మధనపడలేక, ఇషాక్ ఎడారిదాటి మదీనాకే ప్రయా ణమైపోయి, కవి గాయకుడి మనవడి చేత ఆ పాటను ఒక్కసారి పాడించి వినాలని నిశ్చయించుకున్నాడు. అతను ఈ నిర్ణయానికి వచ్చేసరికి, బస్రాలో నదీతీరం వెంబడి, గాడిద పైన పోతున్నాడు.

అకస్మాత్తుగా, మంచి దుస్తులు ధరించిన మంచి కులంయువతులిద్దరు అతని గాడిదను కళ్ళెం పట్టి ఆపారు.

పాటమీదనే ధ్యాస ఉంచిన ఇషాక్ చిరాకుగా, "వదలండి !" అన్నాడు. అతను మొరటుగా కళ్ళాన్ని వాళ్ళ చేతి నుంచి లాగేసుకోబోయాడు కూడా.

అంతలో ఒక యువతి మేలిముసు గులోనుంచి చిరునవ్వు నవ్వి, "సాహబ్. పాటమీద నీ ముక్కువంతా ఏమయింది, ఇషాక్ ? 'ముత్రైకా గళము నింపు' అన్న పాటకోసం వెతకటం మానేశావా ఏం ?" అని అడిగింది.

ఇషాక్ జవాబు చెప్పేలోపుగా ఆమె మళ్ళీ, "ఆ అల్ హిజాజ్ పెద్దమనిషి పాట పాడి ఖలీఫాకూ, వజీరుకూ విని పిస్తున్నప్పుడు, నేను జనానా తెరచాటు నుండి నిన్ను చూశాను, ఇషాక్. నువు మెలికలు తిరిగిపోయావు. తల ఆడిం చావు. నీకు మతిపోయిందనుకున్నాను", అన్నది.

"అప్పటికన్న ఇప్పుడింకా వెర్రెత్తి ఉన్నాను. ఆ పాట మళ్ళీ వినటానికి ఏం ఇయ్యమన్నా ఇస్తాను – అపస్వరా లతో పాడినా సరే – అతుకు లతుకులుగా పాడినా సరే ! ఒక్క స్వరంకోసం పదేళ్ళ ఆయువు ధారపోస్తాను. ఓ అందాల రాశీ, నా మనోవ్యథను అధికం చేశావు. నా నిరాశమీద ఊది, దాన్ని ప్రజ్వలింపజేశావు. నాకు అదంతా ఎందుకు జ్ఞాపకం చేశావు? దయ ఉంచి, నన్ను మదీనాకు వెళ్ళనీ", అన్నాడు ఇషాక్.

ఆమె కళ్ళాన్ని వదిలిపెట్టక నవ్వుతూ, "నేనా పాట పాడి వినిపించే ట్టుంటే మదీనాకు వెళ్ళవలసిన అవసరం ఉంటుందా ?" అని అడిగింది.

"దయామయీ, అసలే దుఃఖంలో ఉన్నాను. నన్ను ఇంకా ఎందుకు హింస పెడతావు ?" అన్నాడు ఇషాక్.

అంతలోనే ఆమె, అతన్ని దుఃఖమై పట్టిన పాటను పాడనారంభించింది. ఆమె శారీరమూ, గాననైపుణ్యమూ ఆ పెద్దమనిషికన్న వెయ్యిరెట్లు బాగు న్నాయి. ఇంతకూ ఆమె గొంతు అంతా విప్పి పాడనేలేదు ! ఆ పాట వింటుంటే అతని హృదయారాటం క్రమంగా శాంతించింది. అతను గాడిదమీదనుంచి కిందకు దిగి, ఆమె కాళ్ళవద్ద మోక రించి, ఆమె పాదాల అంచు ముద్దు పెట్టుకుని, "నువు అంతులేని వెల ఇచ్చి కొన్నావు. నేను నీ దానిసను. నా ఇంటికి వచ్చి నా ఆతిథ్యం స్వీకరించ రాదా ? నువు ముత్రైకా పాట పాడుమువు గాని. నేను అహోరాత్రాలు నీకు పాడి వినిపిస్తాను," అన్నాడు.

"ఓ ఇషాక్, మాకు నీ స్వభావం తెలుసు. నువు నీ పాటలను లోభంతో దాచుకుంటావు. నువు ఏ శిష్యుడికీ ఒక్క పాటపైన చెప్పలేదు; నీ రహస్య ఒకటి






మించి నీ శిష్యులను పాడనియ్యలేదు. వాళ్ళు పాడిన ఇతర పాటలు ఇతరులు రచించినవి; ఇతరులవద్ద నేర్చుకున్నవి. అసూయాపరుడివికనక, నువు మమ్మల్ని సరిగా చూడవని నా అనుమానం. నీకు కావలిసినది ఈ పాటే అయితే అది నీకు కంఠస్థం అయినదాకా పాడి వినిపిస్తాను," అన్నదామె

"నేను నీకు నా రక్తం ధారపోస్తా... ఇంతకూ నువు ఎవరు? నీ పేరేమిటి?" అని ఇషాక్ ఆమెను అడిగాడు

"నేను ఒక సాధారణ గాయకిని పక్షులతో ఆకులు ఏమంటాయో, ఆకులతో గాలి ఏమంటుందో ఆలకించే వారిలో ఒకతెను. నా పేరు వాహ్బా నా పేరు ఒక కవి ఒక గేయం కూడా రాశాడు," అని ఆమె ఒక గేయం పాడింది.

దాన్ని రచించిన కవి ఫర్రూక్. దానికి వాహ్బాయే స్వరకల్పన చేసింది. ఆ పాటా, దానిలోని స్వర రచనా, దాన్ని ఆమె పాడిన తీరూ ఇషాక్‌ను ఉన్మత్తుణ్ణి చేశాయి. అతను ఆమెను తన ఇంటికి రమ్మని తెగ బలవంతం చేసినమీదట, ఆమె తన సోదరితోబాటు అతని వెంట వెళ్ళటానికి ఒప్పుకున్నది.

ఆ పగలూ, ఆ రాత్రి అంతా వారికి సంగీతంలోనె గడిచిపోయింది. వాహ్బా లాటి గాననైపుణ్యంగల మనిషి ఎక్కడా లేదని ఇషాక్‌కు అనిపించింది. అతనికి ఆమెమీద అపారమైన ప్రేమ పుట్టుకొచ్చింది. ఆమె ఆతనికి తన గళమేగాక, శరీరంకూడా అర్పించి, చాలా ఏళ్ళపాటు అతని జీవితానికి ధ్రువతారగా వెలిగింది.

## రామా చంద్రమౌళి



సుధాకర్‌కు ఎంతో సంతోషంగా ఉంది.

ఆఫీస్ అయిపోగానే ఎంతో హుషారుగా బయలుదేరి, తోవలో మల్లెపూల చెండు కొనుక్కొని యింటిదగ్గర తనకోసం ఎదురుచూస్తూ ఉండే భార్యను ఊహించుకుంటూ వడివడిగా నడుస్తున్నాడు.

పైన మేఘాలు అరుస్తున్నాయి. కొద్దిగా గాలిదుమారం కూడా లేస్తోంది. ప్రకృతి మసకపట్టిన అద్దంలా తయారైంది.

సుధాకర్ అవేవీ పట్టించుకునే స్థితిలో లేడు. ఆ రోజే అతని రెండు వేల రూపాయల ఎరియర్స్ వచ్చాయి. వాటితోపాటు జీతంకూడా వచ్చింది.

జేబులోనుండి ఉత్సాహం అతని గుండెల దాకా ప్రవహిస్తోంది.

రెండు వేల ఐదుపందలకు సరిపడే ప్లాన్స్, ప్రపోజల్స్, బ్లూ ప్రింట్లూ, ట్రూకాపీలతో సహా అతని బుర్రలో గిరగిరా తిరిగి బహు మారాం చేస్తున్నాయి...స్టీల్ బీరువా ... ఓ సోఫా... ఓ నాల్గు చీరలు ... తనకో నాల్గు పాంట్లూ, షర్ట్స్ ... యింకో గ్యాస్ స్టవ్—యింకా ఎన్నో ... ఎన్నో ... ఎన్నెన్నో—

యింటి గుమ్మంలో కొచ్చిన సుధాకర్‌కు లక్ష్మి ఎదురురాలేదు నవ్వుతూ.

గుండుసూది గుచ్చుకున్న గాలి బుడగలా అయిపోయాడు.

"లక్ష్మి ... లక్ష్మి —" అని పిలిచాడు.

ఉహుఁ...జవాబు లేదు.

పంచేస్తున్నట్టూ లోపల ... రోజూ తను యింట్లోకి అడుగుపెట్టగానే కిలా కిలా పసిపిల్లలా నవ్వుతూ ఎదురొచ్చి పలకరించే లక్ష్మి ... యివ్వాళ ..., వ్చ్—

చేతిలోని పూలపొట్లాన్ని టేబుల్‌పై పెట్టి చొక్కావిడుస్తూ ప్రక్కగదిలోకి చూశాడు సుధాకర్.

పడకగదిలో టేబుల్ ముందర కూర్చుని లైటు వెలుగులో ఏదో రాసుకుంటోంది లక్ష్మి సీరియస్‌గా.

యింత తీవ్రంగా ఏం రాస్తోందబ్బా. దేన్నీ పట్టించుకోకుండా ఏకధాటిగా రాసేందుకు లక్ష్మి ఓ రచయిత్రయినా కాదుగదా—మరి...

మెల్లగా ... పిల్లిలా ... చప్పుడు చేయకుండా నడిచి ... ఆమె వెనుకగా చేరి...

ప్చ్... లక్ష్మి తనను గమనించినట్టే లేదు ... ఏమిటి నిమగ్నత ... తనను కూడా పట్టించుకోకుండా ఏమిటా రాత.

వెలుగులో రాసుకుంటున్న లక్ష్మి కాంతి వర్షంలో మెరిసిపోతున్న సరస్వతిలా ఉంది.

ఆమె భుజంపైనుండి చూస్తూంటే—

డియర్ రామూ,

మన మధ్య ఈ ఉత్తరాలతో నా దాహం తీరడంలేదు. నేను యింక ఎంత కాలం మా వారికి తెలియకుండా నీకిలా ఉత్తరాలు రాయను చెప్పు. నువ్వు ప్రతి రోజూ రాస్తున్న ఒక్కో ఉత్తరం నాలో కోటి వసంతాలను పూయిస్తోంది. నిజంగా నాపై నీకున్న ప్రేమ ... అనురాగం ... అభిమానం అసామాన్యమైనవి. నీతో యీ రకంగా యీ మధురానుభూతిని పంచుకోగలిగే అదృష్టం నాకు కలిగినందుకు నేనెంత గర్విస్తున్నానో తెలుసా. నిజంగా మనది ఎన్నెన్నో జన్మల బంధం. ఏ అనుబంధమో మన యిద్దరినీ యిలా కలిపింది.

కాని ... యింకా యీ ఎడబాటును నేను సహించలేను. నాకు యీ భర్తా, యీ యిల్లూ, యీ సంసారం ... యీ ఆస్తిపాస్తులూ ... అసలీ ప్రపంచమే వద్దు. నువ్వే కావాలి. నీ సన్నిధి నాకు అంతులేని పెన్నిధి. యీ ఉత్తరాలతో మన నడుమ యింకా కాలాన్ని వృధా చేయడం నాకిష్టం లేదు. నన్ను నీతో తీసుకుపో. ప్లీజ్. నా వేదననూ, నా తపననూ అర్థంచేసుకో. నా మనసంతా నువ్వే నిండి ఎటు చూచినా నీ రూపమే కనబడుతోంది నాకు. నా తనువులోని అణువణువునా నువ్వే స్పందిస్తున్నావు. నేనింకా ఎంతోకాలం ఈ విరహాన్ని భరించలేను.

అసలు...మన నడుమ పవిత్రమైన వివాహబంధం నెలకొనవలసింది ... మన దురదృష్టవశాత్తు, తప్పిపోయి... యిక్కడ యీయనతో మనసులేని మనువాడి...యీ నాలుగేండ్లలో నేనెంత నరకాన్ననుభవించానో నీకు తెలియదు ... అయినా ఫర్వాలేదు ... యిప్పుడు నువ్వొచ్చావు.

నా గుండె గుడిలో నేను ప్రతిష్ఠించుకున్న నీ రూపు యింకా పవిత్రంగా ఉంది. రాత్రింబవళ్ళూ నీ ఆరాధనలోనే జీవిస్తున్న నన్ను యింకా ఆలస్యం చేయకుండా నీ వెంట తీసుకుపో రాము...ప్లీజ్—

యింకా రాస్తోంది.

సుధాకర్ తలలో కోటి డైనమైట్లు ప్రేలాయి.

"యూ డర్టీ! బ్రూట్—" అరిచాడు బిగ్గరగా.

లక్ష్మి వెనక్కి తిరిగి ఎంతో మామూలుగా అతనివంక చూచి "ఎంత సేపైంది వచ్చి?" అంది ఎంతో నెమ్మదిగా.

"అదంతా నీ కనవసరం...నిన్నూ ...నిన్నూ—"

మనిషి పశువుకన్నా క్రూరంగా, వికారంగా తయారౌతున్నాడు. కళ్ళు నిప్పులై పిడికిళ్ళు బిగుసుకుపోతున్నాయి.

"ఎందుకంతగా ఆవేశపడుతున్నారు."

"ఎందుకా...తూ ...నువ్వో బజారు ముండవి. నిన్ను యీ నాలుగేళ్ళ దేవతలా పూజించాను గదే. నిర్మలంగా, సంగనాచిలా నవ్వే నిన్ను చూచి నువ్వు పసిపాపలాటి అమాయకురాలవనుకున్నాను యిన్నాళ్లూ. కాని—యిప్పుడు నిన్నూ, నీ నిజస్వరూపాన్ని చూస్తూంటే ... యిలాగే పిచ్చికుక్కను కాల్చినట్టు కాల్చేయాలనిపిస్తోంది ... చెప్పు ... ఎవడు వాడు ... ఎన్నాళ్ళనుండి సాగుతోందీ నాటకం ... చెప్పు—" గర్జించాడు.

"......"

"మాట్లాడవేం—" ఆమె చేతిలోని

కాగితాన్ని లాక్కుని... "యింకా యీ విరహాన్ని భరించలేవా ... యింకా యీ ఎడబాటును సహించలేవా ... ఛీ...లజ్జ ... సిగ్గు లేదూ ... పెళ్ళిచేసుకుని కాపురం చేసుకుంటున్నదానివి యింత బరితెగించి...నిన్నూ ... నిన్నూ—"

లక్ష్మి చెంపలను యిష్టమొచ్చినంత సేపు వాయించాడు. చేతిలోని కాగితాన్ని ముక్కలు ముక్కలుగా చింపి నేలకేసి కొట్టి...మళ్ళీ ఆమె భుజాలను పట్టుకుని కుదిపి ... తలను గోడకేసి బాది ... కసితో, కోపంతో ఊగిపోతూ—

"నీకేం తక్కువయింది ... నేను ప్రేమగా చూచుకోలేదా...నిన్ను నిరాదరణగా చూశానా... నా గుండెల్లో పెట్టుకుని పూజించానే...నువ్వే నా జీవితమనీ ...నీ తోడిదే స్వర్గమని భావించానే. నువ్వు కావాలన్నవన్నీ యిచ్చి ... నీ యిష్టాలన్నీ తీర్చి ... ఏం తక్కువైంది నీకు — చెప్పు ... చెప్పవేమిటే డర్టీ రోగ్..."

"......"

"పోనీ ... నిన్ను యిల్లు వదలనీయకుండా బందీనైనా చేయలేదుగదా. నీకు కావాల్సినంత స్వేచ్ఛనిచ్చాను. నీ సంస్కారాన్ని ఎంతో గొప్పగా అర్థంచేసుకుని నీకు స్వతంత్రాన్నిచ్చాను .. అందుకు నువ్వు నా కిచ్చిన ప్రతిఫలం యిదా...ఐ కాంట్ టాలరేట్... రాక్షసీ...యూ గెటౌట్..."

"......"

"ఏడుస్తున్నావా యింకా సిగ్గులేక... ఛీ ... యిప్పుడు నిన్ను చూస్తుంటే నాపై నాకే అసహ్యమేస్తోంది. యీ నాలుగేళ్ళూ నీతో సంసారం చేసినానని తెలిసి...ఆనాటినుండీ ఏ పిశాచంతోనో కాపురంచేసినట్టు ఫీలౌతున్నాను ... నువ్వింకా నా ముందుంటే నేనేం జేస్తానో నాకే తెలియడంలేదు. నేను నిన్నింకా హత్య చేయకముందే యీ యింట్లోనుండి వెళ్ళిపో ...పో—"

"......"

"గెటౌట్ ..." యిల్లంతా ధ్వనించింది గదిలో బాంబు ప్రేలినట్టు.

గబగబా వెళ్ళి ఓ సూట్ కేస్‌ను తెచ్చి ఆమె ఎదురుగా నేలపై విసిరికొట్టి ఎదురుగా దండెంమీది ఆమె తాలూకు చీరలూ, బట్టలూ ఆమె ముఖంపై విసిరేసి..."కమాన్...వెళ్ళిపో ... నా కిక ఎన్నడూ నీ ముఖం చూపించకుండా... తక్షణం నా ముందటినుండి పో ... యింకో క్షణమాలస్యమైతే నేనింకా పిచ్చాన్నయి నిన్ను కండలు కండలుగా కోసేస్తాను...ఊఁ .."

"......"

ఆమె మాట్లాడలేదు. నిశ్శబ్దంగా ఏడుస్తోంది.

బయట ఆకాశం బ్రద్దలైపోతున్నట్టుగా ఉరుములు...వానకూడా కురుస్తున్నట్టున్నది. చీకటిపడి కిటికీలోనుండి

ప్రపంచం నల్లగా ... ఎలుగుబంటు తోలులా భయంకరంగా కనిపిస్తోంది.

సుధాకర్ వంగి గబగబా సూట్‌కేస్‌లో క్రిందపడిఉన్న బట్టలను కుక్కి సూట్‌కేస్‌ను బలవంతంగా ఆమె చేతిలో పెట్టి మెడబట్టి బయటికి— వీధిగుమ్మం అవతలకు నెట్టేసి లోపలికొచ్చాడు.

ఉరుములు...మెరుపులు... వాన... అతని మనసులో — ఆమె మనసులో.

గదిలో లైటు వేసుకోలే దతను... చీకట్లో కూర్చుని ఉండిపోయాడు.

కన్నుల్లో...గదిలో ... బయటా... లోపలా—అంతా చీకటి...చీకటి.

గతం తాలూకు జ్ఞాపకాలు సముద్రంలా పొంగి ... అనుభవాలు పగిలిన శిల్పాల్లా వెక్కిరించి...నిజం దయ్యంలా ఎదుట నిలబడి నవ్వుతూంటే...

ఆలోచనల వాననుండి తేరుకుని— టైం చూసుకున్నాడు సుధాకర్.

తొమ్మిదైంది

అప్రయత్నంగానే వీధిగుమ్మం తెరిచి చూశాడు.

అప్పటినుండీ వానలో తడుస్తూ... అరుగుపై నిలబడి ... సూట్‌కేస్‌తో— లక్ష్మి...లక్ష్మి...లక్ష్మి.

లక్ష్మి యింకా అలాగే ఉంది.

యింటి యజమాని కసరికొడు తూంటే దీనంగా, నిస్సహాయంగా చూస్తూన్న బిచ్చపుదానిలా ... చూస్తూ ఆమె—

అతను ఆమె దిక్కు విగ్గరగా ఉమ్మేశాడు తుపుక్కున ... కసిగా... అసహ్యంగా.

లక్ష్మి మళ్ళీ ఓసారి అతని దిక్కు చూచి నడిచింది వానలోకి...చీకట్లోకి.

* * *

"ఛీ ఛీ...ఎందుకు తన జీవితమిలా నరకమైపోయింది ... తనేం పాపం చేశాడని తనకు బ్రతుకిలా శాపంలా పరిణమించింది ... ఓహ్ ... యీనాళ యీ జీవితాన్ని వ్యధతో... బాధతో... మధనంలో కుమిలి...కుమిలి ... అటు లక్ష్మి ... ఆ తర్వాత యిటు యీ జానకీ...తనను జలగల్లా హింసించి... అబ్బా ... గతం ఓ ముళ్లపొదలో పొర్లాటలా వికారంగా ... జుగుప్సాకరంగా — నో నో ... తనీ బాధను భరించలేడు ... యింకా యీ జ్ఞాపకాల నిప్పుల వానలో తడువలేడు ... నో నో నో...బెడ్‌పై బిగ్గరగా అరుస్తున్నాడు సుధాకర్. అరుస్తూ బాధగా పొర్లుతున్నాడు మంచంపై. కడుపులో నొప్పి ... గుండెల్లోనొప్పి ... తలలో నొప్పి...

అతని అరుపులను వినేవారెవరూ లేరు యింట్లో...అంతా నిశ్శబ్దం.

దిక్కు లేదు.

కనీసం పరామర్శించే మనుషులూ లేరు.

బాధగా మూల్గి ఒత్తిగిలి పడు కున్నాడు.

మళ్ళీ ఆలోచనలు కుమ్మరి పురుగులా తొలుస్తున్నాయి మెదడును.

లక్ష్మి తననుండి వెళ్ళిపోయిం తర్వాత ... ఆమెపై అసహ్యంతో, కసితో, ద్వేషంతో, ఆవేశంతో — తను మరో పెళ్ళి చేసుకున్నాడు, జానకిని.

మళ్ళీ క్రొత్త జీవితాన్నారంభిద్దా మనుకున్నాడు.

జానకికి షోకు లెక్కువ. ఖర్చు లెక్కువ. వజ్రాలపై మక్కువ లెక్కువ. వయ్యారా లెక్కువ.

తన ఆరోగ్యం, ఉద్యోగం సరిగ్గా ఉన్నంతకాలం ఎంతో అణకువగా ఉంది. కాని ఆరోగ్యం చెడి, దాంతో ఉద్యోగం ఊడి ... తను జారిపోవడం ప్రారంభించాక ... ఆమె వలస పక్షిలా ...తనను నిర్లక్ష్యంచేసి... విడిచి పెట్టి నట్టుగానే విచ్చలవిడిగా ...యిష్టమున్న విధంగా, యిష్టమున్నప్పుడు యిల్లు వదలి ... రాత్రింబవళ్లు తేడా లేదు. తనపై ధ్యాసలేదు ... ఎవరికివారే యమునా తీరే...ప్చ్—

లక్ష్మి తననుండి దూరమై ఒట్టి వికారమైన జ్ఞాపకాలనే మిగిల్చింది. కాని జానకి...ప్రత్యక్షంగానే నరకాన్ని చూపిస్తోంది తనకు.

ఓహ్—యీ దారిద్ర్యాన్నీ ...యీ నిరాదరణనూ ... యీ కూలిపోయిన జీవితాన్ని తనింకా భరించలేడు... భరించలేడు.

మెల్లగా లేచి బయటి అరుగుదాకా వచ్చాడు.

వీధిలో ఎండ మండిపోతోంది.

దాహం ... దాహం ... ఆకలి ... ఆకలి ... కాని ఎవరు తీరుస్తారు వాటిని.

దుఃఖం ముంచుకొచ్చి ముఖాన్ని దోసిలిలో కప్పుకున్నాడు ... ముఖం నిండా ముడుతలు... యీ పదేండ్లలోనే ఎంత మారిపోయాడు తను.

జానకి ఎక్కడికిపోయిందో—ప్చ్.

"పోస్ట్—"

తలెత్తాడు సుధాకర్.

కవరందించాడు పోస్ట్‌మాన్.

తనకు ఉత్తర మెక్కడినుం డొస్తుంది.

చించాడు.

క్రాస్డ్ చెక్ ఉంది ఓ ఐదువేల రూపాయలకు.

కళ్ళు చికిలించి చూశాడు మళ్ళీ ... సందేహం లేదు. తన పేరనే ఉంది చెక్కు. కలకత్తాలోని సెంట్రల్ బ్యాంకాఫ్ ఇండియాలోని అకౌంట్‌నుండి డ్రా అయింది.

కలకత్తాలో ఎవరున్నారు తనకు... యీ నికృష్ట స్థితిలో తనను ఆదుకునే ఆ దేవుడులాంటి మనిషి ఎవరు.

చెక్కుకు పిన్‌చేసి ఉన్న ఉత్తరాన్ని విప్పాడు.

శ్రీ సుధాకర్ గార్కి,

నమస్తే,

నే నెవరోనని ఆశ్చర్యపోతున్నారు గదూ—

నేనండీ—లక్ష్మిని.

మీతో దూషించబడి, పతితనై మీ యింట్లోనుండి గెంటివేయబడ్డ లక్ష్మినండీ—

ఆనాడు ... మీతో యింట్లోనుండి వెళ్లగొట్టబడ్డ రోజున ... ఏమయిందో తెలుసా.

...అంతకుముందే నాకు కాళ్ళ వ్రేళ్ళూ, చేతులూ మంటగా, దురదగా ఉండేవి. ఓసారి మన యింటి ప్రక్క లక్ష్మమ్మ దవాఖానాకు వెళుతూంటే నేనూ తోడుగా వెళ్ళి నేను కూడా డాక్టర్‌కు చూపించుకున్నాను.

అతను నన్ను రహస్యంగా పిలిచి ఓ భయంకరమైన విషయం చెప్పాడు.

ఆ తర్వాత—మళ్ళీ ఓసారి మీకు తెలియకుండానే ధరో చెకప్ చేయించుకున్నాను. నేను అనుకున్నది నిజమే అయింది...అతను చెప్పిందేమిటంటే—నాకు కుష్ఠు.

కుష్ఠు అంటువ్యాధి...నేను పతనమై పోతూ ... దేవుడులాంటి మిమ్మల్ని కూడా పతనంవైపు లాక్కుపోతూ ... నో — నా మూలంగా మీరు నాశనమయ్యేందుకు వీల్లేదు. నేను మీనుండి దూరమైపోవాలి. మిమ్మల్ని నా నుండీ, నా రోగంనుండీ రక్షించాలి... ఎలా... ఎలా.

ఆలోచించాను...ఆలోచించాను.

ఫలితం ఆనాటి ఆ ఘర్షణ ... ఆ తుఫాను.

ఆ వానలో ... ఆ చీకట్లో మీనుండి దూరమై...పగిలిన గుండెలతో కలకత్తా వచ్చాను. వచ్చి మథర్ తెరీసా హోమ్‌లో...

కాని ... యిప్పుడు నాకిక జీవితం అయిపో వచ్చింది. బహుశా యీ ఉత్తరం మీకు చేరేవరకు నేనింకా భూమ్మీద ఉండను.

దీంతో జతపరిచిన ఐదువేల రూపాయల్లో యిన్నాళ్ల శ్రమ ఉంది. హృదయం ఉంది. సహృదయతతో స్వీకరించి నాకు ఆత్మశాంతి చేకూరుస్తారని ఆకాంక్షిస్తూ—సెలవు.

నీ

లక్ష్మి.

సుధాకర్ కళ్ళలోనుండి వెచ్చగా కన్నీటిధారలు కారుతున్నాయి.






'ఈ చుట్టుపక్కలకి బలిరామయ్యగారే-
దుర్యోధనుడు'

ఇలా ప్రారంభిస్తే చాలామందికి గందరగోళంగా వుంటుంది. విషయం ఏమిటంటే—

ఆ రోజుల్లో బలిరామయ్యగారు 'మయసభ' ఏకపాత్రాభినయాన్ని–నమిలారనండి– మింగారనండి–ఆపోశన పట్టారనండి–ఏమైనా అనండి. మొత్తానికి మాస్టర్ చేసారని చెప్పొచ్చు. దుర్యోధన పాత్రని కాచివడబోసారు. మా ప్రాంతంలో షుమారుగా రెండు వందల ప్రదర్శనలిచ్చి సెహభాస్ అనిపించుకున్నారు. దుర్యోధనుడంటే తనే అని ముద్రవేయించుకున్నారు.

ఆరడుగుల భారీ విగ్రహంతో విశాలమైన ఛాతీతో మగసిరి నిండిన బాహువల్లరితో స్ఫురద్రూపంతో ఆయన

స్టేజీకి మకుటాయమానంగా నిలబడేసరికి జనం జేజేలు కొట్టేవారు. ప్రత్యేకంగా కుట్టించిన రాజదుస్తుల్లో దుర్యోధనుడు యిలాగే వుండేవాడేమో- అనిపించేవారు.

ఏకపాత్రాభినయం- ఒక గంట ప్రోగ్రాం.

ఆ గంటలో తనూ తెరలూ తప్ప ఏ హంగు ఆర్భాటంలేని స్టేజిమీద బులి రామయ్యగారి విశ్వరూపం చూడాలి. ఆయన విజృంభణ చూడాలి. అడ్డూ ఆపూ లేక జలపాతంలా దూకే సుదీర్ఘ సమాసాల సంభాషణలు వినాలి. సందర్భాన్ని బట్టి ప్రదర్శించే హావభావభంగిమలు... సంభాషణల మధ్య విరుపులు.. పాటించే అందమైన విరామాలు గమనించాలి.

అద్భుతంగా వుండే దా అనుభవం.

దుర్యోధనుడు మయసభలో ప్రవేశించి... రమణీయ ఉద్యానవనాలు సభాసౌందర్యం తిలకించి మయుని శిల్ప రచనా చమత్కృతికి అబ్బురపడ్డం- ఆనందించడం- అభినందించడం- అంతలోనే ఈర్ష్యపడ్డం- తీరా అసూయ మొలకెత్తాక అక్కడ నిలవలేకపోవడం- చక్కగా నటించేవారు.

సుయోధనుడు శిల్పాన్ని చూసి చిన్నదనుకున్న సందర్భంలో శిల్పానికి ప్రశ్నలు గుప్పించి జవాబురాక అటు యిటు చూసి స్పృశించి భంగపడే ఘట్టం మరుపురానిది.

సభలో ద్వారంలేని చోటు ఉన్నట్టు వుంటుంది. ద్వారం ఉన్నచోట దూసుకుని వెళ్ళబోతే... రపీమని గుద్దుకుని తలకి బొప్పి కడుతుంది. దిగ్భ్రమలో ప్రేక్షకులు కూడా నొసళ్ళు తడుముకునే వారు. సరోవరం లేనిచోట ఉన్నదను కోడం- లేనిచోట దాన్లోపడి తడిసిపోడం కూడా ముఖ్యమైన ఘట్టం.

తన పరిస్థితి చూసి పాంచాలి పరిహసించిందని దుగ్ధ వెళ్ళగక్కిన సన్నివేశం మయసభకి మణిపూస అని చెప్పొచ్చు.

మయుని సృష్టిమాట అటుంచితే- బులిరామయ్య గారు తను మాయలో పడినట్టు నటించి ప్రేక్షకుల కళ్ళముందు మయసభ సృష్టించి భ్రమలో ముంచే సృజన గొప్పది.

అందుకే ఆయన దుర్యోధనుడని మారు పలికించుకున్నాడు.

మాటమాటకీ ప్రతి మూమెంటుకి చప్పట్లు కురిసేవి- అభినయం పూర్త య్యాక పూలమాలలు ఆయన్ని ముంచెత్తేవి.

నిజజీవితంలో బులిరామయ్యగారు దుర్యోధనుడి ముద్ర తప్పించుకోలేక పోయారు. చూపరులకి మహా గర్వపోతులా అవుపించేవారు. సుయోధనుడిలా అభిమానధనులు కూడా దర్జాగా, రీవిగా కనిపించేవారు. పెద్దపెద్ద అంగలతో నడవడం...... గంభీరంగా మాట్లాడ్డం... పెంచుకున్న కోరమీసం మాటిమాటికీ దువ్వుకోవడం లాంటి




పౌరాణిక చేష్టలు చేసేవారు. ప్రతిదానికీ పౌరుషపడేవారు. వాగ్వివాదాల్లో తరచూ ఛాలెంజీలు విసిరేవారు. నటనలో తనని మించినవారు లేరనే భావం ఎంత కాదనుకున్నా కనిపించేది ఆయన మొహంలో.

"తమరు కురుక్షేత్రం ఆడితే కనక వర్షం కురుస్తుంది. ఎత్తుకోకూడదూ ?" అని మెచ్చుకోలుగా అడిగితే—

ఒక ఛీత్కారం చేసి "వెధవది. సరైన కాంబినేషన్ కృష్ణులు, సమవుజ్జీ అర్జునులు లేరయ్యా. అంతా సజ్జుగాళ్ళు! అందుకే మయసభ తప్ప మరోటి ముట్టుకోను" అన్నారు.

ఈ మాటే లోకల్ కృష్ణులు అర్జునుల దగ్గర కదిపితే వాళ్ళు గేలిచేసారు. "సినిమా మూసలో గరంమసాలా సమాసాలు పలకడం కాదు. ముండావాణ్ని రమ్మనండి. మాతో పోటీగా రాగం పట్టమనండి రంగు తేలుతుంది."

* * *

కొన్నేళ్ళు గడిచాయి.

జనవాక్యం మారింది.

"కాశీపతే ఈ చుట్టుపక్కలకి దుర్యోధనుడు."

ఇపుడు కాశీపతి మయసభ ఏకపాత్రాభినయంలో దిట్ట. కాశీపతి నటకౌశల్యమో - బులిరామయ్యగారి నటన క్షీణించిందో—గాలివాటుకి ప్రజల అభిరుచి మళ్ళిందో గానీ—

ప్రస్తుతం కాశీపతి దుర్యోధనుడిగా మార్మోగిపోతున్నాడు.

బులిరామయ్యగారు మాసిపోడానికి కాశీపతి మెరిసిపోడానికి మధ్య—మధ్య కాలంలో ఏం జరిగిందంటే...

ఛాలెంజీ మన స్తత్వంతో ఆయన వి|్రపీగేవారని ముందే మనవిచేసా.

ఓ చల్లటి సాయంత్రం... మిత్రులు అభిమానుల సమక్షంలో 'మయసభ' గురించి ముచ్చటిస్తూ... బులిరామయ్య గారు రెచ్చిపోయారు. మీసం తిప్పి తొడకొట్టి... "ఈ జిల్లాలో ఎవడైనా సరే మయసభ. ఛాలెంజి! చూస్కోండి. ప్రచారం చేస్కోండి. గెల్చినవాడికి వెయ్యినూట పదహార్లు బహుమతి యిస్తా" అన్నారు.

దానితో కలకలం ప్రారంభమయింది.

కాస్సేపటికి సద్దుమణిగింది. అంతా ముక్కుమీద వేలుంచుకుని మౌనం పాటించారు.

కానీ ఓ లేత కంఠం ధైర్యంచేసి "గురువుగారూ" అంది.

"ఏం, నువ్వు పోటీచేస్తావా?" అన్నారాయన. అంతా అటు తిరిగి ఘొల్లున నవ్వారు.

"పోటీగా కాదు. తమరు అనుమతిస్తే తమ సమక్షంలో ఒకసారి నటించి చూపిస్తా" అన్నాడు సవినయంగా.

అతనెవరో కాదు. ప్రతి ప్రదర్శనకీ బులిరామయ్యగారి వెంట నీడలా తిరిగే వాడు, పేరు కాశీపతి.

అంతవరకూ ఏ ప్రత్యేకతా లేని వాడు. అడపాతడపా 'హార్మణీ' తొక్కే వాడు. దుస్తుల పెట్టెలు మోసేవాడు. కర్టెన్లు లాగేవాడు. బులిరామయ్యగారు రంగులుపూసుకోడానికి కడుక్కోడానికి సాయపడేవాడు. ప్రదర్శనకి ముందు పబ్లిసిటీకోసం ఊళ్ళోపడి మైకులో అరిచేవాడు.

అలాంటివాడు ఉన్నట్టుండి సుయోధనుడయ్యాడు.

మిగతావాళ్ళవంక వేళాకోళంగా చూసి... "సరేకానియ్" అన్నారు బులిరామయ్యగారు. కాశీపతికి గురువుగారి ఆమోదం లభించింది. చాటుగా కొందరు కాశీపతిని ఎగదోసారు "ఛాలెంజీగా వెయ్యి. గెలిస్తే వెయ్యినూట పదార్లు దక్కేను" అని. అతను ఒప్పుకోలేదు. కేవలం గురువుగారి ఆశీర్వాదంతోనే నటించి చూపిస్తానన్నాడు.

తీరా ఒప్పుకున్నారే గానీ బులిరామయ్యగారి గుండెల్లో గుబులు ప్రారంభమయింది. కాశీపతి మయసభ నటించడం ఆయనకిష్టంలేదు... ఏమో. యిలాంటివాళ్ళే మెరుపుల్లేని పిడుగులు!

వారం తర్వాత—

హైస్కూలు ఆవరణలో ప్రదర్శన ఏర్పాటయింది.

జనం కిటకిటలాడారు.

యిది బులిరామయ్యగారి శిష్యుడి ప్రదర్శన అనీ... ఆయనతో పోటీ కాకపోయినా... పోటీస్థాయిలో జరుగుతుందనీ...ఆ నోటా ఈ నోటా ప్రదర్శనకి ప్రచారం దక్కింది.

బులిరామయ్యగారు పుర ప్రముఖుల మధ్య ముందు వరసలో కూర్చున్నారు.

ఎదురుగా రకరకాల అలంకరణలతో సిల్కు తెరలతో ముసుగు ధరించిన ముగ్ధలావుంది వేదిక.

ప్రదర్శన ప్రారంభమయింది.

వెలుగు వెల్లువలో తెర తొలగింది.

దుర్యోధనుడి రంగ ప్రవేశం!

బులిరామయ్యగారి గుండెలు ఝల్లు మన్నాయి.

కాశీపతి— కొత్త సుయోధనుడు కొదమసింగంలా అడుగులు వేస్తూ భుజాలు పొంగించి ధగధగ మెరిసిపోతు న్నాడు.

గురువుగారివి రెండు పండల ప్రదర్శ నలు చూసాడేమో మెళకువలు ఆకళింపు చేసుకున్నాడు. ఆద్యంతం సంభాషణలు ఆయన్నుంచే గ్రహించాడు.

కానీ తన గొంతుతో పలికాడు.

తన అడుగులు వేసాడు.

నటనలో తనదంటూ కొత్త ఒరవడి సృష్టించి మధ్యలో చెడకుండా నడిపి నిలిపాడు. ఏదో ప్రత్యేకత సాధించాడు.

కాశీపతి మయసభని వర్ణించడం నా తరంకాదు. కానీ అది జరుగుతున్నంత సేపూ రేపిన దుమారం విన్నవించ గలను

భూకంపమొచ్చి భవంతులు కూలి పోయినట్టు ప్రేక్షకుల హృదయాల్లో బులిరామయ్యగారి రూపం తుడుచు పెట్టుకుపోయింది.

భూకంపం తర్వాత రెట్టింపు ప్రగతి సాధించిన చురుకు దేశంలా కాశీపతికి గొప్ప పేరు దక్కింది.

మయసభ జరుగుతూంటే— పక్కన బులిరామయ్యగారి ఉనికి మర్చిపోయిన పుర ప్రముఖులున్నారు. అలాగే— వేదిక మీద కాశీపతిని, ఆయన్ని మార్చి పోల్చి చూసి నవ్వుకునేవాళ్ళూ వున్నారు

వీళ్ళందరిమధ్య బులిరామయ్యగారికి తల తిరిగిపోయింది. ఒళ్ళంతా స్వేద బిందువులు పొటమరించాయి. యింత కంటే వేరే అవమానం లేదనిపించింది. ఆపైన ఒక్కక్షణం కూర్చున్నానిప్పుల మీదే అనిపించింది అసహనంగా విసు రుగా లేచారు.

ఎవరూ పట్టించుకోలేదు

**అంతా ప్రదర్శనలో లీనమైపోయారు.**

కాశీపతిని దుర్యోదనుడు ఆవహిం చాడు

---

బులిరామయ్యగారు చరచరా నడిచారు దెబ్బతిన్న దుర్యోధనుడిలా.

ఆయన దూరంగావెళ్ళి వెనక్కి తిరిగి చూస్తే...

అదంతా మరో మయసభలా తోచింది.

---




రాంబాబు పోస్టాఫీసులో కవరొకటి తీసుకుని, తను అదివరకే రాసిపెట్టిన లెటర్ అందులో పెట్టి, నాలికతో తడి చేసి అంటించేశాడు. పోస్ట్ డబ్బాలో వెయ్యబోతూ వుంటే, "అడ్రసు రాయకుండానే కవరు వెళ్తుందా?" అన్నాడు ప్రక్కనే వున్న శంకరం.

రాంబాబు తన పొరపాటు గుర్తించి పెన్ తీసి 'టూ' అని రాశాక అందులో ఇంక్ లేక ఇక రాయనని మొండికేసింది.

"నీ పెన్ ఇవ్వరా బాబూ" అన్నాడు రాంబాబు.

"పెన్ కార్నర్‌లో రిపేరుకిచ్చాను" అన్నాడు శంకరం.

అక్కడ ఇంక ఎవరూ లేరు పోస్టా

ఫీసు మూసేసే టైమైనందున ఎవరూ వస్తున్న సూచనలు గూడా లేవు. కౌంటర్లో గుమస్తా చాలా సీరియస్‌గా పనిచేస్తూ ఇంటికి వెళ్ళిపోయే మూడ్‌లో వున్నాడు. పెన్ అడిగితే ఏం తంటా వస్తుందోనని అడగలేకపోయాడు.

ఇంతలో పదిగజాల దూరంలో నలుగురు అమ్మాయిలు కాలేజీనుంచి వస్తూ కన్పించారు. "వాళ్ళల్లో ఎవర్నయినా అడుగు" అన్నాడు శంకరం.

"రానీ అడుగుతాను" అన్నాడు రాంబాబు

రాంబాబు ఉత్తరకుమారుడికి తమ్ముడేనని శంకరానికి బాగా తెలుసు

"ఆ ముఖం నీకంత ధైర్యం వుందా?" హేళనగా నవ్వాడు శంకరం

"ఎంత పందెం?" సీరియస్‌గా అన్నాడు రాంబాబు

"ఓడిపోయినవాళ్ళు సినిమా ఖర్చు, టిఫిన్ ఖర్చు వగైరా భరించాలి" అన్నాడు శంకరం

"ఓ కే" అన్నాడు రాంబాబు

ఆ నలుగురమ్మాయిలు దగ్గరగా వచ్చారు పోస్టాఫీసు దాటి పదిగజాలు వెళ్ళిపోయారు గూడా

రాంబాబు వాళ్ళల్లో ఎవర్నీ పెన్ అడగలేదు

శంకరం విజయగర్వంతో నవ్వాడు

రాంబాబు వున్నట్టుండి పూనకం వచ్చినవాడిలా - రోడ్డుమీద కెళ్ళి చప్పట్లు కొట్టి, "లక్ష్మీ...లక్ష్మీ..." అని కేకపెట్టాడు.

వాళ్ళు నలుగురూ హఠాత్తుగా ఆగిపోయారు. రాంబాబుని విచిత్రంగా చూస్తూ నిల్చున్నారు.

రాంబాబు పెద్ద పెద్ద అడుగులు వేసుకుంటూ వెళ్ళి "పెన్ కావాలి జస్ట్ ఎ మినిట్" అన్నాడు మందహాసం చేస్తూ.

ఎర్రపూల చీర, అదే రంగు బ్లౌజు వేసుకున్న అమ్మాయి పెన్ తీసి ఇచ్చింది.

రాంబాబు కవరుమీద అడ్రసు రాసి పెన్ తిరిగి ఇచ్చేసి "థాంక్స్" అన్నాడు నవ్వు ముఖంతో ఆమె వంక చూస్తూ.

"నో మెన్షన్ ..." అంది ఆ అమ్మాయి

రాంబాబు వెనక్కు తిరిగి వెళ్ళబోయి "రామూ..." అనే పిలుపు విని ఆగిపోయాడు

అదే. ఆ ఎర్రపూల చిన్నది నవ్వుతూ వుంది

రాంబాబు ఆశ్చర్యపడ్డాడు అంతలోనే కంగారుపడ్డాడు.

"ఏం లేదు రామూ మా వాళ్ళంతా 'హోటే'కి మళ్ళీ ఒకసారి వెళ్దామంటున్నారు. ఈ రోజు లాస్ట్ ఇంటికి వెళ్ళి రావడానికి టైమ్ లేదు ఓ పెన్ వుంటే ఇవ్వు," అంటె అతని చొక్కా జేబు వంక చూస్తూ.




రాంబాబుకి నోట మాట రాలేదు. గొంతులో తడి ఆరిపోయింది. 'లేవు' అనేదానికి ఆస్కారం కన్పించలేదు. టెర్లిన్ చొక్కా జేబులో పది కాగితం కొట్టొచ్చినట్లు కన్పిస్తోంది.

పది రూపాయిల కాగితం తీసి ఆమె చేతిలో పెట్టి వెనక్కి తిరిగాడు.

"థాంక్స్, రాముూ," అంది ఆమె నవ్వుతూ.

"నో మెన్షన్..." అని తొందర తొందరగా పోస్టాఫీసు వైపు వెళ్ళి పోయాడు రాంబాబు.

"మాశావా శశీ, ఈ రోడ్డుమీద డబ్బు ఎలా సంపాదిస్తావ్? నీ కెవరు అప్పు ఇస్తారు. అని పది రూపాయిలు పందెం కాశావుగా గెలిచాను," అంది లక్ష్మి విజయగర్వంతో.

"అతను నీకు తెలిసినవాడా యేం?" అంది శశిరేఖ అనుమానంగా.

"నో ...నో ... అతని ముక్కూ, మొహం ఇప్పుడే చూడ్డం."

"నీ పేరు అతనికెలా తెలిసింది?"

"అదే అర్థంకావడంలేదు."

"పోనీ. అతని పేరు నీ కెలా తెలుసు?"

"మగవాళ్ళల్లో ఎక్కువగా రాముూ లుంటారు. అందుకని పిలిచాను. నిజంగా అతను రాముూ అవునో కాదో నాకు తెలియదు," అంది లక్ష్మి.

* * *

"ఆ అమ్మాయి నీకు తెలుసా ఏం?" అన్నాడు శంకరం.

"తెలియదు."

"మరి లక్ష్మి అని ఎలా పిలిచావ్?"

"ఆ మాత్రం తెలియదూ? నలుగురు అమ్మాయిలు వుంటే అందులో ఒక లక్ష్మి తప్పకుండా వుంటుంది." అని చెప్పాడు రాంబాబు. తను శంకరం దగ్గర పందెం గెల్చినా లక్ష్మి దగ్గర ఓడి పోయినట్లే. మరి తను పందెం గెల్చినట్లో లేక ఓడినట్లో అర్థంకాలేదు రాంబాబుకి.



# మతాభిమానం



(గల్పిక)

ఒక వైశాఖ పౌర్ణమికి ఆ చిన్న రాజ్యానికి ఒక బౌద్ధసన్న్యాసి వచ్చి, బౌద్ధాన్ని మించినది మరో మతం లేదని ఒప్పించాడు. రాజుగారికి అన్నీ నచ్చాయి గాని అహింస నచ్చలేదు. అయిదురకాల మాంసం కూరలు లేకుండా ఎలా ఆరగించటం?

"మీరు జంతు వధ చెయ్యరాదు. వధించిన జంతువులను నిక్షేపంగా తినవచ్చు," అన్నాడు సన్న్యాసి. రాజు తృప్తిపడ్డాడు. సన్న్యాసి రాజగురువుగా ఉండిపోయాడు.

బౌద్ధం ప్రజలలో వ్యాప్తికావటానికి రాజు ఇతర మతాలమీద పన్నులు వేశాడు. అందరూ బౌద్ధం పుచ్చుకున్నారు. కటికవాళ్ళు కూడా తాము జంతువధ మానేస్తామనీ, బౌద్ధం పుచ్చుకుంటామనీ అన్నారు.

రాజు ఆందోళనచెంది, బౌద్ధ సన్న్యాసిని సలహా అడిగాడు. బౌద్ధ సన్న్యాసి మరింత ఆందోళనచెందాడు — అతగాడికి కుందేలు మాంసం మహాఇష్టం— గాని తన ఆందోళన బయటపడనీయక, "రాజా, వాళ్ళమీద పన్నులు తీసెయ్యి. బోయవాళ్ళకూ, బెస్తవాళ్ళకూ కబేలాలవాళ్ళకూ రెట్టింపు డబ్బులు ముట్టేటట్టు మాంసాదుల ధరలు పెంచు," అన్నాడు.

రాజు అలాగే చేశాడు. అయినా మాంసం సరఫరా చేసేవారు వందల సంఖ్యలో బౌద్ధం అవలంబించి, గుండ్లు గొరిగించుకుని, అహింస అవలంబించాం అన్నారు.

రాజుకూ, ప్రజలకూ వచ్చి వెలక్కాయ గొంతున పడ్డట్టయింది.

ఇంతలో ఆ దేశానికి శంకరాచార్యుల శిష్యుడు ఒకడు వచ్చి వైదిక ధర్మ ప్రచారం ప్రారంభించాడు.

"మహారాజా, ఈ వైదికుణ్ణి దేశంనుంచి పారదోలండి," అన్నాడు మంత్రి.

బౌద్ధసన్న్యాసి గుడ్లు ఎర్రజేసి, "మంత్రీ, తెలిసీ తెలియని సలహా చెప్పకు," అని తన సలహా రాజుకు చెప్పాడు.

తరవాత రాజబంధు వొకడు శంకరుల వారి ప్రశిష్యుడై దేశమంతటా యజ్ఞాలు జరగాలని ప్రబోధంచేశాడు. యజ్ఞాలను నిషేధిస్తూ శాసనం జరగలేదుగాని, బలిపశువులమాంసం రాజుగారిదని శాసనం జరిగింది.

తరవాత రెండేళ్ళకు ఆ దేశంలో ఒక్క బౌద్ధుడులేడు. బోలెడంతమంది బోయవాళ్ళూ, బెస్తవాళ్ళూ, కటికవాళ్ళూ ఉన్నారు.

*కొడవటిగంటి కుటుంబరావు*




# గుర్రమా - కళ్ళెమా

'మనసు మనిషిని నడిపిస్తోందా? లేక మనిషి మనసును నడిపిస్తున్నాడా?' అన్నది నాకు ఆదినుంచీ కలుగుతున్న అనుమానం. ఆదినుంచీ అంటే సృష్ట్యాదినుంచీ అని కాదు అర్థం. నా వయస్సు పాతిక సంవత్సరాలే' నాగ రాజు నాకంటే ఒక సంవత్సరం పెద్ద వాడు.

నాగరాజు బియ్యేలో నా రూమ్మేటు. బయటినుండీ చూడడానికి విశాలంగా కనిపించే హాస్టల్లోని ఓ ఇరుకైన గదిలో మే మిద్దరం మూడు సంవత్సరాలు కాపురంచేశాము. ఒకేజాతి పక్షులు ఒకే గూటిలోకి చేరుకుంటాయని చెబు తారు. కానీ నా మనస్తత్వం వేరు. నాగరాజు వ్యక్తిత్వం వేరు మా

ఇద్దరి మధ్య స్నేహబంధం ఏర్పడడం సృష్టిలోని వింతల్లో ఒకటి. నేను సినిమాకు వెడదామంటే అతను షాపింగుకు బయలుదేరేవాడు. నేను షాపింగుకు బయలుదేరితే అతను వుమెన్సు కాలేజీ వైపు నడచేవాడు.

నాగరాజుకు ఇంగ్లీషు క్రైంపిక్చర్లంటే చాలా ఇష్టం. ఊళ్లో అలాంటి సినిమా రిలీజయిందంటే మొదటి రోజే ఎంత చెప్పినా వినకుండా కాలేజీ ఎగ్గొట్టి మార్నింగ్ షోకి అటెండయిపోయేవాడు. తీరా ఒకనాడు నేనూ మొదటి రోజే కాలేజీకి ఎగనాంపెట్టి కొత్తగా రిలీజయిన సినిమాకు బయలుదేరాను. బట్టలు మార్చుకొని నాగరాజుకోసం వెయిట్ చేస్తూ కుర్చీలో కూర్చున్నాను. ఆయనగారు ఎంతకూ చదువుతున్న పుస్తకం మూసిపెట్టలేదు. మార్నింగ్ షో టైం అవుతోంది. ఓపిక నశించిపోగా "ఏం మహానుభావా! సినిమాకు రావా?" అని అడిగాను.

"ఏం సినిమాకు?" ఏం తెలియనివాడిలా అడిగాడు నాగరాజు.

"ఈ రోజు 'ది అడ్వెంచరర్స్' రిలీజయ్యిందిగా!"

"ఓహో! అందుకా? నేనా సినిమాకు వెళ్లదలుచుకోలేదు......" గబగబా గది బయటికి వెళ్ళి ఆకాశం కేసి చూపులు సారించాను.

"అదేమిటి? అక్కడేం చేస్తున్నావ్?" విస్తుపోతున్నట్లుగా అడిగాడు నాగరాజు.

"సూర్యుడు ఏ దిక్కున ఉదయించాడోనని!"

"నువ్వేం వెక్కిరించ నక్కర్లేదు. హైద్రాబాదులో మా ఫ్రెండొకడున్నాడు. వాడీ సినిమా నెప్పుడో చూసేశాడట! ఇంత పనికిరాని సినిమాను వాడు జన్మలో చూడనేలేదట!...

"నా స్నేహితుడూ చెప్పాడు... ఇంతమంచి సినిమా అతడు జన్మలో చూడనే లేదని......"

నాగరాజు పుస్తకం మూయలేదు.

అయిదు నిమిషాలు అలాగే కూర్చుండిపోయి, ఇక లాభంలేదన్న సంగతి అర్థం కాగానే పైకి లేచి మరో స్నేహితునితోబాటు సినిమాకు వెళ్ళిపోయాను

ఇంటర్‌వెల్‌లో సీటులోంచి పైకి లేచి చుట్టూరా కలయజూసేసరికి వెనుక వరుసలోనే చిరునవ్వు నవ్వుతూ కన్పించాడు నాగరాజు. విపరీతమైన కోపం వచ్చింది. అదే రూమయితే బాగా దులిపేసేవాడిని. సినిమా హాలన్న సంగతి గుర్తుకు రాగానే మౌనంగా బయటికి నడిచాను. టీ తాగుతుండగా తానూ ఓ కప్పు తీసుకొని తాగుతూ దగ్గరికి వచ్చి "సినిమాలో కథమాత్రం బాగుండలేదు. సెట్టింగ్స్, ఏక్షన్స్ బాగున్నాయని చెప్పాడు మా ఫ్రెండు

.మంచి సెట్టింగ్స్ నాకు చాలా ఇష్టం గదా! అందుకే సినిమా కొచ్చాను..." అన్నాడు మెల్లగా.

"నే నడిగినప్పుడు ఆ సంగతి గుర్తుకు రాలేదా?" అన్నాను కోపంగా.

"నువ్వే అలా మాటాడితే ఎలా! ఏదో పొరబాటయిందనుకో!"

అంతగా క్షమాపణ కోరుకున్న తరువాత ఇంకేంచేయగలను. ప్రక్క సీటు ఖాళీగానే వుంది రమ్మని ప్రక్కనే కూర్చోబెట్టుకున్నాను.

మరో రోజు. ఆ రోజు శ్రీరామ నవమి అనుకుంటాను. స్నేహితు లందరమూ రాముడి గుడికి బయలు దేరాము విద్యార్థులు పండుగరోజు గుడికి వెళ్ళడం దేవుడిని చూడడానికి మాత్రమే గాదని అందరికీ తెలుసు. బయలుదేరేముందు తాను రావడంలేదని చెప్పిన నాగరాజు తీరా గుడిలో మా కంటె ముందుగా ప్రత్యక్షమయ్యాడు. ఎందుకిలా చేశావని అడిగితే అందుకో పనికిరాని జవాబు సరఫరా చేశాడు...

ఇలా చెప్పుకుంటూ పోతే ఒకటేమిటి ఎన్నో సంఘటనలు చెప్పవచ్చు. మొదట మొదట మమ్మల్ని ఆశ్చర్యంలో ముంచేయాలని అలా చేస్తున్నాడేమో ననుకున్నాను. పూర్తిగా లాగితే రబ్బరుతీగ తెగిపోతుంది ప్రతిసారి ఇలా చేస్తుంటే ఆశ్చర్యం ఎలా కలుగుతుంది?

పూర్తిగా విసిగిపోయిన తరువాత ఒకరోజు నిలదీసి అడిగాను —'' ఎందుకురా బాబూ! నీకీ గాలివాటు బుద్ధులు'' అని.

చివరకు నిజాన్ని బయటపెట్టాడు. నాగరాజు — "మొదట మీరు పిలుస్తున్నప్పుడు నిజంగానే రాకూడదని అనుకుంటాను. కానీ కొద్ది క్షణాల్లో వెళ్దామని అనిపిస్తుంది...మరికొన్ని నిముషాల్లోనే బయలుదేరి వచ్చేస్తుంటాను... రాగూడదు అనుకుంటూనే వచ్చేస్తుంటాను. ఆలోచిస్తే అది నాలోని వీక్‌నెస్ ఏమో అనిపిస్తుంది..."

అతడి మాటలు నన్నూ ఆలోచింపజేశాయి. ఎవరైనా ఎక్కడికైనా పిలిచినప్పుడు ఏదైనా పని చేసిపెట్టమన్నప్పుడు అతడిలోని మనిషి ఎందుకు చెయ్యాలి అని ప్రశ్నించుకుంటాడు. చేయగూడదని నిర్ణయించుకుంటాడు. అందుకతడి మనస్సు ఒప్పుకోదు. చివరకు మనిషి ఓడిపోతాడు. చెయ్యగూడదనుకున్న పని చేసేస్తుంటాడు —" అని అనుకున్నాను చివరకు.

చదువులు పూర్తయ్యాయి. నేను కాలేజీలో లెక్చరర్ ఉద్యోగం సంపాదించుకోగలిగాను.

నాగరాజు తండ్రి రైల్వేలో స్టేషన్ మాష్టరుగా పని చేస్తున్నాడు. కొడుకుని గూడా అదే డిపార్టుమెంటులోకి లాక్కోవాలని ఆయన ఆదినుంచీ అనుకునేవాడు. కానీ నాగరాజుకు రెవిన్యూ




డిపార్టుమెంటులో పనిచేయాలని వుండేది. కోరుకున్నదానికీ జరిగేదానికీ చాలా తేడా వుంటుంది గదా! మన దేశంలో ఎక్కువ మందికి తమ కిష్టమైన చదువులు చదవడానికిగానీ ఉద్యోగాలు చేయడానికిగానీ పరిస్థితులతోబాటు తల్లితండ్రులు గూడా అనుమతించడంలేదు. నాగరాజుకు తండ్రి ఆజ్ఞను పాలించక తప్పలేదు. ప్రస్తుతం అతడు సికింద్రాబాదులో రైల్వే డిపార్టుమెంటులోనే ఏదో మంచి ఉద్యోగమే చేస్తున్నాడు. నెలకు ఆరేడు వందలు సంపాదిస్తున్నాడు.

* * *

దసరా సెలవులు వచ్చాయి. విద్యార్థికైనా పెళ్ళికాని లెక్చరరుకైనా సెలవులొస్తే పరమానందంగా వుంటుందన్నది స్వానుభవం. హాయిగా యింటి పట్టున వుండొచ్చు. తల్లి పెట్టే కమ్మని భోజనం తినొచ్చు. — సరే, సెలవులొచ్చాయన్నది ప్రస్తుతాంశం.

ఓ రోజు సాయంకాలం షికారుకు వెళ్ళి ప్రొద్దుపోయిన తరువాత యింటికి తిరిగొచ్చాను. హాల్లోనే కూర్చుని ఏదో పత్రికను తిరగేస్తున్న నాన్నగారు "మీ ఫ్రెండట... పేరు నాగరాజట. నీ కోసం వచ్చాడు. చాలా మొహమాటస్తుడిలాగున్నాడు. నాతో ఫ్రీగా మాటాడలేకపోతూంటే వెళ్ళి నీ గదిలో కూర్చోమని చెప్పాను. అర్థగంటనుంచీ నీ కోసం వేచివున్నాడు......" అన్నారు.

గబగబా మేడపైకి వెళ్ళాను. బీరువాలోని పుస్తకాల నన్నింటినీ చెక్ చేస్తూ కనిపించాడు నాగరాజు.

"చిరకాల దర్శనం..." అన్నాను చిరునవ్వు నవ్వుతూ.

"ఏం చెయ్యమంటావు చెప్పు. తీరికలేని పని. చివరికి ఎలాగో రెండు రోజులు వీలు కలిగించుకొని వచ్చాను" అన్నాడు నాగరాజు.

"ప్రస్తుతం ఎక్కడినుంచి వస్తున్నావ్?"

"సికింద్రాబాదునుంచే వస్తున్నాను. ఇంకా నాన్నగారి దగ్గరికి కూడా వెళ్ళలేదు. ఎకాయెకిని నీ దగ్గరికే రావడం..."

"ఊరక రారు మహాత్ములు......"

"అబ్బే పెద్ద పనేమీ లేదు... నిన్ను చూసి చాలా రోజులైంది గదా! అందుకే వచ్చాను..."

"ఓ పదిహేను నిముషాలు వెయిట్ చేస్తూవుండు నాగరాజూ! ఊరంతా తిరిగివచ్చాను గదా! ఒళ్ళంతా అలసిపోయింది. వెళ్ళి స్నానంచేసి వస్తాను" అంటూ బాత్‌రూములోకి వెళ్ళిపోయాను.

స్నానం ముగించి గదిలోకి వచ్చేసరికి అమ్మ టిఫిన్ తీసుకొచ్చింది.

"ఏమిట్రా విశేషాలు!" అడిగాను టిఫిన్ తీసుకుంటూ.

"చాలా వున్నాయి. తమరు త్వరగా తినేసి బయటపడితే అలా వెళ్ళివద్దాము అప్పుడు చెబుతాను..."

గబగబా టిఫిన్ కానిచ్చి బయటపడ్డాము.

"ఎలా వెడదాం" అడిగాను.

"మీ వూరి సంగతి నాకెలా తెలుస్తుంది? ఏదైనా ప్రశాంతంగా వుండే చోటికి వెడదాం .."

"ఏకాంతమా? మా వూళ్ళోనే..." పకాలున నవ్వేశాను.

"ఏం? ఎందుకు నవ్వు?"

"నాయనా పిచ్చితండ్రీ! ఈ పట్నం ఎటుచూసినా నాలుగైదు మైళ్ళు వ్యాపించి వుంది. ఏకాంతం కోసమైతే ఆ నాలుగు మైళ్ళూ నడవాలి లేదా టౌనుబస్సు ఎక్కాలి. అవి సమయానికి దొరకవు. ఎందుకొచ్చిన గొడవ... నడుస్తూ మాటాడుకొందాం..."

ఇక తప్పదన్నట్లు మొదలుపెట్టాడు నాగరాజు - "మా నాన్నగారి కీ మధ్య పెళ్ళి పిచ్చి పట్టుకొందిరా మూర్తీ..."

"ఏమిటీ...ఈ వయస్సులోనా..." ఉలిక్కిపడ్డట్టుగా అడిగాను

నా మాటలు పట్టించుకోకుండా చెప్పసాగాడు. "నా జీవితం ఇలా సాఫీగా నడిచిపోవడం ఇష్టంలేదట ... ఒకటే గొడవ పెడుతున్నారు వారానికి రెండు ఉత్తరాలు ..అబ్బబ్బ... పెళ్ళిచేసుకో... పెళ్ళిచేసుకో...నేను పెళ్ళిచేసుకోకపోతే ఆయనకేం పోయిందో..."

"పెళ్ళి నాగరాజుకే గానీ వాళ్ళ నాన్నగారికి కాదన్నమాట! 'హమ్మయ్య' అనుకొని "చూడరా రాజూ! నీ వయస్సెంత? ఇరవైఆరు



సంవత్సరాలు...బ్రహ్మచారి ముదర కూడదు ఆయన మాటవిని పెళ్ళి చేసుకో...దానికింత బాధెందుకు!" అన్నాను

"అబ్బే పెళ్ళాడడంలో బాధలేదు. కానీ కాబోయే జీవితభాగస్వామిని సెలక్ట్ చేసుకోవడముందే ... అంచు లోనే వుంది బాధంతా..."

"ఏమిటో నీ మాటలు. నా కర్థం గావడంలేదు

"చూడ్రా మూర్తీ! పెళ్ళిచూపుల్లో ఆ అమ్మాయిని ఎంతసేపు చూస్తాం చెప్పు. ఒక పది నిమిషాలు. కేవలం పది నిముషాలు చూటడంవల్ల ఆ అమ్మాయి మంచిచెడ్డలు మన కెలా తెలుస్తాయి?"

"అందుకే ఇప్పుడు పెళ్ళిచూపుల్లో ఓ అరగంటసేపు అమ్మాయి అబ్బాయి మాటాడుకొని ఒకరి మనస్సు నొకరు తెలుసుకోడానికి ఏకాంతం ఏర్పరుస్తారు తెలుసా?"

"నిజమే! నేనూ అలాగే మాటా డాను. నువ్వు నిజమనుకో, అబద్ధ

మనుకో...నేను ఇంతవరకూ దాదాపు పదిహేను పెళ్ళిచూపులకు వెళ్ళాను!"

ఉలిక్కిపడి, "పదిహేనుసార్లే!... చూచిన పదిహేనుమందిలో ఏ ఒక్కరైనా నచ్చలేదన్నమాట!" అన్నాను.

"అక్కడే పొరబడుతున్నావు కేవలం అందాన్నిమాత్రం చూసి పెళ్ళాడడం అవివేకం. మనిషి మనస్తత్వాన్ని, వ్యక్తిత్వాన్ని, సౌశీల్యాన్ని లెక్కగట్టాలి"

ఏమిటో నాగరాజు ధోరణి నాకర్థంగావడంలేదు. కేవలం అరగంటసేపు మాటాడడంతోనే ఎదుటివాళ్ళ గుణగణాల్ని ఎలా లెక్కగట్టగలం? ఆ మాటే అడిగాను...

"అందుకో ప్రొసీజర్ కనిపెట్టాను..."

"ఏవిటో అవి?"

"నా పరీక్షను రెండు భాగాలుగా విభజిస్తాను మొదటి యాభై శాతం మార్కులు అందానికి ... తరువాత ఆమెను నేను కొన్ని ప్రశ్న లడుగుతాను. ఆ ప్రశ్నల కన్నింటికీ ఆమె చెప్పే జవాబులనుబట్టి మిగిలిన యాభై మార్కులిస్తాను రెండూ కూడితే డెబ్భై శాతం మార్కులొస్తేనే పెళ్ళాడ్డానికి నిర్ణయించుకున్నాను..."

"అంటే నీ పరీక్షలో ఫస్టుపేపరు బ్యూటీ–టెస్ట్. రెండో పేపరు ఓరల్ టెస్ట్ - అలా చెప్పు ... బాగుంది బాగుంది." ఇంతలో మళ్ళీ పాత అనుమానం వచ్చింది – "అయితే ఆ పదిహేను మందిలో ఎవరికిగానీ డెబ్భై శాతం మార్కులు రాలేదన్న మాట .."

"అన్నమాట మాత్రమే గాదు. ఉన్నమాటే...ఒక్కరికి గూడా నలభై మార్కులు రాలేదు."

మొత్తంమీద నాగరాజు విచిత్రమైన వ్యక్తి విచిత్రమైన విషయాలపైన చాలా ఇంట్రెస్టుంది నాకు అందుకే ఆ ప్రశ్నలు ఏవిటో తెలుసుకోవాలన్న కుతూహలం కలిగింది.

"ఇక నడచింది చాలుగానీ ఆ హోటలుకు వెళ్ళివద్దాం పద..." అంటూ అటువైపుకు నడిచాం. కాఫీకి ఆర్డరిచ్చాక ఓ మూలగా సందడిలేని చోట కూర్చుని తరువాత అడిగాను – "మా ఇంట్లో గూడా ఇప్పుడిప్పుడు పెండ్లి పెండ్లి – అంటూ మాటాడుతుంటున్నారు ఇక తప్పదు గదా! నేనూ పెళ్ళిచూపులకు బయల్దేరాల్సిందే. సువ్వెలాగూ ఖుర్చించుకొని ఓ ప్రశ్నాపత్రాన్ని తయారుచేశావు దయచేసి ఆ ప్రశ్నలేమిటో చెప్పవోయ్ నాగరాజూ ! బాబ్బాబూ, నీకు పుణ్యముంటుంది—" ప్రాధేయపడ్డాను.

"అన్నం వుడికిందో లేదో తెలియడానికి ఒక్క మెతుకును పరీక్షిస్తే చాలు. అంతే గదూ! మనస్తత్వాన్ని

తెలుసుకోడానికి మచ్చుకు నాలుగైదు ప్రశ్నలడిగితే చాలు — ఏమంటావ్?"

తలవూపాను

"మరింక ప్రశ్నలేవిటో చెబుతాను విను

నెంబర్ వన్ — భార్యాభర్తల్లో ఏవరి స్థానం గొప్పది? నెంబర్ టూ - సాయంకాలం అయిదు గంటలకే వచ్చి సినిమాకు తీసుకవెడతానని ప్రామిస్ చేసిన భర్త రాత్రి పదిగంటలకు నింపాదిగా ఇంటికి దయచేస్తే ఆ భార్య ఏం చేయాలి? నెంబర్ త్రీ - సిగరెట్లు త్రాగే మగవాడిపైన మీ అభిప్రాయం ఏమిటి? నెంబర్ ఫోర్ - మీ భర్త అప్రయోజకుడైన నీతిపరుడై వుండాలా? లేక ప్రయోజకుడైన అవినీతిపరుడై వుండాలా?"

ఇంతలో కాఫీ వచ్చింది మౌనంగా ఆ ప్రశ్నలను గురించి ఆలోచిస్తూ కాఫీ తాగేశాను.

"నాగరాజూ! నువ్వేం అనుకోకపోతే నాదో కోరిక ఆ ప్రశ్నలను నిన్నే అడిగి వాటికి నీ సమాధానాల్ని కూడా తెలుసుకోవాలని వుంది...నా కోరిక తీరుస్తావా? ప్లీజ్..." కౌంటర్లో బిల్లు చెల్లించేసిన తరువాత అడిగాను.

నాగరాజు నన్ను ఓ క్షణం అర్భకుణ్ణి చూసినట్లుగా చూసి "అడుగు..." అన్నాడు చిరునవ్వు నవ్వుతూ...

"అలాగయితే నే నిప్పుడు పెళ్ళి సంబంధం చూడడాని కొచ్చిన అబ్బాయిని నన్నమాట! నువ్వేమో..."

"పెళ్ళి పరీక్షకు కూర్చున్న అమ్మాయివన్న మాట..." గలగలా నవ్వేసి "మరి పరీక్ష మొదలు పెట్టు" అన్నాడు.

పరీక్ష మొదలు పెట్టాను —

"భార్యా భర్తల్లో ఎవరి స్థానం గొప్పది?"

"సంసారమనే యాత్రలో భార్యాభర్తలు తోడుగా పయనించే యాత్రికుల లాంటివాళ్ళు...వాళ్ళల్లో తక్కువ ఎక్కువ అన్న వ్యత్యాసం వుండదు... భర్త స్ధానం ఎంత గొప్పదో భార్య స్థానం గూడా అంతే గొప్పది..."

"సినిమాకు తీసుక వెడతానన్న భర్త పది గంటలకు ఆలస్యంగా దయచేస్తే ఆ భార్య ఏం చేయాలి."

"భర్త పరిస్థితి అర్థం చేసుకుని 'అయ్యో' ఏమిటండీ అలా వున్నారు... ఏం జరిగింది? తల నొప్పుతోందా? అమృతాంజనం రాయమంటారా? కాఫీ పెట్టి తీసుకరమ్మంటారా? అంటూ కంగారు పడిపోవాలి..."

"సిగరెట్టు త్రాగే మగవాడిపైన మీ అభిప్రాయం?"

"మరీ ఎక్కువ తాగేవాళ్ళని చూస్తే కోపం వస్తుంది. అలాగని తాగకుండా వుండే వాళ్ళని చూస్తే వాళ్ళ పిరికితనానికి నవ్వుకోవా లనిపిస్తుంది.

లిమిట్‌గా తాగేవాళ్ళని చూస్తే చాలా ఇష్టం..."

"చివరి ప్రశ్న - మీ భర్త అప్రయోజకుడైన నీతిపరుడై వుండాలా! లేక ప్రయోజకుడైన అవినీతిపరుడై వుండాలా?"

''నీతిపరుడై వుండాలి. అప్రయోజకుడైనా పర్వాలేదు..."

నాగరాజు ఆ ప్రశ్నల కిచ్చిన జవాబులు బాగున్నాయని అనుకోకుండా వుండలేక పోయాను,

*    *    *

జరుగుతున్నది ఎండాకాలం కాబట్టి మేడపైన కొబ్బరిచెట్ల ఆకుల్లోంచీ తొంగి చూస్తున్న చంద్రుడి చిరువెల్తుర్లో మంచాలు వంమకుని, పడుకున్నాము, కాళ్ళదగ్గర పడివున్న దుప్పటిని గొంతు దాకా లాక్కుంటూ ''రేపు మధ్యాహ్నం దాకా నువ్వు నాతోనే తిరగాలి రామూర్తీ! మనమిద్దరం కలసి ఓ చోటుకు వెళ్ళి రావాలి, మధాహ్నం రెండు గంటలకు ఊరికి వెళ్ళి పోతాను..." అన్నాడు నాగరాజు నింపాదిగా.

''ఎక్కడికి వెళ్ళాలి?"

"ఈ వూర్లో చక్రపాణి గారని ఒక రిటైర్డు స్టేషనుమాష్టరున్నారులే! వాళ్ళింటికి వెళ్ళాలి?"

నేను ఉలిక్కిపడ్డ మాట నిజం! కానీ లేచి కూర్చోలేదు. ఎదుటివ్యక్తితో చెలగాట మాడ్డమే నాగరాజుకు సరదా అయినప్పుడు - దాన్ని మరింత రసవంతంచేసే అవకాశాన్ని నేనెందుకు పోగొట్టుకోవాలి? అందుకని వీలయినంత నెమ్మదిగా ప్రశ్నించాను - "చక్రపాణిగారి ఇంటికా? ఎందుకూ?" అని.

"మరేం లేదు ... వయసొచ్చిన అమ్మాయి ఒకతె వుందని తెలిసిదంటే వెంటనే అక్కడికి వెళ్ళి ఆ అమ్మాయిని చూసిరమ్మని ఆర్డరు జారీ చెయ్యడం మా నాన్నగారికి అలవాటైపోయింది..."

'చిక్కావురా మిడతంబొట్టూ' అనుకున్నాను. ఎందుకంటే చక్రపాణి గారంటే ఎవరో కాదు. స్వయానా నాకు వ్రేలువిడిచిన చిన్నాన్నగారు - అంటే ఇతగాడు పెళ్ళిచూపులకంటూ రావడం మా శోభను చూడ్డానికే నన్న మాట!

నాగరాజు అప్పుడే నిద్రాదేవత కౌగిల్లోకి జారిపోయివుండడం గమనించి నేనుగూడా ముసుగు బిగదన్నుకున్నాను.

*    *    *

నాగరాజు స్నేహితుడన్న విషయాన్ని మరచిపోయి నాకు ఎంతో ఇష్టమైన ఒక అమ్మాయికి భర్తగా అతడెంతవరకూ తగివున్నాడని ఆలోచించాల్సిన అవసరం వీర్పడుతుందని కలలోనైనా అనుకోలేదు.



'ఉద్యోగం పురుషలక్షణం' – అంటారు పెద్దలు. నాగరాజుకు సలక్షణమైన ఉద్యోగం ఒకటుంది. నెలకు ఆరేడువందలు సంపాదిస్తున్నాడు. పొడుగ్గా అందుకు తగ్గ లావుతో హుందాగా అందంగా కన్పిస్తాడు. రోజుకో అయిదారు సిగరెట్లు కాలుస్తాడు. అంతకు మించిన దురలవాటు మరొకటి లేదు. లేదంటే ఎదుటి మనిషితో దాగుడుమూత లాడుతాడు. అది అతనిలో బలహీనత...అదేమంత పెద్ద అభ్యంతరం కాదు.

ఉదయం అయిదుగంటలకల్లా ప్రక్కింటి ఫ్రెండు నడిగి స్కూటరు తీసుకొని బాబాయి ఇంటికి పరుగెత్తాను. నేను వచ్చానన్న సంగతి తెలియగానే శోభే కాఫీ తీసుకొచ్చింది. కాఫీ త్రాగేసి ఖాళీకప్పు తిరిగి ఇచ్చేస్తూ

"అలా మేడమీది గదిలోకి వస్తావా శోభా! నీతో ఓ ముఖ్యమైన విషయం మాట్లాడాలి!" అన్నాను.

"అలాగే!" అంటూ ఆమె వంట గదిలోకి వెళ్ళిపోయింది.

మేడమీది గదిలో కూర్చుని పేపరు చూస్తూ వుండగా శోభ వచ్చి ఎదురుగా కుర్చీలో కూర్చొంది. పేపరు చూస్తూనే ఎలా మొదలుపెట్టాలో ఆలోచించి చివరకు, "ఈ రోజు నిన్ను చూడడానికి ఎవరో ఒక అబ్బాయి వస్తున్నాడట" అన్నాను.

"అవునట!"

"ఆ అబ్బా యెవరో తెలుసా? నా ఫ్రెండు. ప్రస్తుతం మా ఇంట్లోనే వున్నాడు!"

"అలాగా!" అంది ఆమె ముక్త సరిగా.

"ఏమిటంత మామూలుగా అంటు న్నావు? నీ కాబోయే భర్త నా ఫ్రెండే కావడం ఆశ్చర్యంగా లేదూ! వాడెలా వుంటాడో తెలుసుకోవాలని అనిపించడం లేదూ!" అన్నాను ఆశ్చర్యంగా!

"ఆమె కాస్సేపు మౌనంగా వుండి పోయి చివాలున తల పైకెత్తి నా కళ్ళ ల్లోకి సూటిగా చూస్తూ "అన్నయ్యా! నా వయస్సు ఇప్పుడెంతని అనుకుంటు న్నావ్?" అంది.

"నాకు తెలియదేమిటి? పదిహేడు సంవత్సరాలు దాటి వుంటుంది"

"అవును. కనీసం ఇరవై సంవత్సరాలైనా నిండకుండా అప్పుడే ఈ పెళ్లెందుకు చెప్పు? నా కిప్పుడే పెళ్ళిచేసుకోవడం ఇష్టంలేదు. కనీసం బి.యస్.సి. - అయినా పూర్తవాలి..."

"చూడు శోభా! నువ్వింకా చిన్న దానివి! ఏది మంచిదో ఏది మంచిది కాదో నీకింకా తెలియదు. నువ్వెంత చదివినా ఒకనాటికి పెళ్ళిచేసుకొని తీరవలసిందే గదా! అప్పుడు ఇంత మంచి సంబంధం వస్తుందని ఏమిటి గ్యారంటీ! మంచి అవకాశాలను పోగొట్టుకోవడం బుద్ధిమంతుల లక్షణం గాదు. మా నాగరాజును గురించి నాకు బాగా తెలుసు. అందంగా వుంటాడు...మంచి ఉద్యోగం చేస్తున్నాడు. భార్యను సుఖపెట్టగల వాడు...పెద్దవాడ్ని ... నేను చెబు తున్నాను విను...నా మాట విని వాడిని పెళ్ళిచేసుకో..."

"......"

శోభ నోరు తెరవలేదు. మౌనం అర్ధంగీకార మన్నారు కదా! "పిచ్చిపిల్ల! దానికేం తెలుస్తుంది? పెద్దవాళ్ళు నచ్చ జెప్పితే ఒప్పుకోకపోతుందా?

"చూడమ్మా! నే నిప్పుడొచ్చింది నీతో ఓ ముఖ్యమైన సంగతి చెప్పడానికి. మావాడు చాలా కచ్చితమైన వ్యక్తి. వాడు పెళ్ళిచూపుల్లో కొన్ని ప్రశ్న లడుగుతాడు. వాటికి సమాధానాలు



చెబితేనే ఈ పెళ్ళికి ఒప్పుకుంటాడు. ఆ ప్రశ్నలేవిటో నాకు తెలుసు. వాటికి జవాబులు కూడా తెలుసు..."

"బాగుంది బాగుంది...ఆయనగారి ప్రశ్నలకు నేను సమాధానా లివ్వాలేమిటి? ఆయనేమైనా లాయరా లేక ఐ.ఏ.యస్. ఆఫీసరా?"

"ఆగు శోభా! కాస్సేపు నోరు మూసుకోని నా మాట విను."

నాగరాజు తయారుచేసిన ప్రశ్నలను ఆవిడకు తెలియజేసి వాటికి సమాధానాలు నేనే చెప్పి వాటినే మరచిపోకుండా చెప్పమని హెచ్చరించాను.

చివరకు శోభ దగ్గర "అలాగే అన్నయ్యా" అన్నమాటను రాబట్ట గలిగాను.

ఇంటికి వచ్చి నాగరాజు ఏం చేస్తున్నాడోనని చూచాను. కొబ్బరి చెట్ల ఆకుల్లోంచీ జల్లుజల్లుగా సూర్యుడి కిరణాలు మీదపడుతున్నా లెక్కచెయ్యకుండా నిండుగా కప్పుకున్న దుప్పటి లోంచీ గురక పెద్దగా వినపడుతోంది.

* * *

పక్క-ప్రక్క కుర్చీల్లో కూర్చుని నేనూ నాగరాజూ చల్లటి పండ్లరసాన్ని తాగుతుండగా పిన్ని శోభను తీసుకొచ్చి ఎదురుగా చాపపైన కూర్చోబెట్టింది. నాగరాజు వైపు చూచాను. అతను జ్యూస్ తాగుతున్నట్లే నటిస్తూ ఓరగా ఆమెను పరిశీలిస్తున్నాడు. వాడి బ్యూటీ టెస్ట్‌లో నా చెల్లెలి కెన్ని మార్కు-లొస్తా యన్న సందేహం కలగగానే శోభ వైపు పరిశీలనగా చూచాను. తెల్లటి చీర, తెల్లటి జాకెట్టు, నిండుగా కప్పుకున్న పవిటపైన బంగారు గొలుసు, మొహం కాంతికంతటికీ కేంద్రంలా కనబడుతున్న చిన్న కుంకుమబొట్టు, చేతికి ఎఱ్ఱ గాజులు, వాటికి బార్డరులాగా బంగారు గాజులు—నాగరాజు బ్యూటీ టెస్ట్‌లో మా చెల్లెలికి డిస్టింక్షన్ గ్యారంటీ!

అమ్మాయికీ అబ్బాయికీ ఏకాంతం కలిగిద్దామన్న తలంపువల్ల గావచ్చు – పిన్నీ బాబాయి కళ్ళతోనే సంజ్ఞలు చేసుకొని లోపలికి వెళ్ళిపోయారు.

'ఇక మొదలుపెట్టు' అన్నట్లుగా చూశాను నాగరాజు వైపుకు.

నాగరాజు మెల్లగా నోరు విప్పాడు.

"మీ పేరు...?"

"శోభారాణి " శోభ మరీ ఎక్కు-వగా సిగ్గు పోకుండా మాట్లాడుతోంది. పర్వాలేదు.

"చూడండి. మీరు మరేమీ అనుకోకపోతే నేను కొన్ని ప్రశ్నలడుగుతాను...మీకు నచ్చిన సమాధానాలు చెబుతారా?..."

శోభ తల పైకెత్తి నా ముఖంలోకి చూచింది. పర్వాలేదు, ధైర్యంగా చెప్పమన్నట్లు ఓ చిరునవ్వు నవ్వాను. ఆమె అడగమన్నట్లు తల వూపింది. నాగరాజు తన మొదటి బాణాన్ని వదిలాడు—

"భార్యా భర్తల్లో ఎవరి స్థానం గొప్పది?"

ఆమె మెల్లగా చెప్పసాగింది — "ఈ ప్రశ్నను మీరు చాలా ఆలస్యంగా అడుగుతున్నారు. పురాణకాలంనుంచీ వస్తున్న సందేహమే ఇది. మనం దేవతలను సీతారాములు, రాధాకృష్ణులు, పార్వతీపరమేశ్వరులు – అని అనడంలోనే స్త్రీకిగల ప్రత్యేకత, గొప్పతనం తెలుస్తూంది."

ఉలిక్కి-పడ్డాను. కోపంతో పిడికిలి బిగించి దాన్ని టేబుల్‌కేసి నొక్కు-తూ అక్కడి కక్కడే అణచివేయడానికి ప్రయత్నంచేశాను. కానీ నా బాధ నాగరాజుకు అర్థమైనట్లు లేదు. అతడు తన ప్రశ్నలను అడుగుతూనే వున్నాడు.

"సాయంకాలం అయిదు గంటలకే వచ్చి సినిమాకు తీసుకెడతానని ప్రామిస్ చేసిన భర్త రాత్రి పదిగంటలకు వస్తే మీరేం చేస్తారు?"

ఆమె కాస్సేపు ఆలోచించినట్లు ఆగి




"ఈ ప్రశ్నకు రెండు రకాలైన సమాధానాలు చెబుతాను. మొదటిది – మీరు ఆలస్యంగా వస్తారన్న విషయం నాకు తెలుసు. అందుకే ప్రక్కింటి పిన్ని గారితో మ్యాట్నీకే వెళ్ళి వచ్చేశాను – అని అనాలి రెండోది:–అరె! సినిమానా? ఆ మాటే మరచిపోయాను. మీరు సినిమా అంటూంటే గుర్తుకు వస్తోంది – అని జవాబు చెప్పాలి."

"సిగరెట్లు త్రాగే వ్యక్తిపైన మీ అభిప్రాయం?"

"సినిమా హాల్సులో "పొగత్రాగరాదు." అన్న బోర్డు తగిలించినా చీకట్లో సిగరెట్లు త్రాగేస్తుంటారు కొందరు. మరికొందరు మీటింగుల్లో సైతం ఏదో అర్జెంటుపని వున్నట్లు బయటికి పరిగెత్తి గబగబా సిగరెట్లు వెలిగించేస్తుంటారు. క్లాసులో పాఠాలు చెప్పే టీచర్లు సైతం - సగం పాఠంలో ఆపేసి బయటకి వెళ్ళి చెట్ల చాటుల్లో పొగ త్రాగేస్తుంటారు. అలవాటుకు బానిసలై పోతున్నవాళ్ళని చూస్తూకూడా పొగ తాగే వాళ్ళంటే నాకు అసహ్యం లేదన్న విషయం ఎలా చెప్పకుండా వుండగలను?"

"చివరి ప్రశ్న - మీ భర్త అప్రయోజకుడైన నీతిపరుడై వుండాలా ? లేక ప్రయోజకుడైన అవినీతిపరుడై వుండాలా?"

"ఈ ప్రశ్న మరీ విచిత్రంగా వుంది. మీ భర్త కాళ్ళుండి కాళ్ళులేని వాడై వుండాలా, లేక కళ్ళుండి కాళ్ళు లేనివాడై వుండాలా? – అని అడుగుతున్నట్లుగా వుంది. ఏ స్త్రీ అయినా తన భర్త సలక్షణంగా వుండాలనీ, ఏ అవ

లక్షణమైనా లేనివాడై వుండాలనీ కోరు కొంటుంది..."

తనడగవలసిన ప్రశ్నలు ముగిశాక నావైపు చూశాడు నాగరాజు. అవమానంతో ముడుచుకపోయిన నా ముఖాన్ని అవతలికి తిప్పుకున్నాను.

ఇంతలో బాబాయి వచ్చేశాడు. "నువ్వెళ్ళమ్మా!" – ఆయన చెప్పగానే శోభ మౌనంగా లేచి లోపలికి వెళ్ళింది.

"మా బాబాయితో మాటాడుతూ వుండరా నాగరాజూ! నే నిప్పుడే వస్తాను..." అంటూ లోపలికి వెళ్ళాను. వంట గదిలో డైనింగ్ టేబుల్ ముందు కూర్చుని ఏదో పత్రికను తిరగేస్తోంది శోభ. కోపంతో ఆ పత్రికను లాక్కొని "నీ కసలు బుద్ధుందా?" అన్నాను.

ఆమె సమాధానంగా చిరునవ్వు నవ్వింది.

ఆ నవ్వు నా కోపాన్ని చల్లార్చడానికి బదులుగా రెట్టింపు చేసింది

"నా మాట నీకు లెక్కలేదన్న మాట! ఆల్ రైట్! ఇక నేనసలీ ఇంటికి రానేరాను. వచ్చినా నీతో మాటాడను..." ఆ అమ్మాయితో అంతకంటే ఎక్కువగా మాట్లాడడం ఇష్టంలేక కోపాన్ని దిగమింగుకొని తిరిగి వచ్చేశాను.

"ఇక వెళ్దామా మూర్తీ!" అన్నాడు నాగరాజు నన్ను చూడగానే.

"అలాగే" అంటూ బాబాయి వైపు తిరిగి" మేము వెళ్తాం బాబాయ్! నాగరాజు రెండుగంటల రైలుకే వెళ్ళిపోతానని అంటున్నాడు...అర్జెంటు పనులున్నాయట—" అన్నాను.

"అలాగే! వెళ్ళిరండి" అన్నాడు ఆయన పైకి లేస్తూ.

గుమ్మందగ్గరికి వచ్చి ఆగిపోయాను. నాగరాజు ఏమైందన్నట్లు చూచాడు. "చూడు ఎండ ఎలా దంచేస్తోందో!" అన్నాను.

''వచ్చేటప్పుడు రిక్షాలో రావడం వల్ల బ్రతికిపోయాం. ఇప్పు డెలా?" అంటూ అంతలోనే ఆగిపోయి రోడ్డు పైన దూరంగా పరుగెడుతున్న జట్కా బండిని కేకేశాడు నాగరాజు.

జట్కాలోకి ముందుగా నే నెక్కి కూర్చున్న తరువాత అతనూ ఎక్కి కూర్చుంటూ కడపలోనే నిలచిపోయిన బాబాయితో "ఇంటికి వెళ్ళగానే వుత్తరం వ్రాస్తాను...వెళ్లొస్తానండీ!" అన్నాడు.

నేను జట్కా బండివాడితో అడ్రసు చెప్పి పరుగెత్తించమన్నాను.

అయిదు నిముషాలు బరువుగా నిశ్శబ్దంగా గడచిపోయాయి. నాగరాజే మొదట మాట్లాడాడు – ''అమ్మాయి నచ్చిందిరా మూర్తీ''

రెండోసారి ఉలిక్కిపడ్డాను. వాడి

వైపు ఆశ్చర్యంగా చూచాను. వినలేనను కున్న మాట వినినందువల్ల కావచ్చు — గుండె వేగంగా కొట్టుకుంటోంది.

'నాగరాజు మారలేదు. వాడు చెయ్యగూడదనుకున్న పనిని చెయ్య కుండా వుండలేకపోతున్నాడు. వాడంతే! వాడు మారడు' —— దీర్ఘంగా నిట్టూర్చాను.

క్షమాపణ చెప్పుకుంటున్నట్టుగా చెప్పాడు నాగరాజు — "నువ్వా ప్రశ్నలు అడిగినప్పుడు నేను చెప్పిన జవాబులు వేరని ఆశ్చర్యపడుతున్నావు గదా! నాకు తెలుసు! నువ్వేమని అడి గావు — నేనే ఆడపిల్లనైతే ఏం సమా ధానాలు చెబుతానో ఆ సమాధానాలు చెప్పమన్నావు. అంతేగానీ ఆ ప్రశ్నలే నే నడిగితే ఎలాంటి జవాబులు చెప్పాలి?' అని అడగలేదు. అవునా?" కాస్సేపు ఆగి మళ్ళీ చెప్పసాగాడు.

"అయస్కాంతాలను గురించి నీకు తెలుసుననుకుంటాను..సజాతి ధృవాలు ఆకర్షించుకోవు ... విజాతి ధృవాలే ఆకర్షించుకుంటాయి. అలాగే ఒకే మన స్తత్వం వున్నవాళ్ళ కాపురంలో సంతోషం వుండదు. అంతేగాక చిన్నచిన్న తగాదాలు * లేకుంటే సంసా రంలో వెరైటీ ఏముంటుంది చెప్పండి?"

నేనుగాక మరెవరైనా అయితే అతడు చెప్పిన మాటలు నమ్మేసేవాడే! కానీ నాకు నాగరాజు సంగతి బాగా తెలుసు——నే నెలా నమ్ముతాను.

నేను వాడి మాటలు విని విస్తు పోయానేమోనని చూచాడు నాగరాజు. కానీ నేను చిరునవ్వు నవ్వుతుండడం చూచి వాడే విస్తుపోయాడు.

ఉన్నట్టుండి బండి పైకి లేచి మళ్ళీ క్షణంలో సర్దుకొంది. నాగరాజు నాకంటే పొడుగు. వాడి తల జట్కాబండి పై బాగానికి తగిలింది. "ఏవిటోయ్ అది!.. జట్కా నడపడం రాకపోతే ఎలా? ఇలా ప్రయాణీకుల తలలు పగల గొట్టడమేనా నీ పని?" అంటూ బండి వాడ్ని కసురుకొన్నాడు.

"పొరబాటయ్యింది సార్! ఈ గుఱ్ఱం బలే పొగురుమోతు...చూడండి ట్రాఫిక్‌లో ఎలాపరుగెత్తాలనిచూస్తోందో, ఒక్క క్షణం అలా ఆదమరిచానేమో! పరుగెత్త బోయింది. వెంటనే కళ్ళెం లాగాను. అందుకే అంత పెద్ద కుదుపు వచ్చింది ——" కళ్ళాన్ని మరీ వెనక్కు లాగి చేతిజాటీతో గుఱ్ఱానికి ఒక పెద్ద దెబ్బనుప్రసాదిస్తూ అన్నాడు జట్కావాడు.

---

# మారు బేరం



ఎస్. పురుషోత్తమాచార్య

"అయ్‌గోరూ ! దండం పెడత !"

అరుగుపైన కూచుని వక్కలు కత్తిరిస్తూన్న అవధానులుగారు వారగా నుంచుని పోయిన ఓదేలువంక ప్రశ్నార్థకంగా చూచేరు.

"మా దున్నపోతు కాలు నాని నట్లుందుండి! కుంటుతాంది ! యియ్యాల నా పాలు అరక సాగే యవ్వారం కనిపిస్తలేదుండి ! మీరు యాడనన్న పసువుల్ని బదులడుక్క రాండి ! గట్లయితేనే పని సాగుద్ది ! ఓ దిక్కు పొద్దు పోతాంది ! ఆడ కాల్వలకి నీల్లు కూడొచ్చినయ్ !" అన్నాడు ఓదేలు.

"నాకు రాత్రే ఎందుకు చెప్పలేదీ సంగతి ? ఈ సమయంలో ఊళ్లో పశువు లుంటాయని ఎలా అనుకున్నావ్ ? యిపుడెళ్ళి నన్నెవర్నడగమంటావ్ ? నీ పనులన్నీ యిలాగే

ఏడు స్తయ్ !" విసుక్కున్నారు అవధాన్లుగారు.

"తాటికొండ రామయ్య బండెడ్లలో ఓటి సచ్చింది కాదుండి ! ఆయాల నుంచి దాని జతెద్దుని యింటికాడే వుంచుతాండు ! జర మీరెల్లి అడుగుతే యియ్యకపోడు !" అన్నాడు ఓదేలు.

"నీ రెండో దున్నపోతుతో అంత ఎత్తున్న ఎద్దుని అరక కెలా కడతావోయ్ ? సలహా యివ్వటానికయినా యింగితం వుండాలి !" అన్నారు అవధాన్లుగారు.

"మాధారంలో సిన్నింటి కిష్టయ్య యింటికాడ కూడా ఓ ఎద్దుని కట్టేసి వుంచుతాడుండి ! నేను మూడు దినాల కాణ్ణించి చూస్తాన్న ! ఎల్లి మీరాయన్ని కూడా ఎద్దు నడుగుండి !" అన్నాడు ఓదేలు మళ్ళీ.

"మరి నీ రెండో దున్నపోతు నేం చేస్తావ్ ? అలా వెళ్ళి ఆవాల సీతయ్యని నేను అడిగానని చెప్పి వాళ్ళ దున్నపోతు నీవేళ కిస్తాడేమో చూడు ! ఈ లోగా నేను రామయ్య దగ్గరి కెళ్లొస్తాను" అంటూ లేచారు అవధాన్లుగారు.

"దాని కాలులో కూడా ముల్లిరిగినట్లుందుండి ! మంగలోడికి సూపిస్త !" నసుగుతూ ప్రక్కచూపులు చూడ సాగేడు ఓదేలు."

వాడి ఆ వాలకాన్ని కనిపెట్టి పళ్లు కొరికేరు అవధాన్లుగారు.

"తన దున్నపోతొకటి కాలుకదపటం లేదని తెలిసి రెండోదాన్ని కూడా కష్ట పెట్టదలుచుకోలే దీ వెధవ!" అనుకున్నారాయన.

"సరే వెళ్ళు ! నేనేవో అఘోరిస్తాను. వక్కల పళ్లేన్ని ప్రక్కనున్న బల్లపై గిరాటువేసి వీధిలోకి నడిచేరాయన."

అవధాన్లుగారు శివాలయంలో అర్చకులు. దేవుని మాన్యాన్ని నమ్ముకుని స్వంతమయిన ఓ దున్నపోతుల జతతోనూ, పనివాడు ఓదేలు అరకతోనూ వ్యవసాయం సాగిస్తూన్న పేద బ్రాహ్మణుడు.

అవధాన్లుగారిని చూస్తూనే రామయ్య లేచి చేతులు జోడించేడు.

"రామయ్యా ! మా ఓదేలు అరక ఈవేళ సాగేట్టులేదు. మీ ఎద్దు నీ పూటకు మా పొలానికి తోలాలోయ్ ! ఓ మడి మిగిలింది. దుక్కి సాగించి జాగ్రత్తగా మళ్ళీ మీ యింటి కంపిస్తాను" అన్నారు అవధాన్లుగారు.

"దాందేవుందుండీ ? తోలుకపోండి ! కాని మా పెద్దెద్దు సచ్చినకాణ్ణుంచి దీని ఘోస సూడలేకపోతున్ననుండి ! దీన్నిట్ల యింటికాడుంచే బదులు అమ్మిదావనుకుంటున్ననుండి ! నా కాకండ్లే కనపడి సావవయ్యే ! గా నవాబు

పేటదాక పోయిరావాలంటె పానం పోయేటట్లుంది. ఎవురన్న దీన్నమ్మి పెడతరేమో అని చూస్తాన్న!" అన్నాడు రామయ్య.

"ఎంత కమ్ముతావేవిటి ?" అన్య మనస్కంగానే ప్రశ్నించేరు అవధాన్లు గారు.

"ఎనిమి దొందలన్నా రావుండి! అంతకు తక్కువయితే నేను మునుగుత !" అన్నాడు రామయ్య సాలోచనగా.

"సరే! నా పని కానీవేళ! దీన్నమ్మి పెట్టే ఉపాయం నే చూస్తానులే" అంటూ ఎద్దువంక నడిచేరు అవధాన్లు గారు.

ఏపుగా పెరిగివున్న ఆ ఎద్దు ఆయన్ని చూసి త్రొట్రుపాటుతో లేచి నుంచుంది. దాని నుదురు నోసారి తడిమి కట్టుతాడుని విప్పి చేతపట్టుకుని వీధిలోకి దారితీసే రాయన.

ఆ ఎద్దు నలా తీసికెళ్ళి తమ పొలం లోని పాకలో కట్టేసి ప్రక్కనే దగ్గర్లో వున్న మాధవరం గ్రామంలోని కిష్టయ్య యింటివంక నడిచే రాయన.

వీధి అరుగుపైన కూచుని చుట్టని చుట్టుకుంటూన్న సిన్నింటి కిష్టయ్య దిగ్గున లేచి అవధాన్లుగారికి నమస్కరించేడు.

"కిష్టయ్యా ! మీ ఎద్దు నీ పూటకు మా పొలం పనికి తోలాలోయ్ ! ఒక్కటే మడి మిగిలింది. మా ఎద్దు కాలొకటి పనికిరాకుండా పోయిం దీవేళ. దుక్కి కాగానే మా ఓదేలుచేత జాగ్రత్తగా పంపిస్తాను" అన్నారు అవధాన్లు గారు.

"మీకు గామాత్రం సేయకపోతే పురుగుల్లా పడిపోనుండి ? అయినా మా యింటికాడ ఎద్దుందని మీకెట్ల తెలిసుందుండి ?" ఆశ్చర్యంగా ప్రశ్నించేడు కిష్టయ్య.

"ఎలాగో అలాగున తెలిసింది కాని అలా ఒంటెద్దు నింటిపట్టున వుంచి ఏం చే యా ల ను కుం టున్నావోయ్ ?" ఎదురు ప్రశ్న వేసేరు అవధాన్లుగారు.

"ఏంలేదుండి ! సవారి బండిని చేయించిన ! యింకో ఎద్దుని కొనాలను కుంటాన్న" అన్నాడు కిష్టయ్య.

అది వింటంతోనే సింహయ్యగారి బుర్రలో ఏదో మెరిసింది.

"నాకు తెలిసిన వాళ్ళదగ్గరో ఎద్దుందోయ్ ! నెల్లూరుగిత్తలా వుంటుంది. కొంటావా మరి ! ఆసలు నీవెంతలో కొనాలనుకుంటున్నావ్ ?" ఆసక్తిగా ప్రశ్నించేరు అవధాన్లుగారు.

"పది పన్నెండొందలేనా పెట్టంది, మంచెద్దేడా స్తదుండి ?" సాలోచనగా పలికేడు కిష్టయ్య.

అవధానులుగారి బుర్రలో ఆశాదీపం వెలిగింది.

"ఆ ! అలా అవుతే ఫరవాలేదోయ్!

అతను కూడా పన్నెండొందలకి పది కూడా తగ్గనంటున్నాడు. మరి రేపే వెళ్ళి బేరం ఫైసలా చేసి ఎద్దుని తీసుకు రానా ? పశువు నీ యింట అడుగేసాకే డబ్బిద్దువుకానీ !" అంటూ కుతూహలంగా చూచేరు అవధాన్లుగారు.

ఆయనవంక అదోలా చూచేడు కిష్టయ్య.

"అట్లాగేనుండి ! కాని ఎద్దుని చూసుకోవద్దా ?" మెల్లిగా ప్రశ్నించేదతను.

"చూడవలసిన పనే లేదోయ్ ! అసలైన జాతి గిత్తలా వుంటుంది. నాపై ఆమాత్రం నమ్మకంలేదూ ?" అన్నారు అవధానులుగారు.

కిష్టయ్య రెండు క్షణాలు ఆలోచించేడు.

"సరేనుండి ! పైకం సిద్ధంగనే వున్నది. మీరు ఎద్దునయితే తోలుకరండి !" అంటూ లేచి వెళ్ళి తన ఎద్దుని తీసుకుని వచ్చి కట్టుత్రాటిని అవధానులుగారి కందించేడు కిష్టయ్య.

అవధానులుగారు ఉత్సాహంగా కిష్టయ్య ఎద్దుని తోలుకుని తమ పొలానికి బయలుదేరేరు. దోవనిండా ఆలోచన లాయన మనస్సులో అలుముకు పోసాగేయి.

"ఈ బేరాన్ని ఏదోరకంగా ముడిపెడితే ఓ నాలుగొందలు సునాయాసంగా చేతిలో రాలుతయ్ ! ఓ నాలుగొందలు తమ వద్దెలాగూ వున్నవి. అంతా కలిపి ఎనిమిదివందల్లో మరో జత దున్నపోతు లెలాగూ రాకపోవు. దాంతో వచ్చేసంవత్సరం ఓదేలు పీడ వదిలించుకుని కూలీలతో స్వంతంగా వ్యవసాయం ప్రారంభించవచ్చును," అనుకున్నారాయన.

అంతలోనే ముందుగా రామయ్యకి చెల్లించవలసిన డబ్బు విషయం జ్ఞాపకం వచ్చిం దాయనకి. రామయ్య ఎంత మెతకవాడయినా డబ్బు చేతిలో పడందే ఎద్దుని వదలగలడన్న నమ్మకం ఏమాత్రమూలేదు. ఏంచేయాలా అన్న ఆలోచనలో పడిపోయారాయన.

తటాలున వారికి మార్గం గోచరించింది. మర్నాడు ఎలాగూ శుక్రవారం. నవాబుపేట సంతలో తమ దున్నపోతుల జతలోనుంచి ఒకదాన్ని అమ్మేస్తే నాలుగొందలు తప్పక వస్తాయి. తమ వద్దెలాగూ వున్న మిగిలిన నాలుగొందల్ని కలిపి రామయ్యకి డబ్బుని చెల్లించి ఆ ఎద్దుని తీసికెళ్ళి కిష్టయ్య కంటగడితేగాని తమకు లాభం చేతుల్లోకి రాదు. ఆ తర్వాత మళ్ళీ సంతకెళ్ళి ఒకేసారి మూడు దున్నపోతుల్ని కొనేయవచ్చునని స్థిమిత పడ్డారాయన. తాము ముందుగా డబ్బడుగుతే కిష్టయ్య కనుమానం వస్తుందని ఎద్దు నచ్చజెప్పాకే డబ్బివ్వవలసిందిగా ఎలాగూ చెప్పారు. అతడికి ఎద్దు నచ్చిందా సరేసరి ! నాలుగొందలు తమ అనుభవంలోకి వస్తాయి. లేదా అతణ్ణి

వేయిరూపాయలకయినా అంగీకరింప చేయవచ్చును. చివరికి అదీ కుదరక పోతే ఆ ఎద్దును తామే స్వయంగా సంతకి తోలుతే ఆమాత్రం డబ్బా తమకి రాకపోదు. అందువల్ల ఈ బేరం వల్ల లాభవే కాని నష్టంమాత్రం రాదన్న నిర్ణయానికొచ్చే రాయన.

"దాంతో మర్నాడు వేకువ ఝామున్నే లేచి తమ ఆలోచనని రహస్యంగా వుంచాలన్న ఆలోచనతో యింట్లోని ఆడవాళ్ళకి కానీ, వృద్ధులయిన తలిదండ్రులకి కానీ చెప్పా చేయకుండా దున్నపోతు నోదాన్ని స్వయంగా సంతకు తోలుకెళ్ళేరు అవధానులుగారు.

సంతలో అమ్మకం ముగిసిన వారికి ఆశించిన డబ్బుకంటే ఓ ఏభై అధికంగానే డబ్బు ముట్టింది. నవాబుపేటనుంచి తిన్నగా జనగామకు పరిగెత్తి యింట్లోకి కావాల్సిన చిల్లర మల్లర సరుకుల్ని కొనుగోలుచేసి కాలినడకన మాధవరం చేరుకున్నారు అవధానులుగారు.

కిష్టయ్యా యింట్లో కడుగుపెడుతూనే అతనింటి ఆవరణలో కట్టివేసున్న జత ఎద్దుల్ని చూడగానే అవధానులుగారికి క్షణం మతి చలించింది.

"రాండి ! రాండి ! అయ్‌గోరూ ! దండం పెడత! కొత్తెద్దుని చూసిన్రా?" అంటూ యింట్లోంచి యివతలికొచ్చేడు కిష్టయ్యా.

"ఏమిటిది ?" అవధానులుగారు లోగొంతుకతో ప్రశ్నించేరు.

"మీ కింక కష్టం వొద్దుండి అయ్‌గోరూ ! నిన్న మీరు పొలం కాణ్ణుంచి మా ఎద్దుని ఓదేలుచేత పంపిన్రు కదుండి ? ఆడు మీ ఊరి తాటికొండ రామన్న కాడున్న ఎద్దు జాడ చెప్పిండు ! దాంతో యియ్యాల పొద్దున్నె మీ ఊరి కురికిన ! మీరింటి కాడ లేరుగాదుండి ! మొత్తానికి బేరం ఫైసల చేసుకుని తొమ్మిదొంద లిచ్చి ఎద్దుని కొట్కొచ్చుకున్న !" కిష్టయ్యా ఉత్సాహంతో చెబుతోంటే నీరుగారి పోయేరు అవధానులుగారు.

"ఓదేలుచేత కిష్టయ్యా ఎద్దుని పంపించకుండా వుంటే విషయం యింత వర కొచ్చేదే కాదు. ఎంత పొరపాటు జరిగిపోయింది ? ఔరా ఓదేలూ ! ఎంత పనిచేసేవురా ?" అనుకుంటూ దిగాలుగా నుంచునిపోయిన అవధాన్లుగారి వాక వింతగా చూచేడు సిన్నింటి కిష్టయ్యా. ఎటూ తోచక బొడ్డులోనుంచి ఓ అయిదు రూపాయల కాగితాన్ని వెలికి లాగేడతను.

"అయ్‌గోరూ ! యిదోండి ! ఈ అయిదు రూపాయల్ని నా పేర దేవుడికి సదివించుండి ! సవకలో మంచి గొడ్డు దొరికింది. అంతా ఆడి దయే !" అంటూన్న కిష్టయ్యానుంచి ఆ కాగితాన్నందుకుని బరువుగా వీధిలోకి అడుగు వేసేరు అవధానులుగారు.

"ఏవండీ ! ఉదయంనుంచీ ఎక్కడి కెళ్లే రేవిటి ? మన దున్నపోతొకటి కన్పించటంలేదని ఓదేలు ఒహటే హడావిడిచేస్తూ యిపుడే దాన్ని వెతక టానికని అలా ఊళ్లోకి వెళ్లేడు. యిహ తాటికొండ రామయ్యా మీకోసం రెండు సార్లొచ్చి వెళ్లేడు. పైగా మాధవరం నుంచెవరో వచ్చి మీ గురించి వాకబు చేసేరు." యింట్లోకి అడుగు పెడుతూనే దండకం చదివింది అవధానులుగారి ఆడమనిషి.

సమాధానంకూడా చెప్పకుండా భుజంపైనున్న మూట నందించి అన్య మనస్కంగా వీధిలోకి వెడుతోన్న భర్త వంక అదోలా చూచిం దా యిల్లాలు.

రామయ్యా యింట్లోకి అడుగు పెడు తూనే అతనింట వున్న ఓ క్రొత్త వ్యక్తిని చూచి అవధానులుగారి మొహం వెలవెలాపోయింది అంతేకాక రామ య్యింటి ఆవరణలో కట్టేసివున్న దున్న పోతుని చూడగానే వారికి మతి భ్రమించి పోయింది.

"అయ్‌గోరూ ! మీ యింటికి రెండు మాట్లొచ్చిన! మీరేడికి పోయిన్రోఏమో? మీకు కష్టం వొద్దుండి ! వంద లాభానికి మా ఎద్దుని మాధారం కిష్టయ్యకమ్మిన!" ఉత్సాహంగా పలికేడు రామయ్యా.

కాని అవధానులుగారికి మాత్రం రామయ్య పలుకు లేమాత్రమూ విని పించలేదు. వారి దృష్టిమాత్రం శూన్యంగా రామయ్య ప్రక్కనే వున్న క్రొత్తవ్యక్తిపై కేంద్రీకృతమైపోయింది.

"ఈడు మా బామ్మర్ది ఈరయ్యండి ! మా మామ తాటికొండ కిల్లింటకం తెచ్చుకున్నడని సెప్పిన కాదుండి ? ఆడే ఈడు !" అన్నాడు రామయ్య, అవధానులుగారి వంక వింతగా చూస్తూ.

"ఓ బావా ! అంగట్లో ఆ దున్న పోతుని కొన్నది ఈరికాణ్ణే !" అన్నాడు వీరయ్య, రామయ్యవంక తిరుగుతూ.

రామయ్య ఆశ్చర్యంతో తల మునక లయ్యేడు.

"గదేందుండి అయ్‌గోరూ ? మీ రంగడి కెందుకు పోయిన్రు ? దున్న పోతు నెందు కమ్మిన్రు ? బేరం గీరం మీకేం తెలుసుండి ? గీ దున్న పోతుని గంత సవక కెవడన్న అమ్ముతడా ? అన్నన్న ! గిదేం యవారముండి ? అసుంటి పోతు మీ కిపుడు ఆరొందలు పెడితె మాత్రం మల్లొస్తదా ?"...

రామయ్య పలుకులు అవధానులుగారి అంతరంగంలో చిల్లులు వేయసాగాయి.

నోరు మెదపక వెనుదిరిగి గబగబా వెళ్ళిపోతున్న అవధానులుగారివంక గుడ్లప్పగించి చూస్తూ వుండిపోయేరు రామయ్యా, వీరయ్యాలు.

వీధి గుమ్మవంక అడుగులేస్తూన్న అవధానులుగారిని గుర్తించి విసురుగా లేచి నుంచుని రంకె వేస్తూ కట్టుత్రాడుని లాక్కునే ప్రయత్నం చేయసాగింది, అవధానులుగారి ఆ అమ్ముడుబోయిన మహిషరాజం.

---

# ప్రేమ పూజారి

(గత సంచిక తరువాయి)

"అది తెలిసేదాకా ఓపికపట్టే శక్తి నాకు లేదు. నీ గతజీవితానికున్న కళంక మేదో తెలుసుకొని, అది భరించే శక్తి నాకున్నప్పుడుకూడా నువ్వు నన్ను స్వీకరించవా ?''

ముసిముసిగా నవ్వింది శ్యామ. ''అంత గొప్ప హృదయాన్ని భరించే శక్తి నాకెక్కడుంది? దూరంగా నిల్చుని భక్తితో ఒక నమస్కారంచేస్తాను!"

''ఇలా పిచ్చిపిచ్చిగా మాట్లాడితే నేనొప్పుకోను. అసలు నీ ఇష్టం ఎవడికావాలి? ఎత్తుకుపోయి పెళ్ళిచేసుకొంటాను.''

''నా మనసుతో పనిలేదన్నమాట!"

''అదేకదా ఒక అపురూపసంపద నాకు! కొంపదీసి పెళ్ళిపీటలమీద తారుమన్న నీ మొగుడు ఎత్తుకుపోలేదుకదా ఆ మనసును!'' సురేష్ హాస్యంగా అడిగాడు.

''ఊహుఁ, ఒక బాబు దోచుకొన్నాడు. పిచ్చిబాబు!"

"పిచ్చిబాబా? వాడెవడు?'' ఈర్ష్యను దాచుకోలేనట్టుగా అడిగాడు.

''ఊహుఁ, అతడి పేరు చెప్పను. కరిగిపోయిన ఒక కమ్మనికల. ఒక్కక్షణం తాకి వెళ్ళిన ఒక పూల తెమ్మెర. నా మనసులోనే పదిలంగా దాచుకోవలసిన మధురస్మృతి!"

"అబ్బా! నీ కవిత్వంతో నా ప్రాణాలు తీసేస్తున్నావు!"

"మా ఊరువెళ్ళి నా కథ తెలుసుకొంటానన్నారుకదా? అప్పుడైనా మీ ప్రాణాలు పోవలసిందేకదా?...ఊఁ, ఇక నన్నువదిలిపెడతారా? పనిఉంది."

"దయచేసి మీ ఊరిపేరు చెబుతావా?"

"చెప్పను. అదికూడా మీరే తెలుసుకోవాలి!" గడుసుగా అతడిని తప్పించుకొని ఇంట్లోకి వచ్చేసింది.

ఇంట్లోకి వస్తూనే వరలక్ష్మి అడిగింది, ''సురేష్ ఏమిటి మాట్లాడుతున్నాడు నీతో? ఢిల్లీకి లేవదీసుకుపోతానంటున్నాడా నిన్ను?''

ఆ వెటకారానికి గతుక్కుమంది శ్యామ.

"ఊహుఁ. పెళ్ళిచేసుకొని వెంట తీసుకుపోతానంటున్నాడు!"

"నీ రొట్టెవిరిగి నేతిలో పడిందన్నమాట! వాడు తిరిగి రాగానే నేనను కొన్నాను, ఇలాంటిదేదో జరుగుతుందని!

పోల్కంపల్లి శాంతాదేవి

నే ననుకొన్నది నిజమే నన్నమాట! చివరికి ఒక వంటలక్క-తో రాసిపెట్టి ఉందన్నమాట వాడి పెళ్ళి!" ఆవిడ ఒక నిట్టూర్పు విడిచింది.

శ్యామ మౌనంగా తనపనిలో నిమగ్నమైంది.

తరువాత సురేష్‌ను పెట్టవలసిన చీవాట్లు నాలుగూ పెట్టనే పెట్టింది వరలక్ష్మి.

శ్యామ విముఖత్వంతో అసలే చిరాకుగా ఉన్న సురేష్ మండిపడ్డాడు. "మీ రిలా ఏడుస్తారనే ఆవిడ ఒప్పుకోలేదు!"

"ఒప్పుకోలేదా?'' విడ్డూరంగా చూసింది. ''బిచ్చపుదాన్ని తీసుకుపోయి రాణీవాసంలో ఉంచుతానంటే ఒద్దనేది ఉంటుందా?''

"తను బిచ్చపుదికాదుగా! మన దయాదాక్షిణ్యాలతో బ్రతుకుతున్నది అసలే కాదుగా? రెక్క-లకష్టంతో బ్రతుకుతున్న శ్రమజీవి. ఆత్మగౌరవం ఏ క్షణంలోనూ మరిచిపోని మనిషి!"

"అయితేమాత్రం? రెండోపెళ్ళి చేసుకొని ఉద్ధరిస్తానంటే ఒద్దనడం దేనికి?"

''దేనికో నువ్వే అడిగి తెలుసుకో, అత్తా! నా కిప్పుడు మాట్లాడే ఓపికకూడా లేదు.'' విసురుగా పైకి వెళ్ళిపోయాడు.

సురేష్‌ది మొదటినుండీ దుడుకు స్వభావం. తల్లిలేని పిల్లలని రత్ననూ, సురేష్‌నూ అపురూపంగా పెంచాడు తమ్ముడు. అతిగారాబంవల్ల తనకు కావలసినది పొందడంకోసం దేనికీ లెక్క-జేయని మొండితనం ఏర్పడింది. కాని, ఇలా అంతస్తులు మరిచి తిరగడం ఎవరు సహించే సంగతి? తనింట్లోనే ఇలాంటి అప్రాచ్యపుపని జరుగుతోందే తమ్ముడేంకోపం తెచ్చుకుంటాడో తన మీద? చూస్తూ నువ్వేలా అడ్డుపడలేదక్క-య్యా అనడూ?

ఈ సంగతి రావుగారి చెవిలో వేసింది వరలక్ష్మి.

ఆయన మందహాసం చిందించారు. "ఒప్పుకోలేదా! ఉత్తమురాలు! నా అంచనాకు మించి నిలబడింది."

"మీరొక మహర్షులైపోయారు ఈ మధ్య. చివరికిదిమనకొంపకే ఎసరు పెట్టదు కదా అని నేను భయపడి చస్తున్నాను!"

"ఎప్పుడూ అవతలిమనిషిని అపనమ్మకంతో చూడడమనేది అంత మంచిదికాదు. వరం! ఆపిల్ల ఎటువంటిదో నేను బాగానే గుర్తించాను. ఆమెనునమ్మి తాళంచెవులగుత్తి ఆమె చెంగునకట్టు. నీ సొమ్ము పూచికపుల్లపోకుండా జాగ్రత్తపరిచి ఉంచగలదు. ఇకపోతే రత్నస్థానాన్ని ఆమె ఎప్పుడూ ఆశించదు! పరులసొమ్ము పూచికపుల్లకూడా ముట్టే మనిషికాదు!"

"ఇప్పటివరకైతే ఆమెను వేలెత్తి చూపేందు కేమీ దొరకలేదు నాకు!"

"నిప్పులాంటి మనిషని ఇప్పటికైనా గుర్తిస్తే మంచిది."

కాని, రావుగారి నమ్మకంమీద పిడుగుపడ్డట్టుగా ఒక సంఘటన జరిగింది.

తమ పల్లెనుండి భూమి పట్టాకోసం ఒక ఆసామీ వచ్చాడని, అతడు బ్రాహ్మణుడని, ఇక్కడే భోజనానికి లేస్తాడని లోపలికి కబురుచేశారు రావుగారు.

టేబిల్ మీద శ్యామ వడ్డిస్తుండగా రావుగారు బేసిన్ దగ్గర చేతులు కడుక్కొని టవల్ తో తుడుచుకొంటూ టేబిల్ దగ్గరికివస్తూ, "రావోయ్, భాస్కర్! చేతులు కడుక్కో"అన్నారు. హడావిడిగా తన అతిధిని ఆహ్వానిస్తూ.

శ్యామ ఉలికిపాటుతో తలెత్తి చూసింది. పిడుగుపాటు తిన్నమనిషిలా నిశ్చేష్టురాలైపోయింది.

భాస్కర్ ఈమెనే విభ్రమంతో చూస్తున్నాడు. కాలువలోపడి చచ్చిపోయిన మనిషి ఇక్కడికెలా బ్రతికి వచ్చింది?

రావుగాగు మరోసారి హెచ్చరించడంతో భాస్కర్ నెమ్మదిగా కదిలి చేతులు కడుక్కొని టేబిల్ దగ్గరికివచ్చి కూర్చొన్నాడు. అన్నం కలుపుతూ, "చచ్చిన మనుషులు బ్రతకడం మీరెప్పుడైలా చూశారా, రావుగారూ?" అని అడిగాడు.

"చూడలేదు," అన్నారు రావుగారు. "చచ్చినవాళ్లు బ్రతకడమనేది అసంభవమైన సంగతి. మానవుడు ఎన్ని నేర్చుకొన్నా మృత్యువు చేతులనుండి తప్పించుకోవడం నేర్చుకోలేదు. ఒకసారి చచ్చాక బ్రతకడమనేది ఒక కల్ల!"

"నేను చూశాను!"

"ఎక్కడ? ఎప్పుడు?"

"ఇక్కడే, ఇప్పుడే."

"ఏమిటోయ్ భాస్కర్, ఈ తమాషా?"

"తమాషా కాదండీ రావుగారూ! ఆమెను నే నిక్కడ చూస్తున్నాను. మీరూ చూస్తున్నారు." శ్యామమీదే దృష్టినిలిపి అన్నాడు భాస్కర్.

రావుగారు తెల్లబోయారు. "శ్యామసుందరి నీకు తెలుసా?"

తెలియడమేమిటి? ఆమె నా వదినగారు. ఆమె చెల్లెలు నాభార్య!"

"అలాగా?ఆమెతన కెవరూలేరంది!" ఆలోచనగా అన్నారు.

"చచ్చిపోయి బ్రతికినవాళ్ళు అలాగే చెబుతారులెండి!...బాగున్నారా, వదినగారూ?"

"........."

"మాట్లాడవేం, శ్యామసుందరీ?"

"నువ్వు ఎవరో నాకు తెలీదు. నువ్వనే

శ్యామసుందరి ఎవరో?" శ్యామ ముఖం తిప్పుకొంది.

"నువ్వు శ్యామసుందరివికాకపోతే ఆమె తాలుకు దెయ్యానివి కావాలి! కొంప దీసి, దెయ్యంచేతివంట తింటున్నారా ఏమిటి, రావుగారూ మీరు?'' ఫెళ్ళున నవ్వాడు భాస్కర్.

రావుగారు నవ్వలేదు. గంభీరంగా, "చెప్పమ్మా శ్యామసుందరీ! నేనున్నాను నీకు. నిజం చెప్పు!'' అన్నారు

''నిజం చెప్పగలను, బాబుగారూ! కాని, ఆ నిజానికి సాక్ష్యం మరొకరుంటే తప్ప నేను చెప్పే నిజానికేమీ విలువ ఉండదు. అలాంటప్పుడు నిజం చెప్పక పోవడమే మంచిదికదా?"

"నిజాన్ని నమ్మకపోవడమనేది ప్రపంచానిది తప్పు! కనీసం ఉన్నది ఉన్నట్టు చెప్పుకొంటే అవతలివాళ్ళు నమ్మినా నమ్మకపోయినా హృదయ భారమనేది తగ్గుతుందికదా?''

"**అవతలివాళ్లు** మనం చెప్పే నిజాన్ని నమ్మనప్పుడు హృదయభారం తగ్గదు, బాబుగారూ! ఉక్రోషంతో, దుఃఖంతో హృదయభారం హెచ్చుతుంది. నా **నిజాయితీకి సాక్ష్యం ఒకేఒక్కరున్నారు.** కాని, ఆ ఒక్కరూ నా స్వాధీనంలో లేనిమనిషి!"

''అతడు ఎక్కడున్నా సరే నేను పిలిపిస్తాను. నువ్వు మాత్రం చేయని తప్పు నెత్తినవేసుకొని లోపలే కుమిలి పోవడం న్యాయం కాదు. నిజం చెప్పు! ఏంజరిగింది? ఎందుకిలా ఇల్లువిడిచి పారి పోయి వచ్చావు?"

"..........''

"చెప్పమ్మా!"

"నేనేమీ చెప్పలేను. **బాబుగారూ!** నన్ను బలవంతపెట్టకండి" శ్యామ కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

"ఎందుకమ్మా?'' ఆర్ద్రంగా అడిగారు.

"నా నిర్దోషిత్వాన్ని రుజువుచేసుకో లేని దురదృష్టవంతురాలిని.

భాస్కర్ కోపంతో, "నువ్వు నిర్దోషివా? ఆ అర్ధరాత్రి ఇంటివాళ్ళంతా లేచి చూచింది అబద్ధమా?" అన్నాడు.

శ్యామ కళ్ళలో నిప్పులు రాల్చుతూ చూసింది. **మాట్లాడడానికి కూడా** అసహ్యం వేసింది.

తప్పుచేసినదానికి మాట్లాడడానికి నోరెక్కడ?"

"నువ్వెంత నీచుడివో, దుష్టుడివో నీ మనసుకు తెలుసు. నీకేఅంతనోరుంటే ఏతప్పుచేయని నాకు నోరెందుకుఉండదు భాస్కర్? నోరులేకకాదు మాట్లాడంది! నీతో మాట్లాడడానికి అసహ్యంవేసి!"

''అబ్బా! పెద్ద పతివ్రత!"

"పతే లేకపోతే నేను పతివ్రత నెలా అవుతాను?''

"పతిలేకపోవడమేమిటి?పిచ్చివాడిగా

నటించి నిన్ను వల్లోవేసుకొన్నాడే?వాడే నీ మొగుడనుకో !''

"ఛీఛీ' నీది నాలుకేనా?'' శ్యామ కంపరంగా చూసింది.

ఇంతసేపు శ్రోతగా ఉన్న వరలక్ష్మి కుతూహలం ఆపుకోలేకపోయింది. "ఇంతకీ ఏంకథ భాస్కర్ బాబూ?" అని అడిగింది.

"ఈవిడ నా భార్యకి అక్కగారు. పెళ్ళిపీటలమీదే మొగుడు చచ్చాడు. పిచ్చివాడిలా నటిస్తూ ఒక సి.ఐ.డి. ప్రవేశించాడు ఊళ్ళో. అతడికీ, ఈమెకీ ఎలాగో సంబంధం ఏర్పడింది. అన్నగారితో చెప్పి అతడికి ఇంట్లోనే స్థానం ఏర్పరచింది. వాళ్ళఇంటికి అల్లుడినైన పాపానికి వాళ్ళ పరువు మర్యాదలను కాపాడవలసిన బాధ్యత మీద వేసుకొన్నాను. ఒక అర్ధరాత్రి ఒక మంచంలో వాళ్ళిద్దరినీ పట్టి ఇచ్చాను. ఆ దృశ్యాన్ని ఇంటివాళ్ళంతా చూసి తరించారు. ఆ తరువాత చెప్పేది ఏముంది. వాడు ఎక్కడికో పారిపోయాడు. ఈవిణ్ణి వీళ్ళన్నయ్య చావగొట్టి గదిలో పెట్టి తాళంపెట్టాడు. ఓ మూడుకాళ్ళ ముసలికిచ్చి రెండోపెళ్ళి చేసి ఈ పీడ వదల్చుకోవాలనుకొన్నాడు. కాని, రేపు పెళ్ళనగా ఈవిడ ఇంటి నుండి పారిపోయింది. తను చచ్చిపోయిందనుకోవాలని కాలవఒడ్డున ఓ చీటీ, బిందె వదిలేసింది ఆ చీటీ చూసి ఈమె చచ్చిపోయిందనే అనుకొన్నారు. తర్పణంకూడా వదిలి తన కర్తవ్యం నెరవేర్చాడు మా పెద్దబావగారు ! ఇన్నాళ్ళకి ఇక్కడిలా ప్రత్యక్షమైంది ఈ తల్లి !"

వరలక్ష్మి ముఖమంతా జుగుప్సతో నిండిపోయింది. "ఛీ ఛీ !" అంది.

రావుగారు ఖిన్నవదనులై అన్నం తినడం మానేసి మునివేళ్ళతో గడ్డం తడుముకొంటున్నారు. కాని, ఇంతలో ఒక విచిత్రం జరిగిపోయింది.

శ్యామచేతిలో పప్పుగిన్నె భాస్కర్ తలకు తగిలి భళ్ళున క్రిందపడి పోయింది. భాస్కర్ తలా, ముఖం పప్పుతో నిండిపోయాయి. వికృతంగా కేకపెట్టాడతడు.

గుమ్మం దగ్గర చేతులుకట్టుకుని నిలబడిన సురేష్ అతడి అవతారం చూసి పొట్టచెక్కలయ్యేలా నవ్వాడు, చప్పట్లు జోరుగా చరుస్తూ.

తన అతిథికి పట్టిన దుర్గతికి చింతిస్తూ రావుగారు శ్యామకోసం చూశారు. శ్యామ అప్పటికే అక్కడినుండి పారిపోయి తనగదిలో దూరి తలుపులు బిడాయించుకొంది.

భాస్కర్ గంట తరువాత సెలవు తీసుకొని వెళ్ళిపోయాడు. వెళ్ళేలోగా నోటికివచ్చినట్లల్లా వాగుతూనే ఉన్నాడు. శ్యామ గతాన్ని ఎంత నీచంగా చిత్రించవచ్చునో అంత నీచంగా చిత్రిస్తూనే ఉన్నాడు.

సురేష్ కళ్ళు అంతకంతకు ఎరు పెక్కుతున్నాయి. భాస్కర్‌ను చీల్చి చెండాడాలన్నంత ఉగ్రత్వం రేగుతున్న దతడిలో.

"...ఒక బాబు దోచుకొన్నాడు! పిచ్చిబాబు!"

శ్యామ నిన్న మధురంగా నవ్విన నవ్వు అతడి చెవిలో ప్రతిధ్వనించక పోతే, భాస్కర్ మీదికి లంఘించి అతడి జుట్టుపట్టుకొనేవాడే. అతడి ఆవేశానికి సంకెళ్ళు వేస్తున్నాయి శ్యామ చెప్పిన మాటలు.

విషపానం చేస్తున్న వాడిలా మౌనంగా, విషాదంగా కూర్చున్నారు రావుగారు.

"చూశారా, చూశారా? ఆ పిల్ల రంగు పొంగు చూసి నాకు అనుమా నంగానే ఉంది. మీరు మాత్రం ఆమె మీద ఎక్కడలేని అభిమానం పెంచు కొన్నారు! ఏ ఊరో ఎక్కడిదోనని నేను ఉండవలసిన జాగ్రత్తలోనే ఉన్నాను, సుమండీ!" తన జాగ్రత్తకు, తెలివి తేటలకు సంతోషించసాగింది వరలక్ష్మి.

హాల్లో గోడగడియారం రాత్రి పన్నెండుగంటలు కొట్టింది.

నెమ్మదిగా తన మూట తీసుకొని పెరటితలుపు తెరుచుకొని బయల్దేరింది శ్యామ. వరండాముందుతప్ప తోటలో లైట్లన్నీ ఆర్పివేయబడి ఉన్నాయి. వెన్నెల మసగ్గా కాస్తున్నది.

గూర్ఖా గోడవారగా పడుకొని గుర్రు పెడుతున్నాడు.

శ్యామ గేటుకున్న గొళ్ళెంమీద చేయి వేసింది.

ఎవరిదో ఒక బలమైన హస్తం ఆమె జబ్బగుచ్చి పట్టుకొన్నది.

"నీ నిజమైన కథేదో తెలుసుకోనిదే నిన్ను పోనివ్వదలుచుకోలేదు శ్యామ సుందరీ!" సురేష్ గంభీరంగా అన్నాడు. "కథలుచెప్పి బ్రతికే అవసరం లేదన్నావ్! కాని నీ నిజమైన కథ చెప్పవా?"

"చెప్పే అవసరం ఏముంది? చెప్పకపోతే నష్టం ఏముంది మీకు?"

"నష్టం లేకపోయినా ఈ రోజు నీ యదార్థ పరిచయం చేసుకోనిదే నిన్ను వదలను!" ఆమె చెయ్యి గట్టిగా పట్టు కొని తోటలోకి నడిపించుకుపోయాడు సురేష్. ఆమె చంకలో మూటలాగి ఓ పక్కకు గిరవాటు వేశాడు.

అతడిచర్యకు విస్తుపోయి చూడ సాగింది శ్యామ.

ఆ మసకవెలుగులో అతడికళ్ళు తీక్ష ణంగా మెరుస్తున్నాయి. ఇంకా కొంచెం పరిశీలనగా చూడగలిగితే అతడి ముఖంలో ఒక అవ్యక్త వేదన, ఆరాటం గోచరిస్తాయి.

సురేష్ కీరోజు మొదటిసారిగా తెలి సింది శ్యామసుందరిని తనెంత గాఢంగా ప్రేమిస్తున్నదీ! ఆమె ఎటువంటిదైనా

తనకు కావాలి. ఆమె అపరాధం ఎటు వంటిదైనా తను క్షమించగలడు! భార్యగా స్వీకరించగలడు! కాని, శ్యామ సుందరి తన హృదయం విప్పి చెప్పాలి! తప్పటడుగులు అందరి జీవితంలోనూ ఉంటాయి. మేధావుల జీవితాలలోనూ ఉంటాయి. ఆమె చరిత్ర ఎవరి నోటి నుండో అసహ్యంగా చెప్పబడడం కాక ఆమె చెబితే వేరుగా ఉంటుంది! ఆమెను తన హృదయంలో దాచుకోగలడు!

"నీ చెల్లెలిమొగుడు చెప్పింది ఎంత వరకు నిజమో తెలుసుకోవా లనుకొంటు న్నాను."

"నిజానిజాలు చెప్పి మీదగ్గర నా నిర్దోషిత్వం నిరూపించుకొనే అవసరం నాకేంలేదు!" శ్యామ విసురుగా అంది. "మీరెవరని?"

సురేష్‌గొంతు హఠాత్తుగా రుద్ధంగా మారిపోయింది. "శ్యామసుందరీ!" అన్నాడు. నీకు నేను ఏమీ కాకపోవచ్చు. కాని, నువ్వు నాకు అన్నీ, అందరివీ. నిన్ను ఎవరో కళంకినిగా చెప్పు కొంటుంటే నా కెంత రంపపు కోతగా ఉందో నీకెలా చెప్పను?"

"నేను కళంకినిని కాదు!"

"ఆ సంగతే నేను ప్రపంచానికి చాట గల అవకాశం నాకివ్వాలి నువ్వు. నువ్వు ప్రేమించానన్న 'అతడు' ఎక్క డున్నాడిప్పుడు? అతడిని నేను కలుసు కోవాలి!"

"అతడు లేడు. చచ్చిపోయాడు."

"చచ్చిపోయాడా?"

"చచ్చిపోయాడు అతడి పిచ్చి నయంచేయమని అతడిని డాక్టర్లచేతిలో పెట్టారు ఆయన తలిదండ్రులు. డాక్టర్లు ఆయన్ని చంపేశారు!"

సురేష్ ఎందుకో ఒక నిట్టూర్పు విడి చాడు. అది గుండెలమీద బరువు తొలిగి నప్పటిదో పేరినప్పటిదో సరిగా నిర్ణ యించలేం. కాని, అతడి ముఖంలో అగాధంలోని చీకటి పేరి ఉంది.

"సరే. నీకిష్టలేని మనిషికి నీ హృద యంలో సూది మొనంత చోటుకూడా ఇవ్వవని తెలిసిపోయింది. ఈ ప్రపం చంలో నువ్వు ఒంటరిదానివి. ఒంటరి గానే సాగిపోవాలనుకొంటున్నావు. కాని, నీకు తోడుగా నడవాలనుకొంటున్నాను. భర్తగా అధికారం సంపాదించే అవకాశం నాకు లేదు. ఒక స్నేహితుడుగా నీ వెంట నడవాలనుకొంటున్నాను. దానికి కూడా నువ్వు అభ్యంతరం చూపు తావా?"

"మనసును నమ్మినా వయసును నమ్మలేం కదా?"

"ఊహు. నాకు కావలసిన నిగ్ర హాన్ని నీదగ్గరే సంపాదించుకొన్నాను. నావల్ల నీకే భయమూ ఉండదు. ఇలా ఎక్కడికో పారిపోయేకన్నా నాతో ఢిల్లీ రా. నువ్వు బ్రతకడానికి కావలసిన పట్టె దన్నం, ఒళ్ళుదాచుకోడానికి కావలసిన

సైన్ పంచెలూ నేను ఇస్తాను! నీ జీవితం నిశ్చింతగా వెళ్ళిపోయే ఏర్పాటు నేను చేస్తాను!"

"నిశ్చింతకోసం నా మనసు ప్రాకు లాడడంలేదు. కలలతోనూ బ్రతకడం లేదు. చావు వచ్చేదాకా బ్రతకాలి కాబట్టి బ్రతుకుతాను! అంతే. ఏ ఆశలూలేని నేను మీ ఆశ్రయాన్ని స్వీకరిస్తానని అనుకోకండి, సురేష్‌బాబూ! మా ఊరు విడిచినప్పుడు నాకింత ధైర్యంలేదు. ఎక్కడో కాస్త పట్టెడన్నం పెట్టగల నీడ దొరికితే చాలుననుకొని మీ మామయ్య గారిని వేడుకొన్నాను. వారు దయతో నాకీ ఇంట చోటిచ్చారు. దురదృష్టవశాత్తు వాళ్ళుకూడా అసహ్యించుకొనే పరిస్థితిలో పడ్డాను. ఇప్పుడు ఎక్కడికైనా వెళ్ళగలనన్న ధైర్యం నాకీ రెండు రెక్కలిచ్చాయి!"

"నీ అందం, నీ వయసు రెండూ నీకు శత్రువులౌతాయని తెలియదా?"

"తెలుసు. ఆ శత్రువులను ఎక్కడా వదిలేసే ఉపాయం నాకు తెలియడం

లేదు. నేను ఎక్కడికి వెళ్ళినా నా శత్రువులను వెంటబెట్టుకొనే వెళ్ళాలి. పోరాడాలి !"

"నిన్ను ప్రేమించిన వాళ్ళకి దుఃఖం తప్ప ఇంకేమీ మిగలదన్నమాట ?"

"కోరదగని వస్తువులను కోరితే దుఃఖం కాక మరేమిటి ?"

సురేష్ కొద్దిసేపు మాట్లాడలేక పోయాడు. చివరికన్నాడు. "ఇంట్లోకి పద. ఇలా అర్ధరాత్రివేళ పారిపోయే అవసరమేమిటి నీకు ? పొద్దున్నే అందరికీ చెప్పి సెలవు తీసుకొని వెళ్ళవచ్చు. నిన్ను ఆపడానికి ఎవరున్నారు ?"

శ్యామ తర్కించకుండా ఇంట్లోకి వచ్చి పడుకొంది.

తెల్లవారుతూనే సురేష్ కోరిన విధంగా అందరిదగ్గరా సెలవుతీసుకొని ఆ ఇల్లు విడిచిపెట్టింది శ్యామ. రావుగారు ఆమెను ఆపాలనుకొన్నారుగాని, ఏ కారణంచెప్పి ఆమెను ఆగమంటాడు ?

సాయంత్రానికల్లా కొత్తవంటమనిషి కుదిరింది రావుగారింట్లో.

## 23

మరునాడు మేనమామ ఇంటినుండి వచ్చాడు రాజీవ్.

"ఇన్నిరోజులు ఉండిపోయావేం ? రత్న ఉంచేసిందా ?" చిరునవ్వుతో ప్రశ్నించింది వరలక్ష్మి.

"మామయ్య పర్యటన ముగించుకొని నిన్న వచ్చాడు."

"అలాగా ? లగ్నపత్రిక పెట్టుకు వచ్చావా ?" సంబరంగా అడిగిన వరలక్ష్మికి రాజీవ్ సమాధానం పిడుగు పడ్డట్టుగా అయింది.

"రత్నకి మరో సంబంధం చూడమని చెప్పాను మామయ్యకు "

"ఎందుకురా ?"

"రత్న ఎటువంటిదో నాకు బాగా తెలుసునమ్మా. మామయ్య చేతుల్లో ఆమె పువ్వులా పెరిగింది. కష్టాల్ని సహించలేదు పరిస్థితులు ఒకేలా ఉండవు. ఏదైనా జరిగితే రత్న రాజీపడి బ్రతకలేదు !"

"ఏదో జరుగుతుందని రత్నని భయపెట్టావా ?" వరలక్ష్మి నెత్తికొట్టుకుంది.

"తనకి నేను తగినవాడిని కానమ్మా ! నా విలువేమిటో నాకు తెలుసు !"

"రత్నకి నువ్వు ... నువ్వు తగినవాడివి కావా ?" కొడుక్కు మళ్ళీ పిచ్చి తిరగబెట్టలేదుకదా అన్నట్టు భయంగా చూసింది ఆమె.

"అదేమాట మామయ్యకీ చెప్పాను !"

"రత్నకి నువ్వు తగినవాడివి కావా ? ఎందులో తక్కువ, బాబూ, నువ్వు రత్నకు ? రూపంలోనా, సంపదలోనా, గుణంలోనా ? దేనిలో తగినవాడివికాదు ?" దుఃఖస్వరంతో ఆవేశంగా అడిగింది.

"కారణాలు వివరించమంటే నావల్ల

## వచ్చే సంచిక నుంచి-సరికొత్త శీర్షిక




**బహుమతి : రూ 116**

పాఠకుల్లో అనేక విషయాలపై జిజ్ఞాసను రేకెత్తించేందుకు, స్ఫురింపును కలిగించేందుకు, జ్ఞాపకశక్తిని గుర్తుచేసేందుకు ఫిబ్రవరి నెలనుంచి 'క్విజ్' అనే ఓ కొత్తతరహా శీర్షికను 'యువ' ప్రవేశపెడుతూన్నదని తెలియజేయటానికి సంతోషిస్తున్నాము.

ఈ క్విజ్‌లో చారిత్రక, సామాజిక, సాంస్కృతిక, సారస్వత, సాంకేతిక, మనోవైజ్ఞానిక, ఆర్థిక, రాజకీయ, శాస్త్రీయ, క్రీడారంగాలకు సంబంధించిన అనేక అంశాలపై పది ప్రశ్నలుంటాయి. పాఠకుల సౌకర్యార్థమై ఒక్కొక్క ప్రశ్నకు నాలుగురకాల సమాధానాలు ఇస్తాము. అందులో సరైన సమాధానాలను మీరు ఎంచుకొని, 'క్విజ్'ను పూర్తి చేయవలసి ఉంటుంది. అల్ కరెక్టుగా పంపిన ఎంట్రీకి రూ. 116 బహుమానము.

క్విజ్, దానిని గురించిన పూర్తి వివరాలు వచ్చేసంచికలో మీరు చూడగలరు.

**సంపాదకుడు యువ**

హైదరాబాదు.

కాదమ్మా. జరిగేదేమిటో తెలిశాకకూడా రత్నని మోసగించలేను.''

''ఏమిటి, బాబూ ఆ జరిగేది ? ఏమిటిరా అది? నాకొక్కంచెం చెప్పరా!" పిచ్చిదానిలా కొడుకు భుజాలుపట్టి ఊపి వేయసాగి ది." ఈ మధ్య నువ్వు చాలా గుట్టు నేర్చావు. ఏదీ మనసు విప్పి ఈ అమ్మతో చెప్పవు! అంతా నీ మనసులో పెట్టుకొని రగిలిపోతున్నావు. నాకు తెలియని కష్టాలు నీ కే మొస్తాయి, బాబూ ?"

రాజీవ్ బాధగా కణతలు రుద్దుకో సాగాడు.

"ఓ ! రాజా ! ఎప్పుడొచ్చావు ? ఇప్పుడేనా ? ఏమిటి, అత్తయ్య ఏడు స్తూంది ?'' ఆశ్చర్యంగా అడిగాడు సురేష్.

వరలక్ష్మి పమిట చెరుగుతో కళ్ళు తుడుచుకొంటూ అవతలికి వెళ్ళి పోయింది. అభిమానంతో, దుఃఖంతో ఆమె ముఖం కందిపోయింది.

"నువ్విక్కడే ఉన్నావా ? అక్కడ మామయ్య కంగారుపడుతున్నాడు, నువ్వు లీవ్ పొడిగించి ఎక్కడెక్కడ తిరుగుతున్నావోనని. రెండువేలు వచ్చే బంగారంలాంటి ఉద్యోగం కాస్తా వదులుకు కూర్చుంటావేమోనని మామయ్యొ ఒకటే ఇదై పోతున్నాడు. ఇంతకీ లీవ్ ఎందుకు పొడిగించినట్టు ? ఇక్కడ తమరు చేస్తున్న రాచకార్య మేమిటి, మహానుభావా ?"

సురేష్ ఖర్చీఫ్ తీసి ముఖంమీద రుద్దుకొంటూ, "మన సుందరమ్మ వెళ్ళి పోయింది తెలుసా ?" అన్నాడు.

''ఎక్కడికి ?"

''ఎక్కడికో ఎవరికి తెలుసు ? పని వెదుక్కుంటూ వెళ్ళిపోయింది. పని ఎక్కడ దొరికితే అక్కడ ఆగుతుందట. ఓహ్ ! ఎంత ఆశ్చర్యకరమైన మనిషి ఆమె ?"

"అసలేం జరిగింది, సురేష్ ?" సస్పెన్స్ భరించలేకపోతున్నట్టుగా అడిగాడు రాజీవ్.

"ఆమె చెల్లెలి మొగుడట. భాస్కర్ అట అతడి పేరు. మామయ్య దగ్గరికి ఏదో భూమి పట్టాకోసం వచ్చాడు నిన్న." జరిగిన సంఘటన పూస గ్రుచ్చినట్టుగా చెప్పాడు. భాస్కర్ ముఖాన పప్పుగిన్నె బోర్లించడం చెప్పి నవ్వసాగాడు.

రాజీవ్‌మాత్రం నవ్వలేకపోయాడు. అతడి వదనం విచార మేఘాచ్ఛాదిత మైంది. "అతడొచ్చి ఏదో వాగితే మాత్రం ? తనెందుకు వెళ్ళిపోవాలి ?"

"అత్తయ్యకు ఆమె అంటేనే పడదు. పైగా అతడు ఏదేదో చెప్పి వెళ్ళాడు. ఇలాటి పాపిష్టురాలు వండిన కూడు తిన్నామా అని ఒకటే గొణుగు తూంది అత్తయ్య. ఒకటే సూటీ పోటీ

కూడంలంటూంది. అందుకని వెళ్ళి పోయింది. వాళ్ళవాళ్ళు ఎవరైనా వచ్చి గొడవచేస్తారని భయపడి ఉండవచ్చు కూడా."

"నువ్వేమిటి ఈ అవతారం దాల్చావు ? మాసిన గడ్డం ! మాసిన దుస్తులు ! ఎప్పుడూ ఫ్రెష్‌గా కడిగిన ముత్యంలా ఉండేవాడివి ! కొంపదీసి ప్రేమ వ్యవహారం కాదుకదా ?"

"ఇదా ? ఇది ..." సురేష్ పేల వంగా నవ్వుతూ గడ్డం తడుము కొన్నాడు. "సుందరమ్మకోసం ! ఆమె నన్నో దేవదాసును చేసిపోయింది."

"ఇది ప్రపంచంలో ఎనిమిదో వింత కాదుకదా ?" విచిత్రంగా చూశాడు రాజీవ్. "నీలాంటి షోకిల్లా పురుషుడు, స్నేహానికి కూడా క్రింది మనుషులు తగదనుకొనేవాడివి – ఒక వంట మనిషిని ప్రేమించడమా ?"

"ప్రేమకు ఉచ్చనీచాలు తెలియవని అనుభవం చెప్పింది, సార్ !"

రాజీవ్‌కీ, సురేష్‌కీ బంధుత్వమేకాదు మంచి స్నేహం కూడా ఉంది. సురేష్‌కి దాచుకోవలసింది ఏమీ కనిపించలేదు రాజీవ్ దగ్గర. శ్యామను తను ప్రేమిం చడం, ఆమె తిరస్కరించడం అంతా చెప్పాడు. "ఆమె వెళ్ళిపోతుంటే వెళ్ళ కుండా ఆపే ఉపాయమేదీ కనిపించ లేదు, రాజా ! వెళ్ళిపోయాక ఏదో శూన్యం. మనసంతా ఏమిటో ఆరాటం. ఎక్కడున్నాసరే, వెదికి తెచ్చుకోవా లన్న కోరిక. ఆమె తప్పుచేసిన మనిషిలా కనిపించడంలేదు నాకు. చేయని తప్పుకు శిక్ష ఎందుకు విధించు కొందో, ఎందుకిలా తనవాళ్ళందరి నుండి పారిపోయి వచ్చిందో నాకు తెలుసుకోవాలని ఉంది. రేపు వాళ్ళ పల్లెకు వెడుతున్నాను. అన్ని సంగతులు తెలుసుకు వస్తాను. ఎక్కడున్నాసరే ఆమెను వెదికి పట్టుకు వస్తాను !"

రాజీవ్ ఉదాసీనంగా, "ఈ మహా నగరంలో ఎక్కడుందని వెదుకు తావు ?" అన్నాడు

"ఈ నగరమే కాదు ఆమెకోసం ఈ భూగోళమంతా అంగుళం, అంగుళం వెదుకుతాను. ఎక్కడున్నాసరే పట్టుకు తీసుకు వస్తాను !"

"తెచ్చి ఏంచేస్తావ్ ? ఆమె మనసు నీది కాదుగా ?"

"అవును. నాదికాదు. కాదు గనుకే వెళ్ళిపోయింది. ఆమె మనసే నాదైతే నా అంత అదృష్టవంతుడు ఉండేవాడు కాదు." సురేష్ గాఢంగా నిట్టూర్చాడు. "ఆమె మనసు నాది కాకపోయినా మనిషినైనా కళ్ళముందు నిలుపు కొంటాను. ఎక్కడికీ పారిపోనివ్వను."

ప్రేమా, పిచ్చీ ఒకటేనన్నారు వెనుకటి కెవరో.

పిచ్చివాడికీ హద్దులు తెలియవు. ప్రేమించినవాడికీ హద్దులు తెలియవు.

ఈ ఇద్దరు ఏ క్షణాన ఏంచేస్తారో తెలియదు.

## 24

చిన్న స్టేషన్.

సురేష్ రైలు దిగి స్టేషన్ ఇవతలికి వచ్చాడు.

"రామాపురానికి దారి ఎటు ?"

"ఆ కనిపించే మిట్టఎక్కితే చెట్ల గుంపులో చిన్న చిన్న ఇళ్ళు కనిపిస్తాయి. ఈ దారినే ఎళ్లండి."

తెల్లవారి ఇంకా రెండుగంటలు కాలేదు. సూర్యుని నులివెచ్చని కిరణాలు ఒంటిని హాయిగా స్పృశిస్తున్నాయి. సురేష్ కాలవ ప్రక్కనుండి నెమ్మదిగా నడుస్తున్నాడు. కాలువ పరిసరాలు ఎంతో రమ్యంగా ఉన్నాయి. ఇద్దరు జాలరులు చేపలబుట్ట చంకకు తగిలించుకొని చేపల వల ఒక మోపులా భుజం మీద వేలాడేసుకొని ముందుకు నడుస్తున్నారు. పరిసరాల సౌందర్యానికి ముగ్ధుడైపోయిన సురేష్ కెమెరా తీసుకు రానందుకు చింతించసాగాడు. మరోసారి వచ్చి ఫొటో తీసికెళ్ళాలని అనుకొన్నాడు.

సురేష్ రామాపురం ఊళ్లో అడుగు పెట్టాడు.

సత్రంముందు వేపచెట్టు తిన్నెమీద ముగ్గురు కూర్చొని ఉన్నారు. వాళ్ళలో ముఖాన పెద్ద నామాలతో ఉన్న ఆయన్ని ఉద్దేశించి, "కృష్ణమూర్తిగారి ఇల్లు ఎక్కడండీ ?" అని అడిగాడు సురేష్

అతడే భైరవాచార్లు. సురేష్‌ని ఎగాదిగా చూశాడు.

ఖరీదైన దుస్తుల్లో, చేతికి ధగధగలాడే రెండు ఉంగరాలతో సురేష్ ఖరీదైన మనిషిలాగే కనిపించాడు.

"తమరిది ఏ ఊరండీ ?" భైరవాచార్లు ఎదురు ప్రశ్నించాడు, నింపాదిగా ముక్కుకు నశ్యం పట్టిస్తూ.

"నా ఊరేదో, నేనెవరో చెప్పకపోతే కృష్ణమూర్తిగారి ఇల్లు ఎక్కడో చెప్పరా అండీ ?"

"కోపం తెచ్చుకోకు, బాబూ ! ఈ ఊరికి కొత్తగా వచ్చావు. ఈ మధ్య ఈ ఊరికి పోలీస్ మనుషులు రావడం ఎక్కువైంది. ఆ మధ్య ఒకడు వచ్చాడు. పిచ్చివాడిలా నటిస్తూ ఊళ్ళో తిరిగేవాడు. పాపం ! ఎవరో పిచ్చివాడనే అనుకొన్నాం. కాని, వాడు వెళ్ళిపోయిన మరురోజే లింగయ్యనూ, స్వామినీ పోలీసులు పట్టు కెళ్ళిపోయారు. హత్తెరీ ! అప్పుడుగాని వాడు పోలీస్ మనిషని తెలుసుకోలేకపోయాం !"

సురేష్ గుండె లయ తప్పింది. శ్యామ చెప్పే పిచ్చివాడు ఇతడేనా ?

(సశేషం)

Printed and Published by A. Chandra Sekar Rao at 5-9-88, Public Garden Road Hyderabad, for YUVA Publications and Printed at Dolton Press, Public Garden Road, Hyderabad-500 001. Editor . A. SUDHAKARA RAO

